పరిపూర్ణ ప్రబోధ గ్రంథమాల - *11*

ఓం
శ్రీగురుభ్యోనమః

# పరిపూర్ణము ఎరుక

## తారతమ్యము
## శ్రుతి స్మృతుల ప్రమాణములు
## భావార్థ వివరములు



గురుదీక్ష దక్షా
చిన్మయానంద మంత చిన్నయ్య
ఎమ్.ఏ.,బి.యిడి

ప్రతులు *1000* *2010*
వెల : ఏమిలేదు. (చూడుము పుట సంఖ్య 79)

శ్రీగురుభ్యోనమః



## ఆశీస్సులు

శ్రీ పరిపూర్ణ దర్శనాచార్య సదానంద యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు, బి.ఏ., బి.ఎల్, గారు తమ పరిపూర్ణదర్శనమను గ్రంథముచివర పరిపూర్ణము ఎరుక - రెంటి తారతమ్యములను తెల్పు శ్రుతి స్మృతులకు మత్ శిష్యుడు చిన్మయానంద మంత చిన్నయ్య భావార్థములు కూర్చినందులకు సంతషించితిని. పాఠకులకు యిది ఎంతో ఉపయుక్తముగా నుండునని తలంచుచున్నాను. వీరిని ఆశీర్వదించుచున్నాను.

ప్రభోధానంద మల్లు వెంకటరెడాఖ్య రాజయోగి

శ్రీ వికృతి నామ సంవత్సర
ఆషాఢ శుద్ధ పౌర్ణమి
తేది 25-07-2010

## దాతల పేర్లు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ మతి అ.ప. అంజమ్మ సమేత శ్రీ అచలర్షి నిశ్చలానంద మండ్ల రాములు రాజయోగి | రూ॥ 2000/- |
| 2. | శ్రీ అచల పరిపూర్ణ జమ్ముల కేశవ రావు, బర్హంపురము, ఒరిస్సా | రూ॥ 500/- |
| 3. | బ్రహ్మ శ్రీ డా॥ సత్యనారాయణ టేల్కర్ | రూ॥ 500/- |
| 4. | అచల పరిపూర్ణ శ్రీ మిట్టె రామలింగం, ప్రధానోపాధ్యాయులు | రూ॥ 500/- |
| 5. | అచలర్షి గౌనొళ్ళ మాధవరెడ్డి రాజయోగి, అప్పిరెడ్డి పల్లి | రూ॥ 250/- |
| 6. | శ్రీ అచలానంద గనుగొండి కిష్టప్ప రాజయోగి, కోటకొండ | రూ॥ 250/- |

అముద్రితము శ్రీ శివరామ దీక్షిత చూర్ణిక - భావార్థములు

శ్రీగురుభ్యోనమః

## పరిపూర్ణము, ఎరుక తారతమ్యము - శ్రుతి స్మృతుల ప్రమాణములు భావార్థ వివరములు

# ముందుమాట

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహా" పరిపూర్ణ పరబయలు సాక్షాత్తుగా చెప్పే శ్రుతులుండుటకు వీలులేదు. ఐనను (లక్ష్యార్థముచే) వేదముల ప్రధాన ఆశయము ఈ పరిపూర్ణపరబ్రహ్మమై వుండక తప్పదని యెంచి, శ్రీమదశరీర అచలర్షి పరిపూర్ణదర్శనాచార్య సదానంద యిలపకుర్తి వీర వెంకటరామచంద్రరావు, బి.ఎ, బి.ఎల్. రాజయోగి గారు "పరిపూర్ణ దర్శనము" అను గ్రంథమును రచించినారు. ఇందు పరిపూర్ణ సిద్ధాంతమునకు సంబంధించిన అన్ని విషయములు సమగ్రంగా సంపూర్ణముగా వివరించినారు. దీనిని **"పరిపూర్ణ సిద్ధాంత విజ్ఞాన సర్వస్వము"** అని అనదగును. ఇందు ఈ సిద్ధాంతమునకు సంబంధించిన ఈ విషయం లేదనే ప్రశ్నే ఉత్పన్నం కాదు. ఆ గ్రంథమున ఆమహానుభావుడు చివరి పుటలందు పరిపూర్ణము, ఎరుక-తారతమ్యలకు సంబంధించిన శ్రుతి స్మృతులను పొందుపరిచినారు. నా గురుదేవుని కృపవల్ల వాటికి భావార్థ వివరములు వ్రాయవలెననెడి తలంపు కలిగింది. వ్రాసి అచ్చొత్తించుటకు పూనుకొన్నాను. ఈ శ్రుతి స్మృతుల ప్రమాణములను వారి ఇతర రచనల నుండి ఉపయుక్తమగు వివరణములు కొన్నింటిని గైకొనుటకు అనుమతిని ప్రసాదించమని శ్రీమతి అ.ప.॥ యిలపకుర్తి అమ్మాజీ రుస్తుంబాద, వీవర్స్‌కాలనీ, నర్సాపురము, పశ్చిమగోదావరి జిల్లా, విలాసముతో వుత్తరము వ్రాయుట జరిగినది. శ్రీమతి అమ్మాజీగారు నర్సాపురంలో లేరనితెలియవచ్చింది. పరిపూర్ణ దర్శనము నుండి వీటిని గైకొన్నందులకు శ్రీమతి అమ్మాజీ గారికి With grateful Ackowledgements ను, కృతజ్ఞాతాభివందనములను సమర్పించుకొంటున్నాను.

పరిపూర్ణబోధ చాల సులభమైన బోధయని అంటారు. కాని అందు అనేకమైన తాత్విక విషయాలు నిగూఢంగా దాగియున్నవి. అట్టి నిగూఢ విషయములకు వివరములు తెల్పి చదువరులను సంశయ రహితులను చేయుటయే లక్ష్యముగా వీటికి భావార్థ వివరములు వ్రాయబడినవి. ఈ వివరములను చదివిన వారికి పరిపూర్ణము ఎరుక - తారతమ్యములను గ్రహించి సర్వసంశయములు సర్వభ్రాంతులు రహితమై జన్మరహితము సిద్ధించుగాక ! అని మా గురుదేవుని ప్రార్థించుచున్నాను.

ఈ శ్రుతి స్మృతుల భావార్థములు మా అమ్మ నాయనగారైన క్రీ॥శే॥ మంత చిన్నమ్మ, మంత ఎల్లప్పను స్మరించుకొని వారు స్మృతి పథములో మొదలగా మద్గురు దేవులైన శ్రీమదశరీర అచలర్షి ప్రబోధానంద మల్లు వెంకట రెడ్డాఖ్య రాజయోగి గారి పాదపద్మములకు పదకొండవ పూజాపుష్పముగా అర్పించుచున్నాను.

వేదము వేదాంతము సిద్ధాంతము. పరిపూర్ణబోధ సిద్ధాంత పద్ధతి. ఇది కథగాదు, వేద వేదాంత సిద్ధాంత విచారణ. జనన మరణ వ్యథ మానుటకై ఆగమనిగమోపనిషత్సాగర మథితార్థము. ఈ శృతి స్మృతులు రసికులకు రత్నాలు ఇతరులకు రాళ్ళు. ఇందుకు కూర్చిన వివరములు ఈ సిద్ధాంతమునకు భంగము కలుగకుండ కడు జాగ్రత్త వహించబడినది. అయినను ఇందేవైన తప్పులు దొర్లిన మన్నించి విజ్ఞులు సరిచేసుకొని చదువుకొనగలరని ప్రార్థన.

పరిపూర్ణము ఎరుక - వివరములందు పునరుక్తి యున్నది. క.ద. 13 పునరుక్తి గలిగి యుండిన । విని కోపము శాయవలదు" అని ప్రార్థించుచున్నాను.

అచ్చుకు అనువుగా శుద్ధ ప్రతివ్రాసి యిచ్చిన శ్రీ మిట్టే రామలింగం, ప్రధానోపాధ్యాయులకు, సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీరామ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ వారికి కృతజ్ఞతాపూర్వాకముగా వందనములర్పించుచున్నాను. వీరికి గురుకటాక్షములు.

ఈ ప్రతిని సరిచూచి సవరించి తమ అభిప్రాయమును ఆత్మీయంగా అక్షరబద్ధం చేసిన బ్రహ్మశ్రీ డా॥ బుక్కా బాలస్వామి, ఎం.ఎ. పి.హెచ్.డి. విశ్రాంతాచార్యులు, తెలుగు భాషావిభాగము, ప్రభుత్వ డిగ్రీకళాశాల మహబూబ్‌నగరము గారికి మరియు ఈ గ్రంథ ముద్రణకు విరాళములిచ్చి ప్రోత్సహించిన దాతలందరికి కృతజ్ఞాతాభివందనములు అర్పిస్తూ, మద్గురువులు వీరందరికి ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

31-05-2010
వికృతినామ సంవత్సరము
వైశాఖ శుద్ధచవితి.

నిజ గురుపాదసేవలో
గురుదీక్షాదక్ష చిన్నయనందా మంత చిన్నయ్య



# సహృదయ వాణి

డా॥ బిక్కా బాలస్వామి
ఎం.ఏ, పి.హెచ్.డి (తెలుగు),
ఎం.ఏ., (సంస్కృతం) ఎం.ఏ., (ఆంగ్లము)
విశ్రాంతాచార్యులు, తెలుగుభాషా విభాగం.
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పాలమూరు.

బ్రహ్మశ్రీ మంత చిన్నయ్యగారు అచల. పరిపూర్ణ మార్గానురక్తులు, గురుదీక్షాదక్షులు, తత్త్వజ్ఞాన సంపన్నులు. వీరు శ్రీ పరిపూర్ణ దర్శనాచార్య సదానంద యిలకుర్తి వీరవెంకటరామచంద్రరావు రాజయోగిగారు రచించిన "పరిపూర్ణ దర్శనము" ను పరిపూర్ణ సిద్ధాంత విజ్ఞాన సర్వస్వంగా భావించినారు. ఈ పరిపూర్ణదర్శనమున చివర కూర్చిన పరిపూర్ణము ఎరుక - శ్రుతిస్మృతుల ప్రమాణాములకు భావార్థములను కూర్చి, వివరించుటకు ప్రయత్నించి కృతకృత్యులైనారని భావిస్తున్నాను.

మహర్షులు ధ్యానయోగానుగతులై దర్శించిన సత్యములను దర్శనముల రూపములలో వెలువరించినారు. "దృశ్యతే అనేన ఇతి దర్శనమ్" అనగా దర్శింపజేయునది దర్శనము. అది దేనిని చూపించును ? నేనెవడను ? ఎచటి నుండి వచ్చితిని ? ఈ జగత్తు యొక్క సత్యస్వరూప మేమిటి ? దీని సృష్టి కారణ మెట్టిది ? అది చేతనమా ? అచేతనమా? ఈ విశ్వమున నేనేమి చేయవలెను? ఈ మొదలగు ప్రశ్నలకు తాత్త్వికమైన సమాధానాలను దర్శనాలు సమకూర్చును.

**"కింకారణం బ్రహ్మ కుతఃస్మజాతాః**
**జీవానుకేన క్వచ సంప్రతిష్ఠా**
**అధిష్ఠితాః కేన సుఖేతరేషు**
**వర్తా మహేబ్రహ్మవిదో వ్యవస్థాం"॥** **1-1 శ్వేతాశ్వతరోపనిషత్తు**

- జగత్కారణమైన బ్రహ్మమెట్టిది? మనమెట్లు జన్మించితిమి? ఎట్లు జీవించగలుగుచున్నాము? ఎందున్నాము ? ఏమగుదుము? ఎవరు ప్రేరేపింపగా సుఖాదివ్యవస్థ కలవారమగుచున్నాము? ఈ ప్రశ్నల కుత్తరముగా సిద్ధతత్వమును చెప్పునది, విధి నిషేదముల శాసించునది దర్శనశాస్త్రము. వేదభూమియైన భారతదేశంలో ఇట్టి దర్శన శాస్త్రములనేకములన్నవి.

ఈ అచల ఋషి విజ్ఞానదర్శన పరంపరలో భాగంగా వెలువరించబడిన గ్రంథ రాజము "పరిపూర్ణదర్శనము".

ఇట్టి పరిపూర్ణసిద్ధాంత విజ్ఞానసర్వస్వమైన పరిపూర్ణ దర్శనమున చివర కూర్చిన శ్రుతి ప్రమాణములకు ఉపనిషత్తులు, భగవద్గీత, గురుగీత తదితర తాత్త్విక

గ్రంధములలోని శ్లోకాలలో నిక్షిప్తమైన తాత్త్విక విషయాలను, శ్రీకృష్ణదేశికేంద్రుల వారి శుద్ధ నిర్గుణతత్వ కందార్థదర్పులలోని సారాంశాన్ని సోపపత్తికంగా, సముచితంగా, సమంజసంగా అన్వయించి, భావార్థ వివరములుగా వివరించినారు.

గురువు స్థానాన్ని, ప్రాముఖ్యాన్ని దేవీ భాగవతం ఎంతో మహత్తరంగా వర్ణించింది.

**శ్లో॥ పితుఃశత గుణామాతా గౌరవేచేతి నిశ్చితమ్ ।**
**మాతుఃశతగుణః పూజ్యః జ్ఞాన దాతాగురుః ప్రభుః॥ - దేవిభాగవతం**

తండ్రికంటే తల్లి వందపాళ్ళు గౌరవమునకు అర్హురాలు. తల్లికంటే కూడా నూరింతలు పూజింపదగినవాడు గురువు అంటోంది దేవీ భాగవతం. మాన్యశ్రీ మంత చిన్నయ్యగారు స్వతహాగా గురుభక్తి ప్రపూర్ణులు. మాతాపితల సేవా పరాయణులు. కనుకనే తన జన్మ కారకులైన కీ॥శే॥ మంత చిన్నమ్మ మంత ఎల్లప్ప పుణ్యదంపతులను సంస్మరించుకొని అచల గురుదీక్ష ప్రదాతలైన ప్రబోధానంద మల్లు వెంకటార్యులకు గురుదక్షిణగా ఈ తత్త్వగ్రంథాన్ని "ఏకాదశమపుష్పం"గా సమర్పించి ఋణవిముక్తులైనారు.

పరిపూర్ణము ఎరుక - తారతమ్యము శ్రుతి స్మృతుల ప్రమాణములు అనే తాత్త్విక గ్రంథాన్ని సరిచూసి, ముద్రణదోషాలు, భాషా దోషాలు సవరించమని మిత్రులు కోరినారు. ఈ గ్రంథాన్ని సవరించి, సరిచూసే అవకాశాన్ని కల్పించి, పరోక్షంగా అనేక తాత్త్విక విషయాలను గ్రహించేటట్లు చేసిన బ్రహ్మశ్రీ మంతచిన్నయ్య గారికి హార్థిక కృతజ్ఞతలు, అభినందనలు తెలియజేస్తున్నాను. భవిష్యత్తులో వీరు శతాధిక గ్రంథకర్తలు కావాలని, వారికి సర్వాంతర్యామి తగిన శక్తి యుక్తులను, సంపూర్ణ ఆయురారోగ్యాలను ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

జగద్గురువులుగా ప్రసిద్ధిచెందిన వ్యాసమహర్షి జయంతి రోజున నా కప్పగించిన కార్యమును పూర్తిగావించితిని. ఇట్లు నిరంతర తాత్త్విక విజ్ఞాన వాహినికి మూలభూతులైన గురు పరంపరను స్మరించుకొనే అవకాశాన్ని కల్పించిన మిత్రశ్రీ మంతచిన్నయ్య గారికి పునఃధన్యవాదములు.

**న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః ।**
**తత్త్వ జ్ఞానాత్పరంనాస్తి తస్మై శ్రీ గురవే నమః**

ఓం తత్సత్

తేది 25.07.2010 — తత్త్వజ్ఞానాన్వేషకులు
భానువారం — **డా॥ బుక్కాబాలస్వామి**



శ్రీగురుభ్యోనమః

**డా॥ లక్ష్మణ ఎన్. దూస**
భీవండి, మహారాష్ట్ర.

**శ్లో ॥ అనంత కోటి జన్మానాం । ఆత్మజ్ఞానంచ లభ్యతే ।**
**ఆత్మజ్ఞాన మనంతాని । లభ్యతే పూర్ణబోధతః ॥**

శ్రీ గురు మంత చిన్నయ్య స్వాముల వారు ఆత్మజ్ఞానం సంపాదించి దాన్ని పెంపొందించుకొని శ్రీ ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డాఖ్య రాజయోగి గారికి శుశ్రూషలు జేసి పరిపూర్ణ భావజ్ఞులైనారు. తాను తరించి యితరులను తరింపజేయువలయుననే తపన గలిగి పరిపూర్ణ బోధను చాటే కొన్ని గ్రంథములకు భావార్థలు కూర్చి ప్రచురించిరి. వీరు ముద్రించ దలచిన పరిపూర్ణము ఎరుక - రెంటి తారతమ్యములు శ్రుతి స్మృతుల ప్రమాణముల యొక్క జిరాక్స్ ప్రతిని మేము కడదాక చదివి ఆనందించితిమి. అందలి భావార్థములు గురుపుత్రులకు చాల ఉపయోగకరముగా నున్నవని తలంచుచున్నాము.

వీరు నైజాం కాలంలో ఉర్దూ మాధ్యమున 10వ తరగతి వరకు, ఆ తర్వాత ఆంగ్లమాధ్యమున స్వయం కృషిద్వారా M.A., B.Ed. పట్టా పొందిరి. ఉపాధ్యాయునిగా విద్యార్థుల నెందరినో తీర్చిదిద్దిరి.

వీరు గురువాక్యోపనిషత్తు, అనంతోపనిషత్తు సర్వసార పూర్ణోపనిషత్తు, కేనోపనిషత్తుతోపాటు ఇటీవల పరిపూర్ణ సిద్ధాంతమునే ప్రకటపరిచిన నిరాలంబోపనిషత్తు నకు భావార్థములు కూర్చి గురుభక్తుల కందించిరి. నేను కోరిన వెంటనే వయోభారము మరియు ఆరోగ్యమును లెక్క జేయక భూమానంద వాక్యత్రయాంతర్గత కందార్థ దరువులకు భావార్థ వివరములు కూర్చి ముద్రించిరి. ధన్యవాదములు.

గురువాక్యోపనిషత్తు (భావార్థములు) కొరతగా నున్నదని తెలిసి మేము మా సోదరుడు శ్రీ దూస నాంపల్లి కలసి రెండవముద్రణ కవకాశ కలిగించుమని కోరగా ఆ భాగ్యము మాకు ప్రసాదించిరి.

శ్రీమదచలర్షి పొన్నాలరాజయోగి ప్రియ శిష్యులైన శ్రీమదశరీర అచలర్షి పరిపూర్ణ దర్శనాచార్య సదానంద యిలప కుర్తి వీర వెంకట రామచంద్రరావు గారు అనేక అచల గ్రంథములు వ్రాసి వాసికెక్కినారు. అదేవిధంగా గురుదీక్షాదక్ష చిన్మయానంద మంత చిన్నయ్యగారు కూడా అందరి కర్థమగునట్లు అచల గ్రంథములకు భావార్థములు వ్రాసి గురుభక్తులకు అందించుచున్నారు. వీరి సతీమణి అ.పా॥ మంత భద్రమ్మ అనారోగ్యముగా యున్నను ఉపచారములు చేస్తునే రచనలు సాగించినారు వీరికి గురుమూర్తి అయురారోగ్యములు ప్రసాదించవలయునని ప్రార్థించుచున్నాము.

గురుపాదసేవకుడు
**డా. దూస లక్ష్మణార్యులు, భీవండి.**

భీవండి (మహారాష్ట్ర)
తేది 20.7.2010

**శ్రీ గురుభ్యోనమః**

శ్లో॥ పరిపూర్ణానంద నర్సింహార్యపాదకమల సేవకం ।
ప్రబోధానంద వెంకటార్య సద్గురుం భజామ్యహం॥

# పరిపూర్ణము, ఎరుక - తారతమ్యము - శ్రుతి స్మృతుల ప్రమాణములు

ముందుగా పరిపూర్ణము, ఎరుకను గూర్చి తెలుసుకుందాము.

**పరిపూర్ణము:** పరిపూర్ణ సిద్ధాంతమును ఒక్క వాక్యంలో తెలియపరచాలంటే పరిపూర్ణము, లేనెరుకను యెరిగి యెరుకను మానుమని సిద్ధాంతము చెబుతుంది. ఇదే భావము.

**శ్లో॥ అశరీరం సర్వదాస్తి । శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి । రన్యథా భ్రమకారణం ॥**

అని ఈ శ్లోకం వల్లవ్యక్తమౌతుంది.

ఈ సిద్ధాంతమును ఉద్ధరించిన శ్రీ శివరామదీక్షితుల వారు పరిపూర్ణమును ఈ క్రింది విధంగా వివరించినారు.

**పరిపూర్ణ పరబ్రహ్మము:** "పుట్టనిదీ - చావనిదీ, రాకడ - పోకడలేనిదీ, సకలదేశాల యందు, సర్వకాలాల యందు, సమస్తమైన వస్తువులయందు, మొదట కొనలేక చలించక ఒక్కతీరుగా తనకు తానే స్వతసిద్ధమై యున్నది". శ్రీ శివరామదీక్షితులు. దీనినే పరిపూర్ణ పరబ్రహ్మమని, పరబయలని, అచలమని పరిపూర్ణమని వ్యవహరించుచున్నారు. -

"ఏది తాను చూడకపోయినప్పటికీ స్వత సిద్ధమై కనిపించునో, తాను లేనని లేక పోయిన యేది వుండియే వున్నదో, తన్నుతాను మరచినప్పుడు ఏది జ్ఞాపకమునకు వచ్చునో అది పరిపూర్ణపరబాహ్యము. దానిని తప్పించుకొని వుండుటకు ఎట్లు సాధ్యమగును ? అందువలన "అఖిలకాలేషు పరిపూర్ణమస్తి" అని నిర్ణయము". శ్రీ దయానంద పొన్నాల రాజయోగి.

**ఎరుక :** ఎరుక అనగా శుద్ధ జ్ఞానము యొక్క మారు రూపమే జగత్తు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఏకమేవా ౨ ద్వితీయం బ్రహ్మ" "ఏకం అనేకం భవతి" యిత్యాది శ్రుతులలో నున్న బ్రహ్మ శబ్దమునకు అచ్చ తెలుగులో **ఎరుక** అనే శబ్దమును వాడినారు. కేవల పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప మిగిలినదంతయు లేనెరుకగా నిర్ణయింపబడింది. పరిపూర్ణ సిద్ధాంతం దృష్ట్యా అసలు పరిపూర్ణమున ఎరుకకు ఉనికి అనేది వుండుటకే వీలు లేనిది అగుటచే యెరుకను **లేనెరుక** యని పరిపూర్ణ భావజ్ఞులు నామకరణము చేసియున్నారు.

## 1. ఎరుక:-

| తదేజతి, తన్నైజతి, తుద్దూరే, తద్వంతికే. తదంతరస్య సర్వస్య, తదు సర్వస్యాస్యబాహ్యతః॥ |
|---|

ఈశావాశ్య

తా॥ అది అనగా జగత్కారణ బ్రహ్మము కదలును, అది కదలదు, అది దూరముగా నున్నది, అది దగ్గరగా నున్నది. అది అన్నిటి లోపల నున్నది. అది అన్నిటి బైట కూడా నున్నది.

**అది (అనగా బ్రహ్మము లేక ఎరుక) కదులును.**

కదిలేది వున్నప్పుడే కదలని దాన్ని గురించి ఆలోచన వస్తుంది. ఆత్మతో సహా సకల జీవేశ్వర జగత్తంతా కదలుచున్నది. కదలనిది దీని కతీతంగా వుండి వుండాలంటారు శ్రీ పరిపూర్ణదర్శణాచార్య సదానంద యిలపకుర్తి వీరవెంకట రామచందరరావు గారు. చలాచలము గానిదే పరిపూర్ణము.

బ్రహ్మము (ఎరుక) యొక్క సన్నిధానములో మాయ చలించి సృష్టిచేయుచున్నది. బ్రహ్మము అచలముగా నున్నదని అద్వైతులంటారు. అయస్కాంతసన్నిధిలో సూది చలించినపుడు చలనము అయిస్కాంతముదా? లేక సూదిదా? అన్నప్పుడు చలనము అయస్కాంతముదే. అది లాగితేనే సూది కదలుచున్నది. కనుక బాహ్య దృష్టికి సూది చలించుచున్నట్లు, సూదంటు రాయి అచల స్థితిలో యున్నట్లు గోచరించినను చలన కారణమగు సూదంటు రాయిని అచలమనరాదు! "ఇంద్ర జాల మిదం సర్వం" అని అంటే ఇంద్ర జాలకుడే ఆ బ్రహ్మమనవలెను. "బ్రహ్మైవవివర్తం" మాయా పరిణామ మన్నప్పటికీ బ్రహ్మమే ఆ వివర్త కారణం. ఎట్లు అనగా వివర్తకారణమునకు ప్రసిద్ధముగా యివ్వబడిన రజ్జు సర్పదృష్టాంతములో రజ్జు స్థానమున ఆ బ్రహ్మమే యున్నది. "ఏకమేవా ఽ ద్వితీయం బ్రహ్మ." బ్రహ్మము తప్ప మరొకటి లేనప్పుడు దేనిని చూచి యెవరు యేస్మృతి జ్ఞానముతో జీవేశ్వర జగత్తుగా భ్రమించిరి అని ప్రశ్నిస్తే జవాబుగా బ్రహ్మమునే చూచుకొని బ్రహ్మమే, బ్రహ్మమందలి పూర్వ సృష్టుల యొక్క స్మృతి జ్ఞానముతో జీవేశ్వర జగద్భ్రాంతి పొందెను అని చెప్పవలసినదే. అట్లే ఆరంభ పరిణామ వివర్త, నిమిత్త, ఉపాదాన కారణము లన్నియు బ్రహ్మమునందే పర్యవసించుచున్నవి.

కార్యకారణములకు భిన్నత్వము చెప్పరాదు. ఒకప్పుడు తానుతానుగా, ఒకప్పుడు కారణ రూపముగా, మరల ప్రతి సంచర పద్ధతిగా (పూర్వపరిణామం) నిరంతర చలన శీలమై మార్పే సహజ స్వభావముగా మార్పులు చెందు ఈ కారణ బ్రహ్మము సత్యమని, శాశ్వతమని చెప్పరాదు. ఈ కారణబ్రహ్మానుండి కార్యరూపముతో ఆవిర్భవించిన జీవేశ్వర జగత్తునందు సర్వత్ర అట్టి చలన రూపమే ద్యోతకమగుచున్నది. కనుక సృష్టి కారణమగు ఆ బ్రహ్మమునందు, కార్యరూపమగు జీవేశ్వర జగత్తునందు సర్వము చలనరూపమే. చలనములేనిచో సృష్టియే లేదు.

సృష్టి సంకల్పమే ఈ కారణబ్రహ్మమునకు కలుగక పూర్వం గాఢ సుషుప్తిలో వలె అచల స్థితి యందు గలదేమో! అపుడు చలన లక్షణము గర్భీకృతమై బీజరూపమున నున్నదేగాని అసలే లేకపోలేదు. ఈ తాత్కాలిక అచల స్థితిని ఊహించి అదే అచలమని మతములలో తలమానికమైన అద్వైతకారులు భ్రమించినారని అనవలసి వస్తుంది.

**"సోఽ కామయత బహుస్యాం ప్రజాయే యేతి"** అనురీతిగా సృష్టికి పూర్వము. తాత్కాలికముగా అచలస్థితిలో నున్నను కారణ బ్రహ్మము యొక్క అచలస్థితికి భంగమై చలన స్థితి యేర్పడినది. **"సోఽ కామయత"** అనగా కోరెను లేక సంకల్పించెను. అని అర్థము. సంకల్పము మానసిక చలనముగదా ! అదిస్పష్టంగా కలిగిన చలనము తీవ్రమై సృష్టి కార్యము లందు స్థూలముగా గోచరమగుచున్నది. కనుక అది కదులుట లేదని యనరాదని నిశ్చయమగుచున్నది. ఎప్పుడూ కదలిక లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మమని సిద్ధించు చున్నది.

సృష్టికి పూర్వము అచలరూపంగా, సృష్టికాలమందు చలనాత్మకంగా, తిరిగి ప్రళయానంతరము అచల రూపంగా వున్నదీ బ్రహ్మమే, మరియు సర్వోపాధులందుండి తాను చలించక దేహేంద్రియాదుల నన్నిటినీ చలింప జేయుచు వుండేది యిదే.

బ్రహ్మము యొక్క సన్నిధానములో పరిణమించు చున్న మాయా విషయములో కారణము కూడ, కారణ కర్తృత్వములు కూడా బ్రహ్మమునకే యున్నవని చెప్పనగును. **"తేనవినా తృణాగ్రమపినచలతి"** బ్రహ్మ కదిలించనిచో గడ్డి పోచ కొననైన కదులదని శ్రుతి చెప్పుచున్నది. కనుక బ్రహ్మమే కదులుచున్నది. ఎంతదూరం విచారించిన ప్రపంచములో అన్నీ చలన రూపమయ్యేవున్నాయి. చివరకు పరమాణవులు అందలి ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు కూడ నిరంతర చలన క్రియలందే యున్నవి. ఈ చలన క్రియలో విశ్రాంతి స్థానములుంటే యుండవచ్చును కాని చూచి దానికి చలనము లేదనుట సరిగాదు.

అద్వైత పద్ధతి యందు బ్రహ్మసాన్నిధ్యమందు జడమని చెప్పబడే మాయ చలించి జీవేశ్వర జగత్తునకు కారణమయినది. అంటే చలింపజేసేది బ్రహ్మము, చలించేది మాయ. చలన కార్యము జగత్తు. కనుక చలింపజేసే బ్రహ్మముతో సహా సర్వము చలించే వస్తు జాలంలోచేరిపోవును. ఈ బ్రహ్మము సృష్టికి పూర్వం అచలంగా లేదా? అంటే మాయతో సంబంధము కలిగినపుడు చలన క్రియ వున్నది. అంతకు పూర్వం లేదు అని అనాలి. ఆ కల్పంలో ఎవరేని వుంటే మాట్లాడే నేను ఎవరు లేనప్పుడు మాట్లాడనంత మాత్రాన నేను మూగవాడినని ఎవరైనా అనగలరా? అంటే ఒకప్పుడు చలించనంత మాత్రాన ఈ లేనెరుక అచలమనరాదు అది కదలును.

**ఆ బ్రహ్మము కదలదు.** సృష్టికి పూర్వం బ్రహ్మము ఏకం, తాను తానైన స్థితిలో నున్నప్పుడు ఈ బ్రహ్మమునకు చలనములేదు. అచలస్థితిలో యుండెను. కనుక సృష్టికి పూర్వం బ్రహ్మము అచల స్థితిలో యుండెను అని అనవచ్చును. తాత్కాలిక అచలస్థితిలో వున్నంత మాత్రమున పరిపూర్ణ పరబయలు కాదు.

**అది దగ్గరగానున్నది. "శివుడంటే వాడేమి దూరంలేడు మనలో ఉన్నాడు మనకు కానరాడు!"** అని ఒక కవి గానం చేసెండు. **"ఏకం అనేకం భవతి"** తానొక్కడే యుండి అనేకమాయెను. గాని అంతా జడరూపముగా యుండుటవల్ల "తత్సృష్ట్వాతదే వాను

ప్రావిశత్" తాను సృష్టించిన ప్రతిదానియందు తానే అనుప్రవేశము గావించుటవల్ల అన్నిటిలో తెలివి, గుణ, శక్తి, ప్రాణ, జ్ఞానరూపములో తానే వుండుట వల్ల ఆ బ్రహ్మము అన్నిటిలోనుండి అన్నిటికి దగ్గరగా నున్నాడు. ఎంత దగ్గరగా అంటే అంతా తానే అయిఉన్నాడు. ఇందుకు శ్రుతులు **"నేహనా నాస్తికించన, "సర్వం ఖల్విదంబ్రహ్మ" తేన వినా తృణాగ్రమపి నచలతి"** అన్నితానే యై యుండుటవల్ల అన్నిటికి దగ్గరగానున్నాడు. తానైనబ్రహ్మము తనకు దగ్గరగా లేక దూరముగా నుండగలడా ? ఎంత దగ్గర ఉన్నాడంటే అది నీవే అయివున్నావు. కనుక **"నీవే నేనైయుండగ అన్యమెక్కడ.**

**బ్రహ్మము దూరముగా నున్నది.** మానవుడు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములతో తాదాత్మ్యము చెంది నేను స్థూలముగా తెల్లగానున్నాను. నేను తెలివి గలవాడును, నాకేమి తెలియదు అని అంటూ పనులన్నియు చేయుచున్నాడు గాని మహాకారణ శరీరముతో తాదాత్మ్యముచెంది నేను బ్రహ్మనే అని బ్రహ్మభావముతో పనులు చేయుటలేదు. తాను బ్రహ్మమయి కూడ తాను బ్రహ్మ నని అనుకోక జీవునిగా వ్యవహరించుటవల్ల ఆ బ్రహ్మము తనకు చాల దూరముగా నున్నట్లు వ్యవహరించుచున్నాడు. ఇది అజ్ఞానము. తాను బ్రహ్మమును గావలెనని మహావాక్యములను పెద్దల ద్వారా గురువుల ద్వారా **"తత్త్వమసి బ్రహ్మ"** ఆ బ్రహ్మమును నే అయినానని ఉపదేశము పొంది **"అయమాత్మబ్రహ్మయనే"** నిశ్చయమునకు వచ్చి బ్రహ్మమునకు అతి చేరువయ్యినావు అని గుర్తించవలయును.

వ్యవహారములో తాను బ్రహ్మకానని బ్రహ్మకు దగ్గరగుటకు, కాశీ, ప్రయాగ, తిరుపతి, వంటి పుణ్యక్షేత్రములు దర్శించి పరమాత్మకు దగ్గర కాగలిగినానని భావించుట మనము చూస్తున్నాము. ఎరిగిన వారికి బ్రహ్మము తనకు దగ్గరనున్నాడని తానే బ్రహ్మనని, ఎరుగనివారికి ఆ బ్రహ్మము చాల దూరములో నున్నాడని, దగ్గరగుటకు ప్రయత్నించుచున్నారము. జ్ఞానికి శివుడు దగ్గరనున్నాడు. తానే శివుడు "శివో ౨ హం" అజ్ఞానికి చాలదూరంగా అంటే తాను భావించినంత దూరములో నున్నాడు. తనకు దొరకడు. జీవో౨ హం అనే భావనలోనున్నాడు.

**అది అన్నిటి లోపల యున్నది. అన్నిటికి బయట వున్నది.**

బ్రహ్మము అన్నటిలోపల తానే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ వాగ్రూపములో యున్నాడు. ఆత్మ సర్వగత లక్షణమును శ్రీ పరుశురామ నరసింహదాసుగారు దిగువ పద్యమున బహు చక్కగా వివరించినదానిని గమనించగలరని మనవి.

66. సీ॥ ధరణిలో తిలలందు తైలముండినరీతి దారువు యందున్న దహనురీతి।
నాణెమౌదధియందు నవనీతమున్నట్లు పుష్పమందున గంధమున్నయట్లు।
రంజిల్లు ఫలమందు రసము గలిగిన భంగి చేలమందున్నట్టి నూలు భంగి।
తామర [illegible]రముండిన రీతి। యినుక రా[illegible]న్న యినుము తీరు।
అఖిలజగముల సకల దేహంబులందు! నిండియున్నావు యారీతి నిజముగాను
రమ్యగుణ ధామ భద్రాదిరామ, పరుశురామ నరసింహదాస సంరక్షితాహ్వా।
ఈ విధముగా సకల దేహములందు బ్రహ్మము నిండియున్నది.

ఆకాశము అన్ని వస్తువుల యందు నిండి యున్నట్లు బ్రహ్మము (ఆత్మ) అన్నిటిలోపల వెలుపల నిండి యున్నాడు. సృష్టికి పూర్వము ఎరుక బ్రహ్మము అఖండ వస్తువుగాను, సృష్టియనంతరము ఖండ ఖండములుగా మారు చుండుటచే అది సాపేక్షిక ద్వంద్వస్వరూపముగా నున్నది. **"అఖండంబగు యెరుక రూపు గనరామాతండ్రీ"** అనుటలో బ్రహ్మము తెంపులేకుండ యున్నదనుటలో సందేహము లేదు. పరిపూర్ణము అఖండముగా నున్నది. సృష్టికి పూర్వమున్న యెరుక కూడా అఖండముగానున్నది. రెండు అఖండములుండుటకు వీలులేదు. దానిని చూచినపుడు (పరిపూర్ణము). ఇదిగానరాదు. దీనిని ఎరుక బ్రహ్మమును చూచినపుడు అదిగానరాదు. ఎట్లనగా ర జ్జువెంతయుండునో సర్పము కూడ అంతేయుండును. సర్పప్రతీతి అయినపుడు రజ్జువు గానరాదు. రజ్జువు ఉన్నది వున్నట్లుగా తెలియునపుడు సర్పముగానరాదు. కనుక ఎరుక బ్రహ్మము తొలిరూపము అఖండమని చెప్పనగును. కావున అఖండముగానున్నపుడు బాహ్యాంతరములనే భేదము లేకుండ అంతట వెలుపల లోపల బ్రహ్మము వ్యాపించి యున్నదని నిర్ణయము. పరిపూర్ణమునకు పారమార్థిక సత్యమున్నది. కనుక అదియున్నది ఎరుకకు వ్యవహార సత్యమున్నది, కనుక అదిలేనిది.

## 1. పరిపూర్ణ పరబ్రహ్మము.

> **అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్యఏవచ ।**
> **నిత్యఃసర్వగతఃస్థాణుః అచలో ఽ యం సనాతనః ॥ భ.గీ. 2-24**

తా॥ ఈ అచలరూపమగు సనాతన బ్రహ్మము (పరిపూర్ణపరబ్రహ్మము) ఛేదింపరానిది, దహింపరానిది. తడుపరానిది, శోషింపరానిది, ఎల్లప్పుడు అంతటనిండి వ్యాపించినది. స్థిరమై కదలకనేయున్నది.

పంచభూతములు పాంచభౌతికములనే బాధించగలవు. పరిపూర్ణ పరబ్రహ్మము నందు పంచభూతములు మచ్చుకైన లేవు. అందు పంచభూతములకు ఆధారమైన, అధిష్ఠానమైన ఆత్మతోసహా మరేది లేదు. అదిశుద్ధము. ఈ శ్లోకములోని విశేషణ ముల భావములను ఆత్మకు తగిలించి ఆత్మపంచభూతాత్మకముగాదు కావున వాని ప్రభావము అతనిపై బడ జాలదనిచెప్పుచున్నారు. అది ఎట్లు సరిగాదో పరిశీలింతము.

**అచ్ఛేద్యః:-** ఛేదింపరానిది, ఖండములుగా లేనిది, అఖండముగా తెంపులేనిది, ఆదిమధ్యాంతరహితమైన వస్తువుగను కూడా అర్థములు గలవు. ఈ అర్థములో కేవల అఖండముగాను ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే అని, అది నిరపేక్షక అఖండమని, అనగా పరిపూర్ణమును జెప్పినపుడు ఖండ వస్తువుల ప్రసక్తిలేనేలేదు. బ్రహ్మము (ఎరుక) సృష్టికి పూర్వము అఖండ వస్తువుగాను, సృష్ట్యనంతరము ఖండ ఖండములు గాను మారుటచే అది సాపేక్షిక ద్వంద్వ స్వరూపము.

**45** వే.వ.॥ **"పిండ బ్రహ్మాండములు రెండు॥....అఖండంబగు యెరుకరూపుగనరా**
**మా తండ్రి యిదిదెల్పిన ఘనుడే తలిదండ్రీ॥ ఖండా ఖండములుగా గనుపించు యెరుకానె దండిదనేటి యుద్ధండూల కల నైన గనరా మా తండ్రీ...."**

అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు గానం చేసియున్నారు. కనుక సృష్టికి పూర్వము ఎరుక అఖండముగానే యున్నది. గాని **"ఏకం అనేకం భవతి"** అని శ్రుత్యానుసారము ఏకముగానున్నది అనేకమయినది. పిదప ప్రతి సంచర పద్ధతిలో అనగా ఊర్ధ్వ పరిణామములో **"అనేకం ఏకంభవతి"** అనిన్ని శ్రుతియే వాకొనుచున్నది. కనుక ఎరుక నిరంతర పరిణామశీలి, జ్ఞానాజ్ఞనరూపముగా, యెరుక మరువురూపములుగా ద్వంద్వరూపముగా నున్నది, సృష్టియందు కించిజ్ఞత్వలక్షణములు గలిగి యున్నది. వాని యందు గుర్తెరిగే లక్షణములు చాల పరిమితమై ఏకించిదవరోధమున్న గుర్తు పరిపూర్ణముగా పని చేయలేక పోవుచున్నది. కనుక ఏక దేశములో మాత్రమే పని చేయుచున్నది. గోడవతల యేమి జరుగుతున్నదో మనముచూడలేము. కాని సకల బ్రహ్మాండమే శరీరముగా గల ఈశ్వరుడు సర్వజ్ఞుడు అని చెప్పబడుచున్నాడు.

అనగా ఏక కాలమందే అతడు సర్వత్ర నుండు సకలమును గుర్తించగలుగుచున్నాడు కనుకనే శ్రుతి **"సర్వతః ప్రాణి పాదస్తు సర్వతోక్షి శిరోముఖం"** అంటూ ఆలంకారికముగా ఆత్మ వర్ణించబడినది. అనగా యెరుక (జ్ఞానము) కూడా వ్యష్టి సమిష్ఠుల యందు ఖండా ఖండములుగా నున్నది. కనుక యెన్ని విధముల విచారించినను యెరుక ఖండాఖండములుగా ఏకదేశీయ సర్వ దేశీయములుగా వేయేల సర్వ సాపేక్షిక ద్వంద్వములుగా వున్నది. ద్వయ దోషదూషితముగా నున్నందుననే దాని యందు కేవలత్వములేదు. కనుక యెరుక కేవలం ఖండరూపముగాని, కేవలం ఏకదేశీయముగా గాని, అనరాదు. కేవల అఖండముగా నున్నది పరిపూర్ణ పరబ్రహ్మమే కనుక పరిపూర్ణపరబ్రహ్మము ఛేదించరానిది.

**అదాహ్యః** – కాల్చబడదు – పరిపూర్ణ పరబ్రహ్మము కాల్చబడనిది – ఎరుక బ్రహ్మము తాను కాలును, కాల్చును, ఎట్లోపరిశీలింతము "సీ॥ **ఆత్మనుండి ఆకాశము దయించె"** ఈ సీసపద్యమును పరిశీలించిన ఆత్మనుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు. వాయువునుండి అగ్ని మరి యితరములు పుట్టినవని స్పష్టమగుచున్నది. అంటే అగ్ని ఆత్మనుండి వచ్చిన దని స్పష్టము. అగ్నివెలగడము ధర్మము, కాల్చుట కర్మము, అగ్ని యొక్క ధర్మము వెలుగుట కాల్చడము కర్మము ఆత్మనుండే వచ్చినవి. అంటే ఆత్మ బ్రహ్మలో ఈ లక్షణములు బీజరూపములో నుండుట వల్లనే అగ్నిరూపములో అవి బహిర్గతమగుచున్నవి. ఇందుకు మరొక ఉదాహరణముగా "అయమాత్మ బ్రహ్మ" అనే శ్రుతి న్యాయముగా నేనే బ్రహ్మమును. నేనైన బ్రహ్మమునందు జఠరాగ్నియుండుట వల్లనే నేను భుజించే ఆహారము పచనమగుచున్నది. అంటే అది కాలుచు ఇతరమును కాల్చుచున్నదని చెప్పవచ్చును, కాలుట, కాల్చుట రెండు గుణములు బ్రహ్మమందుండుటవల్లనే ఎరుక బ్రహ్మము కాల్చబడునని అనవచ్చును. కాని పరిపూర్ణపరబ్రహ్మము నందు యేమిలేదు. అందుకాల్చేగుణము గాని, కాలే గుణము గాని అందులేదు. అందు యేగుణములు లేవు.

**అశోష్యః** :- పరిపూర్ణ పరబ్రహ్మము అశోష్యము. ఎండింపబడజాలదు. ఎరుక బ్రహ్మమునకు ఎండింప జేయుగుణమున్నది. **"నేహనా నాస్తికించిన"** అను శ్రుతి ప్రకారము అంతా, నేనైన బ్రహ్మనే. నేనైన బ్రహ్మమునకు జ్వరమువచ్చినపుడు శరీరములోని ఉష్ణోగ్రత 98.4$^0$ యఫ్ కంటే హెచ్చి 104$^0$లుగా చేరుకున్నప్పుడు శరీరము కాలును. పెదవులు, నాలుక, ఎండిపోవును, దాహము కలుగును ఈ లక్షణములు బ్రహ్మనందు ఉండుటవల్ల నాలో కలిగినవి. ఎట్లనగా మయూరాండములో నెమలి కుండె చిత్రాతి చిత్రమైన రంగులు దాగియుండుటవల్లనే అండముద్వారా ఏర్పడిన పిల్లయందు అన్ని రంగులతో అది పుట్టును. అంటే బ్రహ్మమునందు ఉష్ణము, ఎండింపజేయు గుణములు దాగి యుండుట వల్ల నాయందు ఊష్ణము సమతూకములో నున్ననేను ఆరోగ్యముగా నుందును. హెచ్చిన ఎండింపబడి రోగపీడితమగుదును. కాని పరిపూర్ణమందు ఏ ఇతరము బీజరూపములోనైన ఈ షత్తు కూడ లేకపోవుటవల్ల అది ఎండిప బడజాలదు ఎండదు.

కేనోపనిషత్తు మూడవ భాగమును పరిశీలించిన ఈ విషయము స్పష్టమగును. బ్రహ్మము దేవతల పక్షాన యుద్ధంచేసి విజయము సాధించాడు. విజయము బ్రహ్మవలన కలిగిన, దేవతలు తామే గెలిచినామని ఉప్పొంగి పోయినారు. మామూలంగానే గెలుపు కలిగినదని గొప్పగా ఉబ్బి పోయారు. మహిమాన్వితమైన బ్రహ్మము యొక్క శక్తివల్లనే అగ్నివాయువు ఇతర దేవతలు గెలిచినామని గుర్తించలేక పోయిరి. వారిలో గర్వము అధికమయ్యెను. అందుకు బ్రహ్మ యొకనాడు వారి యెదుట యక్షుని రూపములో ప్రత్యక్షమయ్యారు. ఆ ఆకృతిని దేవతలు గుర్తించలేకపోయిరి. వారిలో అగ్నిదేవుని ఆ యక్షుడు ఎవరో తెలుసుకొని రమ్మని పంపించగా అతడు వెంటనే వెళ్ళి నేను జాతవేదుడను అనే గర్వముతో ముందుకువెళ్ళినాడు. అగ్నిదేవుణ్ణి చూచి నీవెవరని ప్రశ్నించినాడు ఆ యక్షుడు. నేను సర్వమునెరిగిన వాడను. నన్ను జాతవేదుడని పిలుస్తారని నుడివెను. అట్లయిన ఈ ఎండుగడ్డి పోచను కాల్చుమని అగ్నిని ఆదేశించెను. అగ్ని సర్వశక్తులను ఒడ్డి దానిని కాల్చుటకు ప్రయత్నించెను గాని కాల్చలేకపోయెను. వెనుదిగిరెను. అట్లే వాయుదేవుడు కూడా భంగపడెను. చివరకు దేవేంద్రుడే స్వయముగా ఆయక్షుడెవరో తెలుసుకొనుటకు ప్రయత్నించెను. దేవేంద్రుడు రాగానే యుక్షుకుడు అంతర్ధానమయ్యెను. ఇంద్రుడు నిరాశచెందక అచటనేయుండెను. వెంటనే ఉమాదేవి గోచరించెను. ఉమాదేవి వాస్తవముగా విజయము బ్రహ్మదే. బ్రహ్మము యొక్క శక్తి నొసంగుట వల్లనే అగ్ని కాల్చుట, గాలి వీచుట, నీరు తడుపుట వంటి పనులు చేయగలగుతున్నారనెడి నిజమువారికి ప్రబోధించింది ఆ జగన్మాత.

ఈ కథవలన మనకు తెలిసినదేమనగా బ్రహ్మమునకు ఆకాశము, అగ్నివాయువు, జలము, పృథివి అంశములన్ని బీజరూపములో దాగియుండుటవల్ల బ్రహ్మమువలన సమస్తకార్యములు జరుగుచున్నవి. అన్నిటికి కర్త అతడే. భోక్త కూడా అతడే. పరిపూర్ణ

పరబ్రహ్మము కర్తగాదు, భోక్తగాదు, కాలదు, తడుపదు ఎండింపజాలదు. అది **"నిష్క్రియం నిర్మలం పూర్ణమని"** కొనియాడ బడినది.

**అక్లేద్యః** – పరిపూర్ణపరబ్రహ్మము తడుపబడ జాలదు. అది వస్తు మద్రహితము. అది వస్తువేకాదు. తడుప బడుట ఎట్లు? వైశేషికులు ఆత్మను నవవిధ ద్రవ్యములలో చేర్చినారు. పంచభూతములు ఐదు, దిక్కులు, కాలము, మనస్సు, ఆత్మ ఇవి నవ విధ ద్రవ్యములు. మనకు నీరే ప్రాణాధారము. తిండిలేకున్నా నీటితో కొంతకాలము బ్రతుకవచ్చును. నేనైన శరీరమును నీటిచే రక్తముచే, తడుప బడుచున్నది. జలము యొక్క ధర్మము పదును చేయుట, ముద్దచేయుట కర్మము, ఈ ధర్మకర్మలు నేనైన బ్రహ్మమువే, కనుక ఎరుక బ్రహ్మము తడుప బడును, మన శరీరము తడిగాయుండును. జలముయొక్క ధర్మకర్మలు బ్రహ్మమునందు బీజరూపములో యుండుట వల్ల బ్రహ్మనుంచి అయిన నాయందు అది స్పష్టముగా గోచరించుచున్నది. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము అట్లుగాక తడవక, తడపబడకయున్నది.

**నిత్యం:**– కాలత్రయములందు శాశ్వతమైనదని సామాన్యార్థము అనగా దాని అస్తిత్వమునకు, ఉనికికి భంగము లేదన్నమాట. కాని బ్రహ్మము యొక్కరూప నామములు నిరంతరము మారుతునేయున్నవి. అయినను వస్తువుయొక్క ఉనికికి భంగము కలుగుటలేదు. వాఙ్మనసులకంటే బ్రహ్మము గొప్పదే. ఏ వస్తువు కేవలం నశించుట లేదు. చెట్టును నరికి కాల్చిన బూడిదయగను. ఆ నుసి గాలితో ఎగిరి నేలపై రాలి మన్ను రూపము వహించుచున్నది. కనుక చెట్టు కేవలం నాశనము గాలేదు. అనగా **పదార్థమునకు నాశనం లేదు.** అదేవిధముగా బ్రహ్మము నానారూపములు చెందుచున్నది. ప్రళయానంతరము తిరిగి సృష్టికి పూర్వమున్న స్థితిలోయుంటున్నది. సృష్టియనంతరము, సృష్టికాలమందు అనగా భూత భవిష్యత్ వర్తమాన కాలములందు బ్రహ్మపదార్థము యేదో ఒక రూపములో ఉంటూనేయున్నది. కనుక త్రికాల బాధ్యమన్నారు. సద్రూపమనగా నిదే. బ్రహ్మమును ఈ దృష్టితోనే నిత్యమన్నారు. అంతేగాని నామరూపములలో కూడా మార్పు లేదనే అర్థము కాదు. మార్పు చెందేది మాయ. కనుక యిది మాయ బ్రహ్మమనాలి.

ఆస్తి భాతిప్రియ రూప నామాలను ఐదు లక్షణములలో మొదటిమూడు నిత్యమైన బ్రహ్మము గాను, రూపనామములు అనిత్యమగు జగత్తుగాను చెప్పబడినది. బ్రహ్మము ఏకము, నిత్యము, అనంతము, నామరూపములు అసంఖ్యాకములు అనేకములు అనిత్యములు. ఏకం అనేకం భవతి న్యాయంగా ఒకే బ్రహ్మము ద్వివిధముగా నున్నది. నిత్యానిత్యములనే నిర్ణయమెరుగని కేవల నిత్యత్వ మొక్క పరిపూర్ణ బ్రహ్మమందే గలదు.

**సర్వగత:**– అంతటవ్యాపించి యున్నదని అర్థము. పరిపూర్ణపరబ్రహ్మమే నిత్యము సర్వగతం. పరిపూర్ణ పరబ్రహ్మమే అంతట వ్యాపించి యున్నది గాని, బ్రహ్మము ఆవరణము కలిగియున్నది. ఆత్మ ఆకాశము రెండు తీపి బెల్లమువలె ఉన్నందున **"ఆకాశశ్శరీరం బ్రహ్మ"** అని శ్రుతి చెప్పినది. ఏ శరీరము చూచినా దాని తెలివి ఆ

శరీర ప్రమాణములకు పరిమితమై యుండునే గాని దానిని అతిక్రమించియుండ జాలదు. తెలివియందు దేహము దేహమందు తెలివి కలిసియున్నవి. ఈ దృష్టితోనే దేహీ దేహములు రెండు ఒక్కటే అని సిద్ధాంతీకరించబడియున్నది. శ్రీ భాగవత కృష్ణయ్య **"అంతట కలదీ ఎరుకని ఎంతో వాదింపుచుందు రెరుగని వారల్, అంతట నింతట గలదే కాని ఎరుక అంతట కలదా?** అని ప్రశ్నిస్తున్నారు. అంటే వస్తువులున్నచోట ఆ వస్తువు చిన్నదైన పెద్దదైన వస్తువు యొక్క ఆవరణమందంతట ఎరుక వ్యాపకమైయున్నది. ఆత్మకు శరీరభూతమై ఆవరణమైయున్న ఆకాశమందే అదివుండగలదుగాని ఆవరణరహితమగు పరిపూర్ణ పరబ్రహ్మమందు వుండజాలదు. అమితమగు పరిపూర్ణ పరబ్రహ్మమునకు మాత్రమే ఆవరణ లేదు. కనుక ఆవరణమును, ఆవరణమందుండు ఆత్మయును పరిపూర్ణమందుండుట అసంభవము. కనుక పరిపూర్ణము అంతట వ్యాపించియున్నది. ఎట్లు అనగా ములుగృచ్చ సందులేక నిండియున్నదని వర్ణించబడినది.

**అచలోఽ యం:-** అనగా చలనములేనిది. పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే చలనము లేనిది. ఒకప్పుడు చలనముండి మరొకప్పుడు చలనము లేకుంటే దానిని అచలమని అనరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము ఎన్నడు చలన మెరుగనిది.

పరబ్రహ్మమునకు సృష్టికి పూర్వమెట్టి చలనము లేదు. బాహ్యమున గాన వచ్చు వస్తు స్థితియందు గలుగు కదలిక మాత్రమే చలనము గాదు. అంతరమునందలి మార్పుకూడా చలనమే, నిస్సంకల్పస్థితిలో నున్న బ్రహ్మమునకు సృష్టికామన కలిగి సృష్టించవలెననెడి సంకల్పము కూడా చలనమే. స్థితి కలిగియున్న ప్రతిదానికి గతి (చలనము) వుండును. గతి లేనప్పుడు స్థితి, స్థితి లేనప్పుడు గతి. బ్రహ్మమునకు కూడా ఈ స్థితి గతులు రెండునూవున్నవి. కనుక ఈ బ్రహ్మమును అచలమనరాదు. అది కేవాలాచలంగాదు. **పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే! పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవాఽ వశిష్యతే।** అనే శ్రుతియందూ పరిపూర్ణమే వాఽ శిష్యతే అని అవశిష్య రూపముగా నుండేది పరిపూర్ణము మని తెలియవలయును. చలాచలనము రెండు యెరుకే, సాపేక్షకమైన శబ్దములే. కేవల నిరపేక్షకమైన పరిపూర్ణ పరబ్రహ్మమే అచలశబ్దము వర్తించును.

**సనాతన:-** అనాది యని అనగా మొదలు లేనిది అని అర్థము. అది ఎల్లప్పుడున్నది. పరిపూర్ణ దృష్ట్యా కాలమనేది లేనే లేదు. కాలముపుట్టక పూర్వము, కాలమున్నప్పుడు, కాలము పుట్టిన తర్వాత కూడా పరిపూర్ణపరబ్రహ్మమేయున్నది. కనుక.... **"సంతాతమొక రీతి సకల దేశములాయందంతాట నిండున్నదదిగో పరిపూర్ణమని"** శ్రీ కృష్ణదేశికులు వర్ణించినారు. కనుక పరిపూర్ణపరబ్రహ్మము సనాతనమైనది.

## 2. ఎరుక

**మం॥** బ్రహ్మైవేద మమృతం, పురస్తాద్బ్రహ్మ
పశ్చాద్ బ్రహ్మ దక్షిణ తశ్చోత్తరేణ ।
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్ ॥ **ముండక 2-11**

తా॥ అమృత స్వరూపమైన బ్రహ్మము నాలుగు దిక్కులందును క్రిందను మీదను అంతట నిండి వెలుగు చున్నది. అన్నిటికన్న శ్రేష్ఠమగు ఈ బ్రహ్మమే విశ్వాకారముగానున్నది. అనగా ఈ బ్రహ్మము అమృత మృత్యువులను ద్వంద్వములలో నొకటిగా నున్నది. శ్రేష్ఠము అశ్రేష్ఠములను ద్వంద్వములలో నొకటిగానున్నది. కనుక సాపేక్షకము మరియు దిక్కులు అనే భావము (అదియు నొక ద్రవ్యమేనని వైశేషికులు) దేనివలన కలుగుచున్నదో ఆ సూర్యుని ఉనికిని అపేక్షించి వాక్కుచే వర్ణింపబడినది. మరియు విశ్వాకారముగా పరిణామము చెందినది. అనగా రూపాంతరము పొందినది. (పరిపూర్ణము అట్టికాదు. అది సాపేక్షికము కాదు. వర్ణింపరానిది ఎన్నడు మార్పులేనిది).

అమృతమగు బ్రహ్మము క్రిందమీద ప్రక్కల ముందు వెనుక సర్వత్రా విరాజమానమై యున్నది. ఈ భావమును గురుగీతలోని దిగువ శ్లోకములు దృఢపరుచుచున్నవి.

**1. "స్థావరం జంగమం వ్యాప్తం। యత్కించిత్సచరాచరం"** స్థావరములుగా, జంగమములుగా రెండు రూపములుగా గాన వచ్చే సకల జీవోపాధులందు సూక్ష్మ రూపముగా వ్యాపించి యున్న **"త్వం"** పదం దర్శింప జేయగల గురుమూర్తికి నమస్కారము అని గలదు.

**2. "అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరం"** అఖండము అనగా ఖండ ఖండములు కాకుండ ఏ పరమాత్మవస్తువు సమస్తము సృష్టి యొక్క బాహ్యాభ్యంతరముల యందు నిండి సంపూర్ణమైన మండలాకారముగా నున్నదో అట్టి **తత** బ్రహ్మము అను వస్తువును దర్శింపజేయు గురుమూర్తికి నమస్కారము. మరియొక శ్లోకమున, 45శ్లో॥ **గురుమధ్యేస్థితం విశ్వం విశ్వ మధ్యేస్థితోగురుః । గురు ర్విశ్వంనచోర్న్యాస్తి తస్మై శ్రీ గురువేనమః॥ -గురుగీత.** ఈ ప్రపంచమంతయు సద్గురు పరమాత్మ యుందున్నది. ఈ పరమాత్మ ప్రపంచమంతట నున్నాడు. కనుక ప్రపంచమంతా సద్గురువై (బ్రహ్మ) యున్నాడు. అన్యం లేనే లేదు. అట్టి స్వరూపుడైన సద్గురువునకు నమస్కారము.

బ్రహ్మము నాలుగు దిక్కులు మీద క్రింద అను ఆరు దిశల యందు బ్రహ్మమున్నట్లు చెప్పబడినట్లే కాని నాలుగు మూలలు చెప్పబడనట్లు అనిపించును. కాని నాలుగు మూలలు కూడ చెప్పబడినట్లే. ఎట్లనగా తూర్పునుండి దక్షిణాది ముఖము జేయునపుడు ఆగ్నేయ మూల, దక్షిణము నుండి పడమటికి తిరిగినపుడు నైఋతి మూల, పడమటినుండి ఉత్తరమునకు తిరుగునపుడు వాయువ్యమును, ఉత్తరము నుండి తూర్పునకు తిరుగునపుడు ఈశాన్య మూలకు అభిముఖము జేసినట్లేగదా. అట్లే పైకి చూచి క్రిందికి వంగినపుడు మధ్య భాగమును దాటినట్లే గదా! కనుక బ్రహ్మము దిశదిశలందేగాక సర్వత్రా విరాజమానమైయున్నట్లు మనకు గోచరమగుచున్నది.

అన్నిటికన్న శ్రేష్ఠమగు ఈ బ్రహ్మమే విశ్వాకారముగానున్నది. ఆత్మపంచ భూతములందు వ్యాపించి యున్నది. **"అణోరణీయాన్ మహతో మహీయాన్"** ఆ పరమాణువులోను మహత్తు బయటను కూడ ఆత్మయున్నదని అర్థము " సర్వ **భూతస్థమాత్మానాం సర్వభూతాని చాత్మనీ"**

మహాసూక్ష్మాతి సూక్ష్మమగు ఆత్మయందు స్థూలమగు ఏవస్తుజాతమున్నదో ఆ వస్తువునందు కూడ ఆత్మవ్యాపకమయి యున్నది. అంటే ఆత్మవస్తువునకు ఖాళీ యిచ్చుటకై ఏది ఇటు అటు కదల నవసరములేదు. అదే విశ్వము, విశ్వాకారమంతా బ్రహ్మమే.

**ఆత్మ అమృత మృత్యువులుగా ద్వంద్వముగా నున్నది.**

**శ్లో॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధి ఈశ్వరః॥**

**కార్యకారణ తాం హిత్వా పూర్ణ బోధో వశిష్యతే॥ - శుకరహస్యోపనిషత్తు.**

ఇచ్చట ఈశ్వర శబ్దము చేత కార్యకారణ బ్రహ్మమును గ్రహించవలయును. అంటే బ్రహ్మము ద్వంద్వస్వరూపముగా నున్నది. ఈ బ్రహ్మము సదసత్తుగా సర్వద్విపుటులుగా నున్నది. ఈ ద్విపుటులలో ఏదో ఒకటని జెప్పినా సరికాదు. **బ్రహ్మ సత్యం జగన్మిథ్యా"** అన్నప్పుడు బ్రహ్మఎంత సత్యమో జగత్తు కూడా అంతే సత్యమని అనవలసివచ్చును. పోతే బ్రహ్మము ఏకరూపముగా లేక ద్వంద్వైక ఏక రూపముగా నున్నదనుట సమంజసము.

శ్రుతి॥ **"ఆకాశశ్శరీరం బ్రహ్మ"** ఏశరీరము చూచిన దాని తెలివి అశరీర ప్రమాణమునకు పరిమితమై యున్నది కాని నతిక్రమించి యుండజాలదు. తెలివి దేహము ఓత ప్రోతమైయున్నవి. సమాన పరిమాణములలోనున్నది. ఈ దృష్టితోనే దేహీదేహములు రెండు ఒక్కటే అని సిద్ధాంతికరించబడింది. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు **"అంతట గలదీ ఎరుకనీ యెంతో వాదింపుచుందు రెరుగని వారల్! అంతట నిం[illegible] కనబడు నంతటిదే కాని ఎరుక అంతట గలదా!"** అని ప్రశ్నించుచున్నారు. వస్తు[illegible] న్నచోట ఆ వస్తువులు చిన్నదైన పెద్దదైన వస్తువు యొక్క ఆవరణ మందంతట ఎరుకవ్యాపకమైయున్నది. ఆత్మకు శరీరభూతమై ఆవరణమైన ఆకాశమునందే అది వుండగలదుగాని ఆవరణ రహితమగు పరిపూర్ణపరబ్రహ్మమునందు వుండజాలదని గ్రహించవలయును. ఆవరణ ఎంత పెద్దదైన ఒకమితి యుండక తప్పదు. అమితమగు పరిపూర్ణమునకు మాత్రము ఆవరణములేదు. ఆవరణము ఆవరణమునతోచు ఆత్మయును పరిపూర్ణ పరబ్రహ్మము నందుండుటకు వీలులేదు. కనుక ఆవరణ సహితమగు ప్రతి వస్తువునందు ఆత్మ వ్యాపకమై యున్నది.

**బ్రహ్మము విశ్వాకారముగా నున్నది.**

**"ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం" ॥**

**స్థావరం జంగమం చైవ ప్రణమామి జగన్మయం. గురుగీతా శ్లో॥ 81**

తృణాది బ్రహ్మపర్యంతము (జగత్తంతా) పరమాత్మమయమే. సృష్టికి పూర్వమందు ఆ పరమాత్మ మార్తాండునివలె ఒకడే అయి ఏకరూపముగా నుండి ఏకమే వా ఽ ద్వితీయం బ్రహ్మ అని కొనియాడ బడినాడు. తానే ఆవరణాత్మకమగు జగద్రూపమగుట తొలిప్రవేశము. తెలివి రూపమున అతడు అణువణువున బాహ్యాభ్యంతరములందు సర్వత్రా ప్రవేశించెను. ఆ తెలివి ఏదో ఒక ప్రదేశమున అభివ్యక్తమగుటచే ఆస్థానమందే పరమాత్మ యున్నాడనుట సరిగాదు. విశ్వమంతటా విశ్వాకారముగా నున్నాడు.

శ్లో॥ గురుమధ్యేస్థితం విశ్వం। విశ్వమధ్యేస్థితోగురుః
గురుర్విశ్వం నచోర్నాస్తి తస్మైశ్రీగుర వేనమః ॥ గురుగీత - 45

తా॥ ప్రపంచమంతయు సద్గురువునందున్నది. సద్గురువు ప్రపంచమునందు గలడు. కావున ప్రపంచ మంతయు సద్గురువేను. అన్యం లేనే లేదు. అట్టి స్వరూపుడైన సద్గురువు కొరకు నమస్కారము.

సృష్టినాల్గు పాదములుగానున్నదని చెప్పుచున్నారు. ఇందుండి ఒక్క పాదము మాత్రమే విశ్వరూపమాయెను. తక్కిన మూడుపాదములు అమృత పాదములుగా నున్నవి.

## 2. పరిపూర్ణ పరబ్రహ్మము.

**సర్వదా నవిచ్ఛిన్నంబ్రహ్మ, కాలభేదం వస్తుభేదం దేశభేదం, స్వభేదకం, కించిద్భేదం నతస్యాస్తి, కించద్వ్యాపి నవిద్యతే॥** (యోగచూడామణి యుపనిషత్తు)

తా॥ ఆ పరిపూర్ణ పరబ్రహ్మము దేనిచేతను అవిచ్ఛిన్నము కాదు. అనగా ఖండ ఖండముగానేరదు. దేశ, కాల, వస్తువులచే అదిభిన్నములు కాదు. దానియందు స్వగత భేదము లేదు. అనగా దాని అంతరమందు ఎట్టి భేదమున్నులేదు. కనుక భేదమనునది కించిత్తూ దానికి లేనే లేదు.

**1. సర్వదా నవిచ్ఛిన్నంబ్రహ్మ:-** ఆ బ్రహ్మము అనగా పరిపూర్ణపరబ్రహ్మముదేని చేత అవిచ్ఛిన్నముగాదు. ఖండ ఖండములుగా కాదు. పరిపూర్ణము ఆకాశమువలె అంతట నిండి నిబిడీ కృతమైయుంటే కదలడానికి వీలు లేనిదైయుంటే దేనిచేత ముక్కలు ముక్కలగును. మరియు **"నిశ్శక్తి నిర్మలం పూర్ణం"** అని కొనియాడ బడిన దానికి శక్తిలేదు – అది కదలదు, నిర్మలమైనది అంటే అందు మరొక్కటిలేదు. ఇతరములను కదిలించదు. కావున ఖండాఖండములగుట పొసగదు. <u>క.ద. 45॥ "ఖండా ఖండములుగా గనుపించె ఎరుకానే దండిదనేటి యుద్ధండూలా కలనైన గనరా మాతండ్రి"</u> అనీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చి యున్నారు. అనగా ఖండ ఖండములుగా కనుపించునది ఎరుక. కావున ఖండ ఖండములుగా కనుపించుచున్న ఎరుకయే గొప్పదనుచున్న మతకర్తలు ఎరుక యనెడి కలలోని వారని తెలుసుకోమన్నారు.

అది ఎప్పటికి ఒక్కతీరుగానున్నది. పరిపూర్ణమునకు జ్ఞానాజ్ఞానములు రెండు కూడలేవు. పరిపూర్ణపరబ్రహ్మము కేవలం అఖండముగానున్నది. కనుకనే శ్రుతి **"పూర్ణమదః పూర్ణమిదం"** అని చెప్పుచున్నది. మిగిలేది అఖండమగు పరిపూర్ణమే.

**2 కాలభేదం వస్తుభేదం స్వభేదకం నతస్యాస్తి** – దేశము అనగా ప్రదేశము, లేక చోటు, పరిపూర్ణ పరబ్రహ్మము సకల దేశాలందు ఉండుటే అదిలేని చోటంటూలేదు. వస్తువును ద్రవ్యమంటారు. వైశేషిక దర్శనము నవ విధ ద్రవ్యములను నిర్ణయించినది. పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కులు, మనస్సు, ఆత్మ అనునవే నవ విధ ద్రవ్యములను నిర్ణయించినది. ప్రతి ద్రవ్యమునకు ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ, అభావములనే ఏడు లక్షణాలుంటాయి. పరిపూర్ణ

పర(బ్రహ్మమునందు ఈ నవ విధ (ద్రవ్యములుగాని, వాని లక్షణములుగాని లేవు. అది (ద్రవ్యముగాదు. (ద్రవ్యములన్ని పరిపూర్ణ పరబాహ్యము నందు అభావస్థితి నొందును. అయినను ఒక(ద్రవ్యము ఒక (ప్రదేశము నా(శయించునట్లు గోచరించుచున్నది. అవకాశరూపమైన ఆకాశము వస్తువు యొక్క బాహ్యాభ్యంతరము లందు ఉన్నను, స్థూల దృష్టికి వస్తువులవల్ల అఖండరూపమైన ఆ ఆకాశము ఖండ ఖండమైనట్లుగాను, వస్తువునందు లేనట్లుగాను గోచరించు చున్నది. కనుక సకల దేశములందు అని ఆగక సమస్తమైన వస్తువులందు అని కూడ చేర్చినారు. వస్తుజాతముచే ఖండమైనట్లు ఆకాశము కానవస్తున్నందువల్లనే సకలదేశాలయందు అని బహువచనము (ప్రయోగించ బడినది. కనుక వస్తురూపంగా తోచబడు వాని నన్నిటి బాహ్యాభ్యంతరముల దు పరిపూర్ణమే నిండియున్నది.

**3. సర్వకాలాలచే అదిభిన్నముకాదు.** కాలమును నిర్వచించాలంటే కాలము రెండు సంఘటనల మధ్యనున్న వ్యవధి యొక్క (ప్రమాణము లేక పరిమితమే కాల మనవచ్చును. ఉదా:సూర్యోదయ సూర్యాస్తమయముల మధ్యవ్యవధి పగటి కాలము ఒక సంఘటన యుంటేనే దానికి పూర్వము భూతకాలమని ఆ సంఘటన జరుగుకాలము వర్తమాన కాలమని అనంతరకాలము భవిష్యత్కాలమని అనవచ్చును. ఏ సంఘటన లేకుంటే కాలానికి ఉనికిలేదు. పరిపూర్ణ(బహ్మము ఏ మార్పు లేకుండా ఏక రీతిగానున్నది. దాని యందెట్టి సంఘటన యుండుటకు వీలులేదు. పరిపూర్ణము దృష్ట్యా కాలము లేనేలేదు. కాలము పుట్టుక పూర్వము కాలమున్నప్పుడు కాలము పుట్టిన తర్వాత కూడ పరిపూర్ణపర(బహ్మము [illegible]న్నది. అంటే (త్రికాలములందు ఎట్టి భేదము లేక ఏక స్థితిలో యున్నది. క॥ద॥34॥ **"ప[illegible]కున బలుకగ రాకను! తల పోయుదమనిన మదికి తగులక యెపుడున్! ములుగృచ్ఛ సంధి లేకను కలిగున్నది బట్ట బయలు గదరా [illegible]యన్నా" అనీ క.ప. 77" నీ తం(డ్రి జనిన మీదట! నీ తయుడు రాకవ[illegible]ను॥ నీ వున్నపుడున్॥ యే తత్వమంతటను గల॥ దాతత్వము నరసి॥ వృషని తలు[illegible]మన్॥**

దేశకాలానుసారము చేతన (బహ్మమునందు మార్పులు సహజమే. వైశేషికులన్నట్లు ఆత్మకూడ (ద్రవ్యకోటిలో చేరిపోయినది. వస్తువులోనే వస్తువు యొక్క స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములు కూడ యిమిడి యున్నవి. సకలదేశములందు సమస్త వస్తువులందు అని రెండింటిని కలిపి చదివితే వస్తువు యొక్క స్థూల, సూక్ష్మ, కారణ మహాకారణ శరీరముల బాహ్యాంభ్యంతరములందు పరిపూర్ణము నిండియున్నది. అద్వైత పద్ధతి యందు "(ప్రజ్ఞానం (బ్రహ్మ" "జ్ఞానాదేవతుకైవల్యం" "సత్యం జ్ఞానం అనంతం (బ్రహ్మ" ఈ (శ్రుతుల రీత్యా (బహ్మము జ్ఞానరూపమని నిర్ణయించబడినది. ఈ జ్ఞాన రూపమైన (బహ్మము సకలదేశాలయందు, సమస్తవస్తువులందు పర్యవసించునో ఆ వస్తువే గోచరించును. తత్కాలమందు అన్య వస్తు(గహణము కలుగుటలేదు. జ్ఞానం సర్వ(తా ఉంటే సర్వవస్తువులు ఏక కాల మందు గోచరించవలెగదా ! అట్లు గోచరించుట లేదు. కాని పరిపూర్ణము అంతట నిండియుండుటచే అంతటగలదు. దాని లోపల

బయట భేదము లేకుండుటచే ఎల్లప్పుడు ఏకరీతిగానున్నది. కనుకనే భేదమునకు తావులేదు.

పరిపూర్ణ పరబ్రహ్మమందు చలనాంశ స్వరూపమైన ప్రాణములేదు. కనుక అది చలించదు. **"నిత్య సర్వగతఃస్థాణు రచలోయం సనాతనః"** అని గీతలో పేర్కొనట్లు ఎప్పటికి చలించక ఇతరములను చలింపజేయక విశ్వవిశ్వాంతరాళములయందలి చలనమునకు ఆధారముగా గాని, అధిష్టానముగా గాని గాక కేవలం అచలము గానున్నది. కనుక అందు కించిత్తు భేదములేదు.

పరిపూర్ణ పరబ్రహ్మము ఒక్కతీరుగా ఎట్టి మార్పులు ఎన్నడు లేకుండ వున్నది. అది పుట్టదు. ఇతరములను పుట్టించదు. కావున మార్పు లేనిది, భేదము లేనిది.

## 3. ఎరుక

| |
|---|
| **ఎ) ఆత్మత్యేవోపాసీత** |
| **బి) ఓమిత్యు పాసీత** |
| **సి) భూమాన మిత్యుపాస్వ ॥ఛాందో॥** |

తా॥ ఆత్మయని ఉపాసింపుము. ఓం కారముగా దాని నుపాసింపుము.

భూమా అని అనగా అది చాల గొప్ప వస్తువు అని ఉపాసింపుము.

**ఎ. ఆత్మత్యేవోపాసీతః** అనగా ఆత్మనే కొలువుము, ప్రియ మిత్యుపాసీత అది ప్రేమ స్వరూపమైనదిగా తెలిసి ఉపాసింపుము అని శ్రుతుల తాత్పర్యము. సరియైన భక్తుడే నాకు ప్రియతము డంటున్నాడు గీతాచార్యుడు. భక్తునకు ఆ భగవంతుని కంటే ప్రియమైనది లేదు. కనుక భక్తియే ప్రేమ స్వరూపము. ప్రేమయే భగవంతుడు. కనుక భక్తి యొక్క స్వరూపము భగవంతుడు. విభక్తి కానిదే భక్తి. కనుక "ఏకమేవా ఽ ద్వితీయం బ్రహ్మ" అని చెప్పబడునదే భక్తి, ఈ విధముగా విచారిస్తే భక్తి, జ్ఞానములు వేర్వేరు అనుటకు వీలులేదు.

రాధా కృష్ణుల ప్రేమ దివ్యమైనది. అట్టి ప్రేమయే భక్తి యొక్క పరాకాష్ఠ, అట్టి ప్రేమ తరతమభేదముచే ఎట్లు ఆత్మయందు పర్యవసించునో చూద్దాం. **"విత్తాత్ పుత్ర ప్రియం భవతి, పుత్రాత్ సర్వ శరీరం ప్రియం, ఇంద్రియాణి ప్రియ ప్రాణః, ప్రాణాదాత్మ పరఃప్రియః"** అనగా విత్తము, పుత్రుడు, స్వశరీరము, ఇంద్రియములు,ప్రాణము, ఆత్మ, ఇవి పూర్వాపూర్వముల కంటే వుత్తరోత్తరములు ఒకదానికంటే నొకటి ప్రియములై, చివరిదైన ఆత్మ అన్నిటికంటే ప్రియతమమై యున్నది అని భావము. కనుక పరమాత్మ యందు పరవసింపజేయని ప్రేమకు సార్థక్యము లేదు.

**"ఆత్మవస్తు కామాయ విత్తం ప్రియం భవతి" ఆత్మవస్తుకామాయ** సర్వం ప్రియం **భవతి"** అని బృహదారణ్యకశ్రుతి ఉద్ఘాటించుచున్నది. అనగా తానైన ఆత్మయందు సహజముగా తనకు ప్రేమ యుండుట చేతనే విత్తము, పుత్రుడు, భార్యా యిత్యాదులందు ప్రేమ కలుగుచున్నది. కనుక అట్టి ఆత్మయే ప్రేమ నిధానము. ప్రేమకు (భక్తికి) పరమధామమైయున్నది. ఆత్మకు సచ్చిదానందములు లేక అస్తి భాతి ప్రియం, సత్యం

శివం, సుందరం అను లక్షణములచేతకూడ ఆత్మప్రేమ స్వరూపము, జ్ఞానస్వరూపమైయున్నది. ఏతత్ప్రాప్తికి ప్రేమ సాధన (భక్తి) జ్ఞాన సాధన రెండు మార్గములే. ఈ రెండు లక్ష్యములు ఒక్కటే. మార్గము కూడ ఒక్కటే గాని భిన్నముగాదు అని తెలియవలయును.

**(బి) ఓమిత్యుపాసీత**

అనగా ఓంకారముగా ఉపాసింపుము "ఓమిత్యే కాక్షరంబ్రహ్మ" **"ప్రణవోయీ పరబ్రహ్మ ప్రణవశ్చ పరస్మ ృతాః"** అనగా ఓంకారము నిశ్చయముగా పరబ్రహ్మము. ప్రణవమే పరబ్రహ్మమని చెప్పబడుచున్నది. కనుక వాచ్యమగు బ్రహ్మమునకు వాచకమగు ఓంకారము వేరుకానందున ఓంకారము ఏబది అక్షరములకు మూలమని నిర్ణయము.

**క॥ద॥ 122. పంచాశదక్షరముల । ప్రపంచము తానుద్భవించె। ప్రణవాక్షర మం।దంచు శ్రుతులెన్నె। దాన్నెరు కంచని నీవెరిగి। యెరుగుమచలాము దీనన్॥ నిల్పకు మెరుక నచలాము లోనన్॥**

భగవానుడు**"ఓం మిత్యేకాక్షరబ్రహ్మ"** అని ప్రబోధించగా నారదమహర్షి దీనిని త్రి మాతృకగా వివరించిరి. కాని యాజ్ఞవల్క్యులవారు దీనిని చతురాక్షరిగానే వర్ణించిరి, శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు దీనిని చతురాక్షరిగానే స్వీకరించి తన ప్రణవార్థ ప్రకాశిక యందు దానిని బలపరచిరి, అదెట్లనగా

**అ** కారము లయము పొందగ భూమి, అగ్ని, ఋగ్వేదం, భూలోకము, బ్రహ్మము ఆవిర్భవించినవి.

**ఉ** కారము లయము పొందగ అంతరిక్షము, యజుర్వేదము, భువర్లోకము, సనాతనమైన విష్ణువు ప్రభవించెను.

**మ** కారము వలన ద్యులోకము, సూర్యుడు, సామవేదము, స్వర్గలోకము, మహేశ్వరుడు ఉద్భవించిరని శాస్త్రములు ఘోషించు చున్నవి.

**అకారార్థము:-** శ్రోత్రాది పంచ జ్ఞానేంద్రియములు, వాగాది పంచ కర్మేంద్రియములు, విషయేంద్రియములు 5 ప్రాణేంద్రియములు 5 మనస్సు అంతః కరణ చతుష్టయమగు 24 తత్వములుచేరి స్థూల శరీరమాయెను. దీనికి అవస్థ జాగ్రదావస్థ విశ్వుడు-అభిమాని, క్రియా-శక్తి రజజో-గుణము, నేత్రము-స్థానము, యుక్తము - భోగము, వీనితోకూడిన ఆత్మ జీవాత్మ యనబడును. ఇదే ఋగ్వేదము, ప్రజ్ఞానం బ్రహ్మమును విధి వాక్యమునకు మూల స్థానము.

**ఉకారార్థము:-** జ్ఞానేంద్రియములు ఐదు ప్రాణేంద్రియములు ఐదు, కర్మేంద్రియములు ఐదు మనోబుద్ధులు రెండూ కూడి అంతరాత్మయైన లింగమే హిరణ్యగర్భము. ఇదే సూక్ష్మశరీరము దీని అవస్థ-స్వప్నావస్థ అభిమాని - తైజసుడు, శక్తి-ఇచ్ఛాశక్తి, గుణము-సాత్వికము, స్థానము-కంఠము, భోగము - స్వేచ్ఛ అని వీనితో కూడి వ్యాపించిన ఆత్మ అంతరాత్మయనబడును. వాడే ప్రాతి భాసిక జీవుడు, ఇదే ఉకారము, యుజుర్వేదము, అహం బ్రహాస్మి, అనుభవ వాక్యమునకు నిలయమయ్యెను.

**మకారార్థము:-** ముందు చెప్పిబడిన స్థూల, సూక్ష్మ శరీరముల రెండింటికి కారణమగుటను బట్టి కారణ శరీరమనబడును. అవ్యాకృతమైన మహదహం కారమే కారణ శరీరము. అదే త్రిగుణ గర్భము. అవస్థ-సుషుప్త్యావస్థ, అభిమాని- ప్రాజ్ఞుడు, శక్తి-ద్రవ్యశక్తి, గుణము-తామసము, స్థానము - హృదయము, భోగము - ఆనందము అను వీనితో కూడి ఆత్మ పరమాత్మయనబడును. సామవేదము, తత్వమసి బ్రహ్మము అను ఉపదేశ వాక్యము మకారము వలన ఉద్భవించెను.

**4. అర్థమాత్రక:-** అనగా అరసున్న c దీనివలన శుద్ధలింగమని పిలువ బడు సమిష్టి మహాకారణ శరీరము. ఈ రెండింటికి సంబంధించిన ప్రత్యగాత్మ పరమాత్మలను అభిమానులు, అవస్థ-తురీయావస్థ, గుణము-ప్రధానము, శక్తి - పరాశక్తి, సదాశివుడు వారివలన ప్రాప్తమగు మోక్షము దాని కాధారమగు అఖండ ఎరుక లేక పరా ఎరుక ఆధారమని స్పష్టమగుచున్నది. దీని స్థానము - మూర్ధ్ని, అధర్వణవేదము, అయమాత్మబ్రహ్మమనబడు సమస్త వాక్యములకు అధిష్టాన చైతన్యము, దానినుండి ప్రకటితమైన మాయా జగత్తులకు ఆధారము ఆధేయముగానున్నది. ఇట్టి ఓంకారమును ఉపాసించుమని శ్రుత్యర్థము. ప్రణవము కూడ ఎరుకనే అంటున్నారు కృష్ణదేశికేంద్రుల వారు క.ద. 47 **"ఎరుకే విద్యావిద్యలు। యెరుకే ప్రణవంబునాద ।మెరుకే కళయున్, యెరుకే బిందువు చిత్సత్తెరుకే ఆనందమవి నీ। వెరుగు సద్బుద్ధీ"** అని సెలవిచ్చియున్నారు. ఎరుకను అచలబుషుల లేనెరుకన్నారు. ప్రణవము యెరుక స్వరూపము గనుగ పరిపూర్ణమందు నిలిచే టందుకు స్థానముగాని మూలము గాని లేదు అని నిశ్చయము. కనుక ప్రణవ రహితమునకు గుర్తుగా ఓంకారమునకు ముందు సున్నచేర్చి **౦ఓం** అని వ్రాయుట మనమెరిగినదే.

**సి) భూమానమిత్యుపాస్వ :-** అది అనగా అధిష్టాన చేతన బ్రహ్మమే ఉపాసింప తగినదని ఛాందోగ్యోపనిషత్తు ఘోషించుచున్నది.సర్వం నందు జ్ఞాన రూపముగా ప్రాణరూపముగా ఆత్మయే భాసిల్లుచున్నది. ఆత్మయే సృష్టి కారణము. దీని సత్తా లేక తృణమైన కదల జాలదు. ఇది సమస్త వస్తువుల కంటే పెద్దదై **"మహతో మహీయాన్"** అని కొనియాడబడుచు భూమా పదార్థమని కొనియాడబడుచున్నది. మహత్తులోపలనే సృష్టి జరిగినది. సృష్టి ఎంతవరకు వున్నదో ఆ ఆవరణము కంటెను పెద్దదై మహత్ అతిక్రమించి (నేను) యున్నదన్నమాట. సృష్టివిధానము **"బ్రహ్మణోరవ్యక్తాన్, అవ్యక్తాన్ మహత్....."** అనగా బ్రహ్మమునుంచి, అవ్యక్తము,అవ్యక్తము నుంచి మహత్ యిత్యాది సృష్టిక్రమం చెప్పబడినది. బ్రహ్మములోపలనే అవ్యక్తము పిదప మహత్తు కలిగనది. మహత్తుకంటే బ్రహ్మ అవ్యక్తములు పెద్దవైయున్నవలెను. ఇట్టి భూమా అనగా పెద్దదైన ఆత్మ (బ్రహ్మ) ను ఉపాసింపుమని అర్థము. ఉపాసింపుము అనుటలో ఉపాసన, ఉపాసకుడు, ఉపాసింపు వస్తువులు గలవు. ఒక ముక్కలో చెప్పాలంటే సృష్టి స్థితి లయములకు అత్యంత మూలకారణమైన ఆత్మ లేక బ్రహ్మము మాత్రమే యుత్తమమైన ఉపాసింపదగు వస్తువు. అట్టి పరబ్రహ్మమును వస్తు నిశ్చయరూపంగా సాక్షాత్కరింపజేసుకొని తానే ఆ బ్రహ్మస్వరూపుడనని ఆరూఢ జ్ఞానము కలిగి, తనయందు

సర్వము, సర్వము నందు తాను అను ఆత్మదృష్టిని పూని యుండుట ఆ భూమా పదార్థమును సేవించినట్లగును.

## 3. పరిపూర్ణబ్రహ్మము:

**.............తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాసతే॥ కేనోపనిషతు** 1-5-9. ఏది ఉపాసితవ్యము? అనగా ఏది యుపాసించుటకు సాధ్యమగునది కాదో దానిని బ్రహ్మముగా అనగా పరిపూర్ణ పరబ్రహ్మముగా తెలుసుకొమ్ము. ఎందుకనగా ఉపాస్య, ఉపాస కోపాసనల త్రిపుటి కందు స్థానము లేదు.

ఉపాసించుటకు సాధ్యపడనిది మాత్రమే బ్రహ్మముగా అనగా పరిపూర్ణ పరబ్రహ్మముగా తెలుసుకోమని మంత్రార్థము. అధిష్ఠాన చేతన బ్రహ్మములేక సచ్చిదానంద బ్రహ్మము బ్రహ్మముకాదు. దానిని ఎరుక బ్రహ్మము అనుట సరిపోవును. ఎందుకనగా ఈ బ్రహ్మము సత్యముగాదు. రెండు సత్యములుండుటకు వీలులేదు. **"ఏకం సత్ విప్రా బహుదా వదంతి."** అనగా సద్రూపమగు బ్రహ్మము అనేక విధములుగా, అనేక రూపములుగా అనేక పేర్లతో జ్ఞానులు చెప్పుచున్నారు. సదసత్తులకు అతీతతమైన బ్రహ్మమే పరిపూర్ణ పరబ్రహ్మము. **"నసత్తాన్న సదుచ్యతే"** ఈ పరిపూర్ణపరబ్రహ్మము సద్పదార్థముగాదు, అసద్పదార్థముగాదు. అది సదసద్రహితము. అది యేమికానిది, అది వాచామగోచరము. వాఙ్మనసుల కందనిది. అది ఏకైక సత్యమగు బ్రహ్మము. కార్యకారణ బ్రహ్మము సత్యముగాదు. సృష్టి కారణమగు బ్రహ్మము జగత్కారణము, జీవేశ్వర జగద్రూపము.

**యత్ వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే**
**తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాసతే॥ కేనోపనిషత్తు 1-5**

ఏది వాక్కుద్వారా వ్యక్తపరచబడజాలదో అది మాత్రమే బ్రహ్మము. అనగా పరిపూర్ణపరబ్రహ్మమని నీవు తెలుసుకో, దేనివలన వాక్కు వ్యక్తమగునో ఇక్కడ దేనిని ప్రజలు ఉపాసించుచున్నారో అది బ్రహ్మము కాదు.

మాటలచే ప్రకటింప జాలనిది మాత్రమే బ్రహ్మమని నీవు తెలుసుకో. ఈ విషయమునే తైత్తిరీయోపనిషత్తు స్పష్ట పరచిన విధమును గమనింతము. **"యతో వాచో నివర్తింతే అప్రాప్యమనసా సహ"** అనగా మనసు వాక్కు దేనిని తెలుసు కొనుటకై అసమర్థములై వెనుకకు మరలెనో అది పరిపూర్ణ పరబ్రహ్మము. అదే విధమున **"నైవవాచా నమనసా ప్రాప్తుం శక్యో నచక్షుషా అస్తీతి బ్రువతో న్యత్ర కథం తదుపలభ్యతే"** కఠోపనిషత్తు 2-3-12. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము వాక్కు మనసు చక్షువులకు ప్రాప్తింపరానిది ఉన్నది అని చెప్పుటకు వినా మరొక రీతిగా ఉపలబ్ధి కాజాలదు.

ఈ భావమునే కృష్ణదేశికేంద్రులవారు 34వ. క.ద.॥నందు **"పలుకున బలుకగ రాకను। తలపోయుద మనిన మదికి దగులక యెపుడున్। ములుగ్రుచ్చసంధి లేకను కలిగున్నది బట్ట బయలు గదరా మాయన్నా"** "అని స్పష్టముగా జెప్పియున్నారు. మరియు

క.ద. 40నందు **"కనవచ్చి యిట్టిదట్టిది యనియన రాకుందు బయలు"** అనీ సెలవిచ్చి యున్నారు. అనగా పరబయలు అగుపడి వాక్కుచే అటువంటిది ఇటువంటిదని చెప్పుటకు అలవిగాకుండ యుండును. అదిగోదానిని చూడమన్నారు. అంటే ఎరుకలేక చూడమన్నారు, సేవించుమన్నారు.

సృష్టికర్తగాని సృష్టిలోమరేదిగాని పరిపూర్ణమందు లేదు. సృష్టికారణమైన బ్రహ్మాస్వరూపమే అందరి యొక్క స్వస్వరూపములు, నిజరూపములు. కాని చెప్పే తాను కూడా లేనప్పుడే పరిపూర్ణపరబయలనెడి పేరు.ఆకేవలబ్రహ్మాకు సార్ధకమగును. నిజముగా యోచించినచో **అప్పుడు పరిపూర్ణమని పలుకుటకు యెవరున్నారు.** కావున పరిపూర్ణ పరబ్రహ్మా శబ్దమొక్కటే నరుని నోట యెంగిలి కానిది. మిగతా సమస్తము వాక్కుతో ఉచ్ఛరించుటకు అభ్యంతరము లేదు. కనుక వాఙ్మయమంత ఉచ్ఛిష్ఠమే. వాక్కుతో వచించరానిది ఆ పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే. కావున వాక్కుచే ప్రకటించజాలనిది మాత్రమే బ్రహ్మమని తెలియుము.

ఏది ఉపాసితవ్యము అనగా ఉపాసించుటకు సాధ్యమగునది కాదో దానిని బ్రహ్మముగా తెలుసుకొనుము. అదే పరిపూర్ణపరబ్రహ్మము. సేవలేక ఉపాసన అనుటతోనే సేవ్యవస్తువు, సేవ, సేవకుడు లేక ఉపాస్యవస్తువు ఉపాసన, ఉపాసకుడు అనే త్రిపుటి సిద్ధమగు చున్నది. పరిపూర్ణపరబ్రహ్మము ఉపాస్యముకాదు. ఉపాసింపదగినది బ్రహ్మమే కాదు. "నేదం యదిద ముపాసతే" అని ఈ మంత్రమున ఉద్ఘాటించబడినది. కనుకనే కృష్ణదేశికేంద్రులవారు "ఎరుకలేక సేవింపదగును" అని అన్నారు. త్రిపుటి రహిత మందే పరిపూర్ణ పరబ్రహ్మము. త్రిపుటి కందునది ఎరుక బ్రహ్మముగా గుర్తించవలయును.

ఏ బ్రహ్మమునైతే ఈ లోకమున జనులు పూజిస్తున్నారో అది బ్రహ్మము (పరిపూర్ణపరబ్రహ్మము) కాదు. స్త్రీ, పుత్ర, ధన, గౌరవ, కీర్తి ప్రతిష్ఠ అధికారములవంటి నశ్వరమగు ఇహలోక పరలోక సామగ్రియందు ఆసక్తులై మానవులు వానినే సౌఖ్యహేతువులుగా భావించెదరు. వాటిని సంపాదించి, అనుభవించుటలోనే ఎల్లప్పుడు తలమునకలై యుండెదరు. అంతేగాక ఈ భోగ సామగ్రిని సంపాదించి, సంరక్షించి వృద్ధి చెందుటకై తత్సంబంధితమగు వివిధ దేవతలను ఉపాసించెదరు. స్వయంగా వీరు జనన మరణ చక్రములో పడిపోయిన కారణంగా శరీర దృష్టితో వినాశ శీలులైనారు. ఇట్టి భోగాసక్తులైన మనుజులు తమ ఉపాసనాఫలరూపముగా వివిధ దేవతలకు చెందిన లోకములను విభిన్న యోనులను పొందుదురు.

బ్రహ్మలోకము వరకుగల అన్నిలోకములు యోనులు, **"క్షీణేపుణ్యేమర్త్యలోకవిశంతి"** యను న్యాయమున నశ్వరములు. కనుక అచటికి చేరుకొను జీవులు కూడ ఈ భూలోకమునకు రావలసి వచ్చును. పరిపూర్ణపరబ్రహ్మా మొక్కటే శాశ్వతము. అట్టి దానిని ఆత్మస్వరూప నిశ్చయ జ్ఞాన స్వరూపలే తమ కర్తవ్యముగా సేవింపతగినది. ఇతరులు ఇచట జనులు పూజించేది బ్రహ్మముకాదని ఈ ఉపనిషత్తు ఘోషించుచున్నది.

# 4. ఎరుక

న తస్య కార్యం కరణంచ విద్యతే, నతస్సమశ్చాభ్యధి కశ్చ దృశ్యతే ।
పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబల క్రియా చ ॥ ॥శ్వేతా॥

తా॥ ఆ బ్రహ్మమునందు కార్యకారణములు లేవు. దానితో సమానమైనది గాని దానికంటే అధికమైనదిగాని లేదు. జ్ఞానబల క్రియాత్మకమగు దాని పరాశక్తి ప్రభావముచే అది సర్వమును సృజించు చున్నది.

మతవాదము లన్నిటిలో అద్వైతవాదము గొప్పది. అందలి సిద్ధాంత మేమనగా! **"బ్రహ్మసత్యం జగన్మిథ్యా, జీవోబ్రహ్మైవనాపరః"**

బ్రహ్మసత్యం జగన్మిథ్యా అనగా బ్రహ్మము సత్యవస్తువు, జగత్తు మిథ్యారూపము, మిథ్యయనగా కేవలం అలీక పదార్థముగాదు. అనగా కేవలం శూన్యం మాత్రముగాదు. పారమార్థిక సత్యము లేనిది, అశాశ్వతమైనది.

"జీవో బ్రహ్మైవనాపరః" అనగా జీవుడు బ్రహ్మమేగాని వేరుగాదు - మహా వాక్యములు దీనిని గట్టిగా ప్రతిపాదించినవి. అందు 'తత్త్వమసి వాక్యము' వాచ్యార్థముచే జీవేశ్వరైక్యమును, లక్ష్యార్థముచే ప్రత్యగ్బ్రహ్మైక్యమును సాధించుచున్నవి. తనకు తెలిసిన తెలియకున్న అంతా బ్రహ్మస్వరూపము మాత్రమే అయినపుడు ఐక్యము కొత్తగా గావించవలసినపనియే లేదు. అంతా బ్రహ్మస్వరూపమే. **"బ్రహ్మణోన్యంనకించన" "సర్వంఖల్విదం బ్రహ్మ"** అని శ్రుతులు ఉద్ఘాటించు చున్నవి.

శ్వేతాశ్వత రోపనిషత్తు యొక్క ఈ మంత్రమును పరిశీలించినట్లయితే అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు కార్యకారణములు లేవు అని బోధపడును. కాని అట్లనుట సరిగాదు. మొదట కార్యకారణములంటే యేమిటో తెలుసుకొందము.

**కారణము :** ఏ వస్తువు లేనిచో మరియొక్క వస్తువు తోచబడదో అది కారణవస్తువు.

**కార్యము :** అట్టి కారణవస్తువు యొక్క నామరూపముల కంటే భిన్నమగు నామ రూపములు గలిగి, విచారించగా కారణవస్తువు యొక్క మూలద్రవ్యమునకు మాత్రము భిన్నము కానిదైయున్న వస్తువు కార్యమనబడును.

ఉదా॥ మట్టిలేనిచో మట్టితో చేయబడే ఘట శరావాదులు ఉత్పత్తి కాజాలవు. కనుక మట్టి కారణవస్తువు, మండిగలు, కుండలు, గురుగులు, కార్యరూపవస్తువులు. నామ రూపములు వేరుగాని వానికి మట్టియే మూలద్రవ్యముగానున్నది. కనుక అవి మృత్కార్యములు. కార్యకారణ వస్తువులు వేర్వేరు. నామరూపములతో గానవచ్చుచున్నను తత్త్వతః ఆ రెండు మూల ద్రవ్యమగు మట్టికంటే భిన్నములుగావు. ఈ విధముగానే సృష్టికి అత్యంత మూల కారణం బ్రహ్మమే అని అన్నివేదములు, ఉపనిషత్తులు, పురాణములు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, షడ్దర్శనములు, వాదములు అన్నియు బ్రహ్మమే సృష్టికి మూల కారణమనియే చెప్పినవి. కనుక బ్రహ్మము నందు కార్యకారణములులేవని అనరాదు. కార్యకారణములు సంబంధమును తెల్పుతు శ్రీ కృష్ణదేశి కేంద్రులవారు క.ద. 128లో **"విత్తే చెట్టయి పుట్టును విత్తే! విత్తనము రీతి**

**వెలయును ధరపై! విత్తుకు చెట్టుకు వేరే! విత్తనమొకటున్న దనిన! విన గూడదోయీ తనకు దాబుట్టును వినుమోయీ!** "అని సెలవిచ్చియున్నారు.

తా॥ విత్తనము చెట్టుగా బుట్టుచున్నది. విత్తనము తన నిర్ణయ పద్ధతిగా భూమి యందు తానుగానే పుట్టుచున్నది. విత్తనమునకు చెట్టుకు వేరే ఒకవిత్తనము యున్నదని, దాని వల్ల ఇవి పుట్టుచున్నవని ఎవరైనా చెప్పినా ఆ మాటలు వినగూడదు. ఎందుకనగా కారణమగు విత్తు కార్యమగు వృక్షము నొకటితో నొకటి పరస్పర కార్య కారణములే కాని ఈ రెంటికి యితర కారణముండదు. విత్తుయందే చెట్టుగాని చెట్టుయందు విత్తుగాని తనకు తానే పుట్టును. అయినా కార్యకారణమైన చెట్టు యొక్క విధమును భూమిఎట్లు తెలుసు కొనుటలేదో, అటువలెనే సత్తు చిత్తుల రెంటి విధము పరిపూర్ణ పరబయలు తెలుసుకోదని భావము.

కారణమే కార్యము. కారణ కార్యములకు భేద మెన్నడునులేదు. కారణమున్నంత సేపు కార్యం లేక పోలేదు. కారణము నిబద్ధి అయితే కార్యం నిబద్ధే, కారణం అబద్ధము అయితే కార్యము అబద్ధమే, చెట్టువంటిది. కారణమునకు కులంలేదు, గోత్రం లేదు. కారణమునకు వుండెనా కార్యమునకు వున్నవి. కారణం దేవుడైన కార్యం దేవతా స్వరూపమే. గురువు, దేవత, ఆత్మ, అహంకార స్వరూపమే "నేనేఅనే అనుభవం వున్నది. గనుక "సోऽహం అని ఐక్యం అని, జీవుడు ఈశ్వరుడు ఒక్కడే" దీక్షితీయం 2వ భాగం. 4వ పుట.

ఇక బ్రహ్మతో సమమైనది గాని, అధికమైనదిగాని లేదు. బ్రహ్మము నిత్యమై శుద్ధమై నిష్క్రియమై నిర్గుణమై స్వయం ప్రకాశమై సర్వకారణమై సర్వమునకు ఆధారము అధిష్ఠానమునై సర్వవ్యాపకమై సచ్చిదానంద లక్షణములే స్వరూపము గలదై మనోవాగగోచరమై యుండునదే బ్రహ్మము అని చెప్పబడును. ఇది స్వరూప లక్షణము. అనగా సహజ లక్షణం, మొదటి రూపము. ఈ స్వరూపము గల దొక్క బ్రహ్మమే కనుకనే **"ఏకమేవ"** అన్నారు. అటువంటిది మరొకటి లేదు గనుక ప్రతి లేనిదగుటచే **"అద్వితీయం"** అన్నారు. ఇది బ్రహ్మమునకు తత్కాలమందు తటస్థించిన లక్షణమగుటచే దానిని తటస్థ లక్షణమందురు. కాకి కూర్చున్నదే దేవదత్తుని గృహమని చెప్పినచో కాకి యా యింటిపై నుండి మరుక్షణమున యెగిరిపోయిన యెడల దేవదత్తుని గృహవర్ణన ఎంత అసమగ్రముగా నుండునో అట్లే తటస్థ లక్షణముచే పరబ్రహ్మమును నిరూపించి జెప్పుటయు అంతే ప్రమాదమగును. అట్లుగాక యుత్కృష్ట ప్రకాశము గల చంద్రుని తేలికగా గుర్తించవచ్చును. దీనినే స్వరూపలక్షణ మందురు. స్వరూప స్వభావములచే మాయా తీతుడై నిర్గుణుడై నిష్క్రియుడైయున్న బ్రహ్మము నిర్గుణ బ్రహ్మమని తటస్థభావమున మాయాశబళితమై యున్న బ్రహ్మమును సమానమైనదిగాని అధికమైనదిగాని మరియొకటి లేదంటూ ఈ మంత్రము ఘోషించుచున్నది.

ఇట్లనుట కూడ సరిగాదు. 1. "సోऽకామయత బహుస్యాం ప్రజాయే యేతి " "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" 3. "బ్రహ్మణోఽవ్యక్తాన్, అవ్యక్తాన్ మహత్" అని శంకరులు జెప్పిన రీతిగా రూపాంతరాలు పొందుతుంది. తానుతానై నిలిచిన స్థితియందు

బ్రహ్మమని దాని ప్రథమ చలన రూపమైన స్థితికి అవ్యక్తమనీ ఆ అవ్యక్తమే మూల ప్రకృతియనీ నామాంతరములచే వ్యవహరింప బడుతు, జడ వస్తువుగా కూడ ఎంచబడుతుంది. కనుక ఈ అవ్యక్త స్థితియందు బ్రహ్మము తన చిత్స్వరూపము నుండి దిగ జారి అఖండ జ్ఞానమును గోల్పోయి అజ్ఞానరూపమై పోయింది. అంటే ఈ బ్రహ్మమునకు రాక పోకలు వున్నవనియే చెప్పవలెను.

వ్యష్టియందు పరిశీలించిన జాగ్రదవస్థయందున్న పరిపూర్ణజ్ఞానము స్వప్నావస్థయందు క్షీణించి, సుషుప్త్యావస్థయందు పూర్తిగా మరుగున పడుతుంది. కనుక జ్ఞాన రూపమైన యితరులు చెప్పే బ్రహ్మమునకు ఆవిర్భావ తిరోభావములు వున్నవని తెలుస్తుంది.

అణు ప్రమాణము, మధ్యప్రమాణము, మహత్ ప్రమాణమని ప్రమాణములు మూడు. అన్ని వస్తువులు ఏదో ప్రమాణములో వుండును. ఆయా వస్తువులను గుర్తెరుగునపుడు తెలివికూడ ఆయా ప్రమాణములు వహిస్తూ గొప్ప కురుచలై వుంటుంది.

**"ఆకాశశ్శరీరంబ్రహ్మ"** బ్రహ్మమునకు ఆకాశము శరీరముగా వున్నదంటే ఆవరణ మున్నట్లే గదా! ఈ విషయములను పరిశీలించిన తేలినది ఏమనగా ఎరుక బ్రహ్మము ఏకముగా లేదు. ఏకానేకములుగా నున్నది. కావున మారుతున్నది. దానికి సమానమైనది అధిక మైనది లేదనుటకు వీలులేదు.

బ్రహ్మము జ్ఞాన బలక్రియాత్మకమగు దాని పరాశక్తి ప్రభావముచే అది సర్వమును సృజించుచున్నది. పరబ్రహ్మయందు నిగూఢమై యున్న తెలివియే ఈ మనస్సు అయి యున్నది. ఏది కారణమందు లేకుంటే కార్యోత్పత్తి కాజాలదో అదేశక్తి కనుక పరబ్రహ్మమందు కూడ యిట్టిశక్తి కలదు. పరబ్రహ్మము వినా ఈ శక్తికి వునికి లేదు. శక్తియే జగత్తునకు కారణం అని అన్నవారు కూడ చివరకు ఈ బ్రహ్మమే సృష్టికి కారణమని అంగీకరించక తప్ప లేదు. ఈ శక్తి జ్ఞానరూపమున బలరూపమున క్రియాత్మకముగా నున్నది. దానినే పరాశక్తి అని అన్నారు. ఈ పరాశక్తియే సర్వమును సృజించుచున్నది. ఈ శక్తి అన్నిటియందు పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ రూపమున గలదు.

బ్రహ్మ చైతన్యాశ్రితమగు మాయ, చైతన్యమును విడిచి యుండదు. కనుక చైతన్యమే శక్తియనియు, చేతనశక్తియనిపేర్లు వచ్చినవి. బ్రహ్మము నందు బీజరూపమున అణిగిమణిగి యున్న సత్వ, రజో, తమో గుణములు మూడు కలిసి త్రిగుణాత్మకమగు మూలమాయగా నున్నది. ఇందు

1. **సత్వగుణము :-** శుద్ధమాయ, మహత్తు జ్ఞాన శక్తి లేక చిచ్ఛక్తి అని అందురు.
2. **రజోగుణము :-** మిశ్రమ మాయ, మహదహంకారము, యిచ్ఛాశక్తి యనబడును.
3. **తమోగుణము :-** మలినమాయ పంచతన్మాత్రలు ఆవరణశక్తి లేక ద్రవ్యశక్తి యనబడును.

గుణత్రయ పద్ధతిగాక శక్తిని బాహోటముగా రెండు ప్రధాన శక్తులుగా చెప్పవచ్చును.

1. చేతనాశక్తి, జీవశక్తి లేక పురుషశక్తి ఇదియే పరా ప్రకృతి యనబడును. ఇది తెలివి రూపమగు చిచ్ఛక్తి

2. చేతన శక్తి, జడశక్తి, ప్రకృతిశక్తి ఇదే అపరా ప్రకృతి రూపముగా నున్నది. ఇది విస్మృతి రూపమగు ఆవరణశక్తి.

చేతన శక్తి ప్రాణములందును, అచేతనశక్తి భౌతిక పదార్థములందు కలవు. అచేతనశక్తికి అగ్నియొక్క దాహక శక్తియు, వాయువు యొక్కచలన శక్తియు, ఉదాహరణములు.

పరమాణువులందున్నది అచేతనమగు చలనశక్తియే, శక్తి యొక్క అచల రూపము పురుషుడనియు చలన రూపము మాయ అనియు లేక ప్రకృతి యనదగును. ప్రకృతి పురుషులను గర్భీకృతము జేసుకొన్నదే బ్రహ్మము. ఇట్టి బ్రహ్మము తనపరాశక్తి ద్వారా సర్వమును సృజించుచున్నది.

## 4(ఎ) పరిపూర్ణ పరబ్రహ్మము

| స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణమద్వయ మక్రియం॥ అధ్యాత్మ॥ |
|---|

తా॥ పరిపూర్ణ పరబ్రహ్మము తన యందుగాని, తనకు వేరుగా గాని, రెండవదనేది ఏమియు లేక ఒకటై నిష్క్రియమై యున్నది.

పరిపూర్ణపరబ్రహ్మమందు అ ్యదే మిలేదు. పరిపూర్ణముతప్ప తదన్యమంతయు ఎరుకేయని తలంచుము. ఈ భావమును శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ 54క.ద.నందు **"పరిపూర్ణమొకటి దక్క నితరమైన ప్రపంచమెల్ల దగ తెలియుము నీ వెరుకేనని మదిలోపల"** అని సెలవిచ్చి యున్నారు. ఆ లేనెరుక ఆ పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈషణ్మాత్రము లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తించు ఎరుక పరిపూర్ణ మందులేదు. కనుక అది గుర్తింపబడ జాలదు. అట్లని అది శూన్యంకాదు, అది ఏకైక **ఆస్తిక్యత** గలది. దాన్ని తెలుసుకొనే తెలివి లేనేలేదు. ఇంద్రియములు లేవు. అతీంద్రియ రూపముగాను, ఇంద్రియ రూపముగాను వున్నది ఎరుకే. పరిపూర్ణ పరబ్రహ్మము అట్టి అతీంద్రియారూపమైన ఎరుక బ్రహ్మముచే గుర్తింపరానిది. దానియందు పంచతన్మాత్రలు లేవు క.ద. 39॥ **"లేదనకు మున్నదదుగో। నేదెలిసితి ననకు దీన్నినీ వెరిగేవా। కాదది నీచే తెలియును। యేదిరతన్మాత్ర సమితి ఈ బట్ట బైటా"** అని ప్రశ్నించియున్నారు శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు. పరబయలందు యెరుక వున్నట్లుతోచును గాని నిజముగా లేదు. కనుక పరబయలు తప్పయితరమేమి లేనే లేదని నిర్ణయము.

| శ్లో॥ యథానాహం, తథాశుద్ధం, తస్మాచ్ఛుద్ధేన నిర్ణయః।<br>జగదస్తీతి కోవేద, నాస్తి కో నచ నిర్ణయః॥ |
|---|

తా॥ తానులేకుండా వుంటే ఎట్లుండునో అట్లే శుద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మముండును. నేను లేకుండుట చేతనే అది శుద్ధం అని నిర్ణయము,నేను లేనిచో జగత్తు వున్నదని తెలుసుకొనే వారెవరు? నాస్తికులుగాని, ఏ నిర్ణయములుగాని ఉండుటయు పొసగదు అనిభావము.

అహం శబ్దమునకు నేను అని అర్థము. ఈ నేను స్థూల సూక్ష్మకారణ మహాకారణ శరీరములలో సందర్భమును బట్టి దేనికైన వర్తించగలదు. అంతేగాక కారణబ్రహ్మమే జీవేశ్వర జగద్రూపముగా మార్పుచెందినది. కనుక సర్వం ఆత్మమయం, నేను యొక్క నిజరూపము ఆ కారణ బ్రహ్మమే అనీ, అదే అహం పదార్థమని, అఖండ ఎరుకయని, గమనించవలెను. ఈ అహంపదార్థము లేనిచో ఏ ముందును, మహా పరిశుద్ధమైన పరిపూర్ణపరబ్రహ్మముండునని ఈ శ్లోకము నిర్ధారించుచున్నది. ఆ పరిపూర్ణ పరబయలునందు ఇతరమేమిన్ని ఏ కొంచమైనను లేదు. కనుక అది మహాశుద్ధము. అది దోషరహితము **"నిర్దోషంహి సమం బ్రహ్మం"** దోషరహితమైనదే నిజమగు బ్రహ్మము. దానియందు సర్వదోషములకు అత్యంత మూలకారణమగు అఖండ ఎరుకలేదు. కనుక జగత్తువున్నదనిగాని, లేదనిగాని ఎవరు తెలుసుకొనగలరు? ఎవరుచెప్పగలరు. లేదని చెప్పే నాస్తికులు మాత్రముందురా? అది వున్నదనీ దాని యందు నీవు లేవనీ అరూఢమైతే (గట్టిగా నమ్మితే) నీకు జనన మరణ భ్రాంతి రహితమై తీరును. **"నిర్ణయోనాస్తిసర్వదా"** అనిచెప్పబడుతుంది. పరిపూర్ణ పర బయలును గూర్చి (అది మనో వాక్కుల కందనిది) నిర్ణయించుట మహాపాపమని దీక్షితుల వారి వాక్కు.

**పరిపూర్ణమక్రియం** ఇతరులు జెప్పిన బ్రహ్మము ఎరుకనేగాని అచల పరిపూర్ణులు జెప్పిన బ్రహ్మముగాదు. పరిపూర్ణ బ్రహ్మమునందు ఎటువంటి క్రియలేదు. క.ద. 169 **"నామము రూపము, నటన। స్థోమము బయలందు లేదు, చూడుము నీవా। నామము రూపము నటన। స్థోమము యెరుకందు గలదు చూడుమి నిజమూ॥ అనీ క.ప. 60... "బయలెప్పుడు జేయబోదు పనులెవ్వైనన్** "అనగా సమిష్టి రూపములైన సర్వజ్ఞత్వ కర్మలలో ఏ కర్మకూడ చేయునట్టిది కాదని శ్రీకృష్ణదేశికేంద్రులవారు సూటిగాజెప్పినారు. కనుక పరిపూర్ణ పరబయలు మక్రియం. పోతే ఈ ఎరుక బ్రహ్మమును గూడ యితరులు సాక్షియని, నిష్క్రియం అని కొనియాడుచున్నారు. అట్లనుట సమంజసముగాలేదు. ఎందుకనగా ఎరుకే (జ్ఞానము) ఒక స్థితి యందు అజ్ఞాన రూపమై మరుపు లక్షణం చెందుతుంది. తాను తానైన స్థితియందు అజ్ఞాన రూపమై మరుపు లక్షణం చెందుతుంది. సృష్టికి పూర్వం బ్రహ్మము **"జ్ఞానాదేవతుకైవల్యం"** అనేరీతిగా ప్రజ్ఞానమైయుండి, తనను తాను మరచిన స్థితియందు అవ్యక్త రూపమైయున్నది. అనగా తనస్వరూపమును మరిచె ననుట జ్ఞానాజ్ఞాన రూపంగాయున్న ఈ బ్రహ్మము నిష్క్రియమనుటకు వీలులేదు. జ్ఞానమునకు యెరుగుట అదిభౌతిక వ్యవహారము. ఎరుగుట ఎరుగక పోవుట అనురెండు గలవా? అట్లే సాక్షిగాయుండుట యుండక పోవుట గూడ. మరి పనిచేయుశక్తి యున్నచో ఆపనిని ఆపుచేయుశక్తి యుండును. **"నిర్మలం నిష్క్రింయం పూర్ణం"** అని కొనియాడబడుతున్నది. క.ద. 35 **సామర్థ్యమేమి జూపదు కామక్రోధాదికముల గలయదనిశమే। బాములెరుంగదు యితరులు। యేమనిననుమారు బల్కా। దీ బట్టబయలూ"** అని కృష్ణదేశికులు సెలవిచ్చియున్నారు.

**4(బి) యఏవం నిర్బీజం వేద, నిర్బీజ ఏవ నభవతి ॥ సుబాలోపనిషత్తు**

తా॥ అది బీజరహితమని అనగా దానికి కారణం కాదని తెలుసు కొన్నవాడు, బీజరహితుడై తిరిగి పుట్టడు.

దిగువనగల శ్రీ కృష్ణదేవేంద్రులవారు కందములను పరిశీలించిన యెడల మనకు బోధపడునది మేమనగా పరిపూర్ణ పరబ్రహ్మము తాను పుట్టదు. ఇతరులను పుట్టించదు. కనుక అది బీజరహితమని స్పష్టమగును.

కం.ప. 60. **"బయలెప్పుడు పుట్టి గిట్టదు। బయలెప్పుదు ముట్టుకోదు బ్రహ్మాండంబుల్"** అనీ, కం.ద. 31 **"పుట్టుటగిట్టుట లేకను। పుట్టే గిట్టే యెరుక పోడిమెరుగకన్! చట్టువలె కదలకుండును। బట్టబయల్** "అని సెలవిచ్చియున్నారు.

పరిపూర్ణపరబయలు పుట్టనిది, చావనిది. ఒకప్పుడు లేకుంటే పుట్టిందనాలి లేక చచ్చిందనాలి. కాని ఎల్లప్పుడు సర్వకాలాలయందు, సర్వావస్థల యందు వున్న దానికి పుట్టు టేమిటి, గిట్టుట యేమిటి. మాయ అనాది అన్నారు. అదిపుట్టుక లేనిదనికదా అర్థం.కాని బ్రహ్మజ్ఞానంవల్ల మాయ నశిస్తుంది. పుట్టుకలేనిదైన అది నశిస్తుంది. **"సత్వాత్సం జాయతే జ్ఞానం"** అని జ్ఞానమునకు పుట్టక నిర్ణయించినారు. అయితే **"జ్ఞానదేవతుకైవల్యం"** జ్ఞానము పరబ్రహ్మము కనుక దానికి నాశనము లేదని ఇతరులు అంటారు. అది సాది కాని అనంతము. అదిపుట్టునుగాని గిట్టదు. కనుక అతివ్యాప్తి అవ్యాప్తి దోష పరిహరణార్థము పుట్టదు, గిట్టదు అని రెండు మాటలచే చెప్పబడినది.

తాను పుట్టనిది చావనిది కనుక పరబయలు ఇతరములు పుట్టింపజాలదు. గిట్టింపజాలదు. విచారించి చూస్తే సృష్టిలో పుట్టుక యున్నప్పుడు ఈ జీవి తన వంటి మరొక జీవిని ఉత్పత్తి చేయటానికి సమర్థత కలిగి యుంటుంది. ఉ॥ వృక్ష బీజములు. ఇవి పరస్పర కార్య కారణములుగా వుంటూవున్నాయి. పుట్టేటప్పుడు కారణ రూపముగా పుడుతున్నాయి. పోయేటప్పుడు కూడా కార్యమును తనయం దిముడ్చుకొనే కారణం పోతూవున్నది.

> **సతోహి మాయయా జన్మయుజ్యతే నతుతత్వతః**
> **తత్వతో జాయతే యస్య జాతం తస్యహి జాయతే॥**
> (మాండూక్య కారికలు వైతథ్యప్రకరణము 27)

అనగా పుట్టనిదాని నుండి ఏదియు పుట్టజాలదు. పుట్టిన దానినుండియే మరొకటి పుట్టును. కారణమైనదేదో అనగా సృష్టికారణమైనదేదో అది పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. పరబయలునకు అన్యముగా తోచబడు వానిలో దేనికిన్ని పరిపూర్ణ పరబ్రహ్మ మూలము గాదని సిద్ధించుచున్నది. పరిపూర్ణపరబ్రహ్మము త్రికాలా బాధ్యము. మూడు కాలములలో ఎట్టి మార్పునకు గురికాదు. ఎల్లప్పుడు గలదు కనుక దానికి పుట్టుకలేదు. చావులేదు. గనుకనే దానిని బీజరహితమని ఈ మంత్రమున జెప్పినారు. అట్లెరిగిన వాడు బీజరహితుడగును. భ్రాంతి రహితమే జన్మ రాహిత్య మోక్షము. కావున బీజరహితమై వేయించిన విత్తనము ఎట్లు మొలకెత్తదో అట్లే పరిపూర్ణము బీజరహితమని ఎరిగినవాడు తిరిగి పుట్టడని ఈ ఉపనిషద్వాక్యార్థము.

## 5. ఎరుక

**యతోవా ఇమాని భూతాని జాయంతే, యేనజాతాని జీవంతి, యత్ప్రయం త్యభి సం విశంతి, తద్విజిజ్ఞాస స్వ త ద్బ్రహ్మేతి॥ తైత్తిరీ యోపనిషత్తు॥**

తా॥ దేనియందు భూతములు పుట్టు చున్నవియో, పుట్టినవి దేనిచేత బ్రతుకు చున్నవో తిరిగి మరణాంతరము దేనియందు ప్రవేశించుచున్నవో అదియే బ్రహ్మము (సృష్టికారణ బ్రహ్మము). దీనిని గురించి జిజ్ఞాస గావించుము. అనగా విచారణ చేయుము.

సృష్టికి అత్యంత మూలకారణము బ్రహ్మమే అని ఋజువగుచున్నది. కొన్నింటిని పరిశీలింతుము.

ముండకోపనిషత్తు 1.వ ముండకము7వ. మంత్రము

**"యథోర్ణనాభి సృజతే గృహ్ణతే చ। యథా పృధివ్యామోషధయః సంభవంతి, యథాసతః పురుషాత్కేశలోమాని తథాఽక్షరాత్సం భవతీహవిశ్వం"॥**

తా॥ ఆ బ్రహ్మము, సాలెపురుగు దారములను ఎట్లు తన నుండి బహిర్గతమొనర్చి పిదప లోనికి తీసుకొనుచున్నదో, భూమి నుండి వృక్షాదులు, మానవ శరీరమున కేశ రోమాదులు యుత్పత్తి చెందుచున్నవో, అట్లే ఇతర సహాయములేక ఈవిశ్వమును పుట్టించుచున్నది. అనగా బ్రహ్మమే నిర్గుణ సగుణ రూపముగానై సాలెపురుగువలె జగద్రచన చేయుచున్నది.

**8వ. మంత్రం: "తపసాచీయతే బ్రహ్మ తతోఽన్నమభి జాయతే ।
అన్నాత్ప్రాణో మనఃస్సత్యం లోకాః కర్మసుచామృతమ్॥**

తా॥ ఇందు సృష్టిక్రమము వర్ణింపబడినది, జ్ఞానస్వరూపమగు బ్రహ్మము సృష్టి చేయు సంకల్పముతో వృద్ధిచెందగా నందు అవ్యాకృతము, అవ్యాకృతమునుండి హిరణ్యగర్భుడు, మనస్సు, సత్యమను పేరుగల భూతపంచకము, లోకసప్తకము, లోకస్థులు, కర్మ, కర్మఫలము ఒకదాని నుండి యొకటి వుత్తరోత్తర క్రమముగా పుట్టుచున్నవి.

**"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంతి ఉపాసీత"** 3-14 ఛాందోగ్య ఉపనిషత్తు

తా॥ ఈ జగ మంతయు బ్రహ్మమే ఎందుచేతననగా తజ్జలానితి అని చెప్పబడెను. తజ్జలానితి అనగా తజత్వాత్ దానివలన పుట్టినదగుటచే 2. తల్లాత్వాత్ దాని యందు లయించునది అగుటచేతను 3. తన్నిష్ఠత్వాత్ దాని యందు స్థితి గలిగి యుండుట చేతను అనగా బ్రహ్మము చేతనేపుట్టి బ్రహ్మము యందే స్థితిగలిగి యుండి చివరకు బ్రహ్మమునందే లయించు స్వభావము గలుగుటచే ఈ జగమంతయు బ్రహ్మమేనని ఛాందోగ్య ఉపనిషత్తు విధించుచున్నది. ఈ ఉపనిషత్ ప్రమాణానుసారము సద్రూపబ్రహ్మము నుండి కలిగిన అగ్ని జలము, పృథ్వి, త్రివృత్కరణము చెంది సమస్త సృష్టి అయ్యెను.

## 5. పరిపూర్ణ పరబ్రహ్మము :

> "కార్యోపాధిరయం జీవః కారణోపాధీశ్వరః !
> కార్యకారణ తాంహిత్వా। పూర్ణ బోధోవశిష్యతే॥ శుకరహస్యోపనిషత్తు॥

తా॥ జీవుడు కార్యరూపముగల వుపాధి అనగా క్షరోపాధి గలవాడు, ఈశ్వరుడు కారణోపాధి అనగా అక్షరోపాధి, ఈ ఉపాధి ద్వయ రహితమునందు పరిపూర్ణ పరబ్రహ్మమే శేషించుచున్నది.

సృష్టిని పరిశీలించినట్లయితే సమస్తసృష్టి అంతకును బ్రహ్మమే కారణము మరియు అట్టి బ్రహ్మమునుండి అయిన ఈ జీవేశ్వర జగత్తంతయు కార్యముగా జెప్పబడుచున్నది. కార్యకారణవస్తువులు వేర్వేరు రూప నామములతో గాన వస్తున్న, తత్త్వతః ఆ రెండు మూల ద్రవ్యమగు బ్రహ్మము కంటె భిన్నముగావు. ఈ భావమునే మహావాక్యములు బలపరుచుచున్నవి.

ఈ సృష్టికి మూలకారణం బ్రహ్మమే అని, వేదములు, ఉపనిషత్తులు, షడ్దర్శనములు వివిధ వాదములు, మతములు సృష్టికి అత్యంత మూలకారణము బ్రహ్మమే అని తేల్చిచెప్పినవి.

బ్రహ్మము తాను తానైన స్థితిలో సృష్టిలేదు. తనరూపములో జీవరూపముగా అణిగియున్న గుణత్రయములు అనగా సత్వరజో తమోగుణముల సామ్యావ్యవస్థయే ప్రకృతి. అదియే అవ్యక్తము, ప్రధానము, మూలమాయా యిత్యాదినామములచే ప్రసిద్ధము. గుణయుక్తుడగుటచే తాను తన సర్వాతీత స్థితి నుండి చ్యుతుడై సృష్టిక్రమమునకు లోనగును.

**"తస్మాద్వా, ఏతస్మాదాత్మన, ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః॥ఓషధీభ్యో౽న్నమ్। అన్నాత్పురుషః॥** తెత్తిరీయోపనిషత్తు అనుశ్రుతిని పరిపూర్ణులంగీకరించినారు.

**"ఆకాశంశ్శరీరం బ్రహ్మ"** అనురీతిగా ఆకాశమే శరీరముగాగల ఆత్మనుంచి ఆకాశాదులు కలిగి సమస్త పిండాండ బ్రహ్మాండములు కలిగినవి. ఈ భావమునే శ్రీకృష్ణదేశి కేంద్రులవారు **"ఆకాశాదిక భూతా। నీ కాత్మమగుచు ఎరుక యీజగమయ్యెన్"** అనీ సెలవిచ్చి యున్నారు మరియు క.ద. **82" ఎరుకైన భూతములు। నీ వెరుగుము ఆకసముగాద్బు। యింగలమును నీళ్ళ రవిందనేలయని నే నెరిగిన పద్ధతినీకు నెరిగించినాను"** మరియు క.ద. **73 "ఎరుకైన భూత పంచక మెరుకకు। చరణములు కటియు హృదయము గళమున్। శిరమును నయ్యెను క్రమమున। ధరణి మొదల్‌జేసి యిట్లు తనయా గుర్తెరుగు"** మన్నారు.

పంచభూతములు పరిణామము చెందిన యెరుక యనగా విశుద్ధ చేతనమునకు ఆ పంచభూతములలో పృథ్వి పాదములు, జలము కటి, అగ్ని హృదయము, వాయువు కంఠము, ఆకాశము శిరోభాగముగా అయి విరాట్పురుషుని స్థూలదేహమాయెను. కనుక బ్రహ్మము కారణము మరియు విరాట్పురుషుని స్థూలదేహము కార్యమాయెను.

ఈ మంత్రమున జెప్పిన విధమున కార్యోపాధి గలవాడు జీవుడు. అక్షరోపాధి గలవాడు ఈశ్వరుడు. స్థావర జంగమ జీవోపాధులు క్షరములు, ఆకాశముయొక్క సూక్ష్మభాగము ప్రకాశరూపమగు, ఆత్మరూప ప్రాణము రెంటి చేరిక అఖండ యెరుక అక్షరుడు. అక్షరుడనగా నాశనంగానివాడు.

అన్నము యొక్క సూక్ష్మాంశము మనస్సు. నీటి యొక్క సూక్ష్మాంశము ప్రాణము. ఈరెంటి వలన తెలియబడు జీవుడు లేక ప్రత్యగాత్మ క్షరపురుషుడు అని నిర్ణయము. క్షరపురుషుడనగా నాశనమగువాడని నిర్ణయము.

ఈ క్షరాక్షర పురుషులు వస్తు సముదాయము చేత నిర్ణయింపబడిన వారుగాని ప్రత్యేక పదార్థములుగాదు. కలయికవల్ల యేర్పడినవారు కనుక క్షరాక్షరములు శాశ్వతము అని, మోక్ష భ్రాంతి కలిగి యుండడము అనర్థకమని నిర్ణయించబడినది.

క్షరాక్షరోపాధి ద్వయ దోషమన్నారు. అదెట్లనగా ఏకంగా, మరియు ద్వయంగా అనగా రెండు రీతులుగా వుండడమే దోషము. క్షరోపాధికి జీవతనుచతుష్టయము అక్షరోపాధికి ఈశ్వరతనుచతుష్టయములు గలవని సాంఖ్యము నిర్ణయించినది.

| తనువులు | స్థూలం | సూక్ష్మం | కారణం | మహాకారణం |
|---|---|---|---|---|
| 1. జీవతనువులు | విశ్వుడు | తైజసుడు | ప్రాజ్ఞుడు | ప్రత్యగాత్మ |
| 2. ఈశ్వరతనువులు | విరాట్ | హిరణ్యగర్భుడు | అవ్యక్తము | పరమాత్మ |

ఈ ఉపాధి ద్వయంగా పొందిన శరీరములు పరిపూర్ణమందు లేవు. ప్రపంచము లోగల అన్నివస్తువులు దోషములతో కూడినవిగా నున్నవి. కేవలం దోషముగా కేవలం శుద్ధమైనవి ఏవి లేవు**"గుణ దోషమయం సర్వం స్రష్టా సృజన కౌతుకి"** అను న్యాయముగా అన్నియు ద్వంద్వ లక్షణాలు గలిగి వున్నవిగా నున్నవి. కేవలాత్మయనునది ప్రపంచములో ఏ వస్తువు నందులేదు. దోషము తనయందే గాని వస్తువునందు లేదు.

శబ్దాది విషయములు గుర్తించునది మనస్సు. మనస్సు గుర్తించనిచో బంధము లేదు. ఈ వుపాధి ద్వయ దోష రహిత మందు పరిపూర్ణమే శేషించును. ఇందుకు

**"నిర్దేహం నిర్మలం పూర్ణం తల్లింగ మచలం భవేత్।**
**మాయాపి వందితం బాహ్యమ్ తధ్యానం కురు సర్వదా॥ సర్వసారపూర్ణోపనిషత్తు-19.**

తా॥ శరీరము లేనిదే నిర్మలమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. ఆ లింగమే అచలం. మాయచే వందనము చేయబడినది. పరబాహ్యమును ఎల్లప్పుడు ధ్యానించవలెను అని సర్వసారపూర్ణోపనిషత్తు ధృవపరచుచున్నది. కావున ద్వయదోష పూరితమైన ద్వయ శరీరములులేనిది. వాని రహితమందు పరిపూర్ణ పరబాహ్యమే మిగులును.

## 6. ఎరుక

| బ్రహ్మశబ్దేన, తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం॥ తేజోబిందు॥ |
|---|

బ్రహ్మ అనుశబ్దముచేత స్వయం ప్రకాశాత్మరూపము అగు అనగా ఎరుక బ్రహ్మమేయని చెప్పబడుచున్నది. ఇది తత్పద వాచ్యము.

సర్వమునకు ఎరుకే (బ్రహ్మమే) మూలకారణముగానున్నది. దానికి మాత్రం మూలం లేదు. సృష్టి కారణ వస్తువుగా ఏ బ్రహ్మమును ఇతురులు ప్రసాదించిరో అదే ఎరుక. ఏ వస్తువును ప్రారంభముగా తీసుకొని కారణ పరంపరను విచారిస్తూ పోయినా చివరకు అత్యంత మూల కారణ వస్తువు ఆత్మనే (బ్రహ్మమే). కుర్చీనీ ఉదాహరణముగా తీసుకొంటే దానికి మూలం కఱ్ఱ, కఱ్ఱకు మూలం చెట్టు, చెట్టుకు మూలం భూమి, భూమికి మూలం జలం, జలమునకు మూలం అగ్ని, అగ్నికిమూలం వాయువు, వాయునవుకు మూలం ఆకాశం, ఆకాశమునకు ఆత్మ (ఎరుక) కారణ పరంపరగా గోచరిస్తూవున్నది. ఆత్మనుండి యివన్ని పుట్టాయంటే ఆత్మప్రకాశమువల్లనే యివన్ని పుట్టాయి అనాలి. ఆత్మప్రకాశము లేకుంటే ఇవన్నిటికి ఉత్పత్తి లేదు. కనుక ఆత్మకు కూడ పుట్టుకవుంది. ఎందుచేతనంటే పుట్టని దానినుండి మరొకటి పుట్టజాలదు. కనుక సృష్టికి కారణం ఆత్మ బ్రహ్మప్రకాశమే, మరి అది ఎట్లు పుట్టిందంటే స్వాభావికముగా పుట్టింది. కనుక స్వయంభూః అనగా మూలంలేదు. దాని కదే మూలం. కావున సృష్టి కంతటికి తనప్రకాశము లేక సత్తాచేత పుట్టించిందనాలి. కనుక దానికి స్వయం ప్రకాశ బ్రహ్మమని పేరుగాంచింది.

**"సచ్చిదానంద మాత్రోహం స్వప్రకాశోస్మించిద్ఘనః"** అని కృష్ణయజుర్వేదం బ్రహ్మ విద్యయందు చెప్పబడినది. అనగా సచ్చిదానంద స్వరూపముగా తోచబడి ఏ యితర ప్రకాశము నపేక్షించక స్వప్రకాశకుడ నగుచన్నానని భావము. **"సచ్చిదానంద తేజః కూటస్థరూపం తారకంబ్రహ్మ"** అధర్వణవేదం. 52 మహానారాయణమునందు జెప్పబడినది. అనగా ఖేచరి, భూచరీ, షణ్ముఖీ, యనుముద్రలచే స్థిర దృష్టిని చూడ, నానా విధములైన చిత్కళలు మొదట కనబడును. పిదప అగ్ని మండలము, దానియంతరమున సూర్యమండలమును చంద్రమండలమును గలవు. ఆ చంద్రమండల మధ్యమందు నీలమేఘమందలి విద్యు ల్లేఖవలె నీవారసూకమువలె సూక్ష్మమైన తేజస్సు హిరణ్మయమై కనబడును. అదియే తారకము. అట్టి తేజస్సే అంతః కరణాధిష్ఠాన కూటస్థుడును, ప్రత్యగాత్మస్వరూపుడు అని భావము.

**తత్పద వాచ్యము:**

నేత్రము గ్రహించు పదార్థమునకు సూర్యప్రకాశ మాధారమై యున్నది. అట్లే సూర్యుని ప్రకాశింపజేయు స్వయంప్రకాశ వస్తువున్ను యొకటియుండి తీరవలెను. అదియే చిత్స్వరూపము, అదియే బ్రహ్మము. ఏ పదార్థమును గుర్తెరిగిన యెడల రెండవ పదార్థము లేకపోవుటచే మరియొక దానిని చూచుట, వినుట మొదలగునవి లేకుండునో అదే బ్రహ్మము.

మాయ+ మాయయందలి చిదాభాసుడు మరియు తధిష్ఠానమైన బ్రహ్మము చేరినచో = ఈశ్వరుడు.

ఈశ్వరధర్మములు: 1. సర్వజ్ఞత, 2. సర్వశక్తి తత్వము, 3. వ్యాపకత, 4. ఏకత, 5. స్వతంత్రత, 6. సమర్థత, 7.పరోక్షతః 8. మాయోపాధి. ఈ ధర్మసహితముగా

మాయ మాయయందలి చిదాభాసము మాయాధిష్ఠాన బ్రహ్మము ఇవన్నియు చేరిన ఈశ్వరుడు తత్పదవాచ్యార్థము.

సకల ధర్మ సహితముగా మాయా చిదాభాసుల రెండింటిని జహదజహార్లక్షణముచే పరిత్యాగము చేయగా పరిశేషమైన మాయాధిష్ఠామైన ఈశ్వర సాక్షియైన బ్రహ్మమే తత్పద లక్ష్యార్థము. అదే స్వయం ప్రకాశమైన బ్రహ్మము.

ఆత్మశబ్దము తత్వశాస్త్రమున పరమాత్మను "శక్తిపదం", పదార్థ శాస్త్రమున శక్తిని ఎనర్జి సూచిస్తున్నవి. దేవ శబ్దానికి స్వయం ప్రకాశమని అర్థం. కనుక దేవాత్మశక్తి అనెపదానికి ప్రతివానిలోని స్వయం ప్రకాశ శక్తియని కూడ అర్థం. అదే స్వయం ప్రకాశరూపమైన బ్రహ్మము.

## 6. పరిపూర్ణ పరబ్రహ్మము

> బ్రహ్మశబ్దేన, తద్బ్రహ్మ స్వప్రకాశాత్మ రూపకం ।
> ఏతద్భావ వినిర్ముక్తం తద్బ్రహ్మ బ్రహ్మ తత్పరం ॥ తేజోబిందూ..

తా॥ "బ్రహ్మ" అను శబ్దముచేత స్వయం ప్రకాశ బ్రహ్మము అనగా తత్పదవాచ్యమగు బ్రహ్మమే చెప్పబడినది. ఆ భావమునుండి విడివడిన బ్రహ్మము ఏదిగలదో అది ఈ తత్పద నాచ్యమగు బ్రహ్మమునకు పరముగా యున్నది. అదే పరిపూర్ణ పరబ్రహ్మము.

"సర్వం ఖల్విదంబ్రహ్మ" "ఏకమేవాఽ ద్వితీయంబ్రహ్మ" యిత్యాదిశ్రుతులలో నున్న బ్రహ్మశబ్దమునకు మరియు మాయా పదముగా అచ్చతెలుగులో **ఎరుకనే** శబ్దమును వాడినారు. కారణముగానున్న ఎరుకే కార్యరూపమగు ఈ జగత్తు.

1. సృష్టి సంకల్పము గూడా కలుగని స్థితిలో పరాయెరుక అఖండ ఎరుకనీ,
2. సృష్టి కామన కలిగి వ్యవహరించునపుడు కేవల ఎరుక, శుద్ధ ఎరుక అనీ
3. జీవరూపము చెందునపుడు మిశ్రమ ఎరుకనీ
4. పంచభూతాత్మక జగత్తుగా పరిణమించినపుడు మలిన ఎరుక అనీ, ఒకే ఎరుక భిన్న భిన్న నామములతో వ్యవహరించబడుతుంది.

కారణ కార్యములుగా అథో యూర్ధ్వ పరిణామము చెందువస్తువును ఇతరులు బ్రహ్మమన్నారు. పరిపూర్ణభావజ్ఞులు **ఎరుకన్నారు.**

ఈ మంత్రమున "బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మప్రకాశాత్మరూపకం" అను బ్రహ్మము ఎరుక అని తెలియవలెను.

**"ఎరుక బ్రహ్మమనియె యియలశంకరార్యులు। తెలివి బ్రహ్మమనుచు తెపిపెవ్యాసు। ఎరుక తెలువులరెంట్ని ఎరుగడువేమన విశ్వదాభిరామ వినురవేమ॥**

ఈ భావమునుండి విడివడిన బ్రహ్మము యేదిగలదో అదే తత్పదవాచ్యమగు బ్రహ్మమునకు (ఎరుక) పరముగా నున్నది పరిపూర్ణ పరబ్రహ్మముగా ఈ మంత్రము స్పష్టపరచినది. అయితే స్వప్రకాశ బ్రహ్మమైన ఎరుకను (బ్రహ్మయను భావమును) ఎట్లు వదుల వలెనో దానిని వదిలిన ఏ బ్రహ్మముందునో అది తత్పద వాచ్యమునకు పరముగా ఎట్లున్నదో మనము పరిశీలింతము.

**281.క.ద॥ " గురుడచల చలములను తన కెరిగించిన శిష్యుడెరిగి యెరుకైయుండన్। యెరుకను నిల్పకు మనినను। యెరుకను విడనాడి శిష్యుడెట్లుండునంటె"**

తా॥ సద్గురువు సశిష్యునికి అచల పరిపూర్ణ పరబయలును, చలనము కలిగి తెలియుచున్న ఎరుక బ్రహ్మమును తెలియజేయగా శిష్యుడు ఎరుకై నిలిచి చలనము కలగి మూలములేక తెలియుచున్న ఎరుకను కర్మసన్యాసము, కర్మఫల త్యాగ పద్ధతిగా గాక, కర్తృత్వరహిత కర్మాచరణ పద్ధతిగా విడువుమని సద్గురుమూర్తి తెలియజేసినాడు.

ఇందలి భావమునందు పేర్కొన్నట్లు ప్రథమములో శిష్యుడు ఎరుకై నిలువవలెనని పేర్కొన్నారు. అంటే మొదట ఎరుకను ఎరుగవలెను. అంటే అద్వైత సిద్ధి నొందవలెను. అంటే ఎరుకను దర్శించు కొనవలయును. ఆ స్థితి యందు శిష్యుడుండగా దీనిని కూడ అంటే ఆ యెరిగిన తెలివిని కూడ వదలి వేయుమని జన్మరాహిత్యం గోరిన శిష్యునికి గురువు కర్తవ్యము జెప్పినాడు– **"పరిపూర్ణమెరుకల నెరిగితివి కదాయిక గురుదక్షిణగా యెరుకను మరివేగిర మివ్వు"** మంటున్నాడు. ఇది ఎట్టివానికి సాధ్యము? ఎరుక గురుదక్షిణగాయిచ్చి వేస్తిని అని వాచా అంటే సరిపోతుందా?చాలదు?

ఎరుకను ఎరిగిన పిమ్మట దానిని వదలవలె. ఎరుకను గూర్చి పరోక్షంగా శ్రవణం చేసినంత మాత్రాన ఎరుగుటయగునా? దేనినైన పూర్తిగా ఎరుగవలెనన్న తన మనస్సు ఆ వస్తురూపము దాల్చిననే ఆవస్తువు అపరోక్షమైనదనాలి. ఇక్కడ ఎరిగేది, ఎరుగబడేది, రెండూ ఎరుకే

1. వ్యష్టి రూపమైన ఎరుక, జ్ఞానరూపము 2. సమిష్టి రూపమైన తన స్వరూపమేజ్ఞేయం.

**శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ। జ్ఞానంచ మనవుచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం సమంకృత్వా । యథానాన్యత్ ద్వితీయకం॥ గురుగీత॥**

అని అంటుందీ గురుగీత, అనగా జ్ఞానజ్ఞేయముల అంతరము (భేదము) నశించి (అభేద బుద్ధికలిగిన) రెండు ఏకరూపము వహిస్తేనే ఎరుక అపరోక్ష మైందన్నమాట. అప్పుడే శిష్యుడై ఎరుకై నిలిచినాడనాలి. ఇందుకు ముందుగనే శిష్యుడు జ్ఞేయరూప యెరుక యొక్క స్థానస్వరూప స్వభావములను గురుముఖత వస్తునిశ్చయ రూపముగా గుర్తించవలసియున్నది. ఆ పిమ్మట గుర్తించిన జ్ఞాన మారూఢంకావాలి. అపుడింక తెలివిచే తెలియదగిన ఇతరములేదు. అప్పుడు సర్వం తానై నిలిచిన తానూ, తన కన్యమగు పరిపూర్ణము మాత్రమే వుంటాయి. పరిపూర్ణ మందు తనకు మూలం లేదనే విషయమున్ను ఇచటనే ఆరూఢమౌతుంది. పరిపూర్ణము ఘట్టిగా వుండజూచుకొనే స్థితి ఇక్కడనే.

అపుడు చేయదిగిన కర్తవ్యమేమి? గురువు ఎరుకను నిల్పకుమని చెప్పిన మాటను పాటించి పాలించుటయే. ఈ స్థితియందే ఎరుకను విడిచే సామర్థ్యము కలుగును. **"ఎరుక కూకటి వేరు నెరిగి త్రవ్వితే చాలు"** అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు సూచన జేసియున్నారు. జ్ఞానజ్ఞేయ రూపముగానున్న తన స్వరూపము కంటె పరంగా నున్న

పరి పూర్ణము నందు తనకు మూలము లేదనిన్ని, నిలుచుటకు స్థానంలేదని తెలుసుకొని తానే బ్రహ్మననే భ్రాంతిని వదిలివేయుట లేక విడుచుట ఎరుకను వదలుట. ఇందుకు యే సాధన కావాలె? అంటె శ్రీ కృష్ణదేశికేంద్రులవారు ఏ సాధన చేస్తే ఎరుక రహిత మగునని, ఆ ప్రశ్నకు ఏ సాధన చేస్తే కలయందున్నవానికి కల రహితమగునూ అని ఎదురుప్రశ్న వేసినారు.

అట్టి ఎరుక స్వరూపుడుగా నిలిచినవాడు తనకు పరంగా నున్న పరిపూర్ణ పరబయలును సత్యముగాను, తన కలిమి తనతోపాటు కలవంటిదని, మృషయని గురువాక్యరీత్యా భావిస్తే ఎరుక యందలి భ్రాంతి రహితమగును. **"యాదృశీ భావనాయత్ర, తాదృశీభవతి నిశ్చయం"** అనే మాట సార్ధకమగును. <u>ఎరుకై నిలుచుట:</u> తనవ్యష్టి జ్ఞానం నిజంగా ఏ మాత్రము అల్పమైనది గాదు. కించి జ్ఞాత్వాది అల్ప లక్షణములు కలది కూడ కాదు. అది సామాన్యమైనదిగాదు. అది కేవలం పరాఎరుకనే. దానికి దోషములుండుటచే దాని శక్తిసామర్థ్యములు మరుగున పడినవి.

తానే పరాఎరుకయని పరాయెరుకకు పరిపూర్ణపరబ్రహ్మమందు మూలంలేదు. కనుక మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమునకు మూలం లేనే లేదని, దోషములు దూరీకృత మొనర్చుకొని శుద్ధాంతఃకరణముచే గ్రహించి, ఆ ఆరూఢజ్ఞానముచే సుస్థితుడై యుండుటయే ఎరుకను మానుట అని అర్థము.

ఈ అర్థములో వ్యష్టియందు గాని, సమిష్టియందుగాని యెరుక నాశనమైనదా? అంటే ఎంత మాత్రం కాలేదని తెలియవలెను. మరియు 1) ఎరుక పుట్టనే లేదని అచల ఋషుల సిద్ధాంతము. కనుక 2)<u>ఎరుకకు నాశనంలేదు. అంటే ఎరుక వుండికూడ లేనిదే యగుచున్నది.</u> 3) ఎరుకను కలబాసిన మనుజుడు కూడ కలలోని పనులు చేయుచునే యుండును గాని అట్టి కర్మ ఆగామి రూపంగా ఎట్టి అదృష్ట ఫలమును సృష్టించ జాలదు.

కనుక స్వయంప్రకాశ బ్రహ్మము వదిలినగాని దానికి పరంగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షమగును. ఈ భావమునే సూటిగా ఆట వెలది పద్యములో వేమన యోగిజెప్పిన పద్యమును పరిశీలింతము.

ఆ॥ **రూపమడగ జీవ రూపంబుగనరాదు! యట్టి రూపమడుగనలవిగాదు! బ్రహ్మమడగక బ్రహ్మంబుగనరాదు! విశ్వదాభిరామ వినురవేమ॥**

తా॥ ఈ స్థూలదేహము మనిషికిరూపం. ఈ స్థూలశీరరమును ఆశ్రయించియున్న జీవమును ఎలా చూడవచ్చును. ఈ కన్నులతో దానిని చూడలేము. అనగా స్థూల శరీరముతో (రూపముతో) దానిని చూడలేము. కనుక ఈ రూపమును అణచినవానికే (సూక్ష్మము జేసినవానికి) జ్ఞానదృష్టిచే జీవరూపము తెలియబడును.

ఈ జీవరూపమును కూడ అణచివేసి బ్రహ్మరూపమును చూచుట సమస్యకాదు. ఒకవేళ ఆ జీవరూపమును అణచి బ్రహ్మరూపమును జూచిన అది కనరాదు. ఎందుకనగా నేను (జీవరూపము) ఆ బ్రహ్మము ఒక్కటే **'జీవోబ్రహ్మైవనాపరః"** కనుక నా కన్యముగా నున్న పరబయలును చూడవలయునన్న నేను అనుభావము (జీవభావమును) నేను

బ్రహ్మననే భావమును దానితోపాటు దానిని చూస్తానను భావమును కూడ త్యజించినవాడే ఆ బ్రహ్మమును చూచిన వాడగును. అంటే తన్ను విడిచి చూచుటే ఎరుక లేక సేవించిన వాడగును.

## 7.(ఎ) ఎరుక

**ఏష సర్వేషు భూతేషు గూఢోఽ ఽ త్మాన ప్రకాశతే ।**
**దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥ కఠో 1-3-12**

తా॥ ఏ ఆత్మ (బ్రహ్మము) సర్వభూతము లందు కనుపించకుండా గూఢముగా నున్నదో ఆ ఆత్మను తత్వవేత్తలు తమ సునిశితమగు ఏకాగ్రబుద్ధిచే చూచుచున్నారు.

ఆత్మయనగా సకలప్రాణులందు సమస్త వస్తువులందు బాహ్యాభ్యంతర భేదములేకుండా వ్యాపించి యున్నదని వుత్పత్త్యర్థము. ఆత్మ, బ్రహ్మము అని రెండు శబ్దాలచే వ్యవహరించబడే వస్తువు ఒకటియే గాని వేరు గావు."ఆత్మైవేదం సర్వం" ఈ సమస్తము ఆత్మయే అని ఉపనిషత్తు పల్కినది. పాలలో వెన్నవలె, కట్టెలో అగ్నివలె ఈ ఆత్మ ప్రపంచమంతటా నిండియున్నది. అన్నిటి యందు గుప్తమైయున్న ఈ ఆత్మ అందరికి ప్రకటితము కాదు ఎందుకనగా.

**"సూక్ష్మాతి సూక్ష్మపరం నిత్యం"** - గురువాక్యోపనిషత్ వక్కాణించినది. ఆ బ్రహ్మము సూక్ష్మమైన దానికంటే సూక్ష్మమై పరమై నిత్యమై అనగా శాశ్వతమై యున్నది. అంటే అణువుకంటే సూక్ష్మము, సూక్ష్మము కంటే అతి సూక్ష్మమై యున్నది. ఉ॥ ఇంటి కప్పులోని రంధ్రముగుండా సూర్యకిరణములు ఇంటిలోనికి ప్రవేశించునపుడు ఆ కిరణములు వెలుగులో తేలియాడు అనేక నలుసులు మనకు కానవచ్చును. అందొక నలుసును అణుప్రమాణము గలదని చెప్పవచ్చును. అంతకన్న సూక్ష్మమైనవస్తువు మనకు కానరాదు. ఆత్మలేక బ్రహ్మము అంతసూక్ష్మము కంటే ఇంకా సూక్ష్మముగా నుండుటచే అది మనకు కానరాదు. అట్టి సూక్ష్మాతి సూక్ష్మమై బ్రహ్మాండ భాండములందు ఆత్మనిండియున్నది. పంచభూతములు ఐదు, కాలములు, దిక్కులు, మనస్సు, ఆత్మ యను నాల్గు కూడి నవవిధ ద్రవ్యములుగా అనగా వస్తువులుగా జెప్పబడినవి. ఈ నవద్రవ్యములందు బ్రహ్మలేక ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మముగా వ్యాపించియున్నది ఇందుకు **"అణోరణీయాన్ మహతో మహీయా॥ నాత్మాస్య జంతోర్నిహితోగుహాయామ్॥ తమక్రతుః పశ్యతి వీతశోకో॥ ధాతుప్రసాదాన్మ హిమానమాత్మనః॥** కఠ-ద్వితీయవల్లి-20.

అనగా సూక్ష్మాతి సూక్ష్మమైన, అణువుకంటె చిన్నది. బ్రహ్మాండానికంటే గొప్పది అయిన ఆత్మ సర్వప్రాణుల హృదయాలలోనే యున్నది. కామనా రహితుడు శోకరహితుడై యింద్రియాల యొక్క మనస్సు యొక్క పవిత్రతద్వారా ఆత్మ మహిమ సాక్షాత్కరించు కొంటాడు. "ఈశ్వర సర్వభూతానాం" అనగా ఈశ్వరుడు అన్ని ప్రాణులందు అధివసించు చున్నాడు. "తోలుకడుపులోన దొడ్డవాడుండగ! రాతి గుళ్ళలోన రాసిబోయ! రాళ్ళు దేవుడైన రాసులు మింగవా! విశ్వ॥ శివుడంటే వాడేమి దూరంలేడు మనలోవున్నాడు మనకు గానరాడు॥ అని బహుచక్కగా గానంచేసి యున్నాడు ఒక కవి. ఈశ్వరఃసర్వ భూతానాం హృద్దేశే ఽ ర్జునతిష్ఠతి ॥గీత॥ 18-61 అనగా ఈశ్వరుడు దూరముగా

యున్నాడని తలంచుటవెట్టి. అతడు జీవులకు అతి సమీపముగా హృదయమందు అధివసించుచున్నాడు. కనుక ఎల్లప్పుడు భగవద్సాన్నిధ్యమును అనుభవించుము.

ఇట్లు నిగూఢంగాయున్న ఆత్మను తత్త్వవేత్తలు తమతమ సునిశితమగు ఏకాగ్రబుద్ధిచే చూచుచున్నారు. ఇట్టి నిరాకార వస్తువును చర్మ చక్షువులచే గోచరించుననుట పొరబాటే అగును. అట్లు దృశ్యరూపముగా కనవచ్చేదేదో అది భ్రాంతిరూపమని చెప్పక తప్పదు. నేత్రము రూపమున్న దానినే గుర్తించును. పంచవిషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు లేని పరమాత్మయేయింద్రియములతో గుర్తించబడును? ఆయావిషయములను గుర్తించు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములచే గుర్తించలేడు గాని 'మనస్సష్ఠానీంద్రియాణి' అని చెప్పబడిన మనస్సుచే గుర్తించ తగినదైయున్నది. కనుకనే "మనసైవాఽనుద్రష్టవ్యం" అని "ఆత్మవారేఽద్రష్టవ్యం" అని శ్రుతులు గూడజెప్పుచున్నవి. మనస్సుచే గుర్తింపరాని దొక్కపరిపూర్ణ పరబ్రహ్మమే అని తెలియవలెను.

**7(బి) సుఖమాత్యంతికం యత్తత్బుద్ధి గ్రాహ్యమతీంద్రియం**
**వేత్తి యత్రనచైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥** **భ॥గీ6-21**

తా॥ అతీంద్రియ మగుబుద్ధిచే యీ బ్రహ్మము గ్రహింపదగి యున్నది. అనగా బుద్ధీంద్రియమునకు నిశ్చయానిశ్చయములు ఆదిభౌతిక వ్యాపారమైయున్నది. ఈ వ్యాపారము వదిలినచో ఆ బుద్ధియే అతీంద్రియమనబడి యీ బ్రహ్మమును గ్రహింప సమర్థవంత మగుచున్నది.

మనస్సుగూడ ఇంద్రియ రూపముగావుండి ఆత్మను దర్శింపజాలదు. అది అతీంద్రియ స్థితిలోనే గుర్తించవలసి వుంటుంది. అంటే తన కాధిభౌతికముగా నున్న సంకల్ప వికల్పములను వదలి తాను నిరీంద్రియమై ఆత్మస్వరూప స్థితి తాను పొందుట రీత్యా దానిని తెలియవలసియున్నది. " బుద్ధిగ్రాహ్యం మతీంద్రియం" నిశితమై సూక్ష్మబుద్ధిచే లేక అతీంద్రియమైన బుద్ధిచే దానిని గ్రహించవలసి యుండును.

మనస్సు పరిణామము బుద్ధి కనుక " మనసైవాఽను ద్రష్ట్యఽవ్యం" అని చెప్పబడినది.

"ఆత్మవాఽరే ద్రష్టవ్య మంతవ్యోనిధి ధ్యాసి తవ్యః,, అనగా ఆత్మచూడదగినది, వినదగినది, మనస్సుచే మననము చేయదగినది అని "మనసైవానుద్రష్టవ్యం మనసైవాను శ్రోతవ్యోం" అని శ్రుతులు ఉద్బోధించుచున్నవి. ఆత్మమనస్సు చేతనే చూడదగినది, మనస్సు చేతనే వినదగినది అని శ్రుత్యార్థము.

ఇంద్రియముల ద్వారా పనిచేయునపుడు మనస్సుకూడ ఒక ఇంద్రియ రూపమే అగుచున్నది. అట్లు ఇంద్రియముల ద్వారా విషయపంచకము గుర్తించక ఆత్మాను సంధానమునకు ఉపక్రమించెనేని అది నిరీంద్రియ మనస్సు లేక అతీంద్రీయ మనస్సు లేక స్వోశీయమనస్సు అని పిలువ బడుచున్నది. అట్టి మనస్సు లయించు చుండగా (నశించుచుండగా) మనస్సు బ్రహ్మాకారమును పొందును. బ్రహ్మాకారము అనగా

ధ్యానమున నిరాకారమును జూచుట, ఎందుకనగా బ్రహ్మము సదసద్రూపముగానున్నది. సత్పదార్థము అసత్పదార్థము నుంచి వచ్చినది. అంటే అసద్పదార్థ స్వరూపమే బ్రహ్మ తొలి రూపము (నీతొలిరూపము) అఖండ జ్ఞానరూపము. ఇట్లు కేవలం ధ్యానములో నున్నవారికి కలుగు అనుభూతి మాత్రమే. ఇతరములకు యిది గోచరముగాదు. ఈ ఆకారమే నీ తొలిరూపము, ఆత్మాకారము, అపుడు చూచు మనస్సుచూడబడే ఆత్మతానై ద్విపుటి లేక ఏకమై అభేదముగా నుండును. ఇదే అద్వైతసిద్ధి, అప్పుడు మనస్సే ఆత్మయై నిలుచును. ఈ విధంగా తత్వవేత్తలు తమయొక్క సునిశితమైన బుద్ధిచేత ఆత్మసాక్షాత్కారము జేసి కొందురని యిందలి యర్థం.

**(సి) "సో ఽ న్వేష్టవ్యః స్సజిజ్ఞాసితవ్యః మరియు విదితే వేద్యంనాస్తి"**

తా॥ ఈ బ్రహ్మము వెదుకదగినది అనగా వెదికినచో దొరకగలదు. మరియు యీ బ్రహ్మము జిజ్ఞాసచేయదగినది. ఇది తెలిస్తే ఆపైన తెలియబడేది లేదు.

ఈ బ్రహ్మము జిజ్ఞాస చేయదగినది "అథాతో బ్రహ్మజిజ్ఞాస" అని బ్రహ్మ సూత్రరచన ప్రారంభించిన వ్యాసుల వారు వెంటనే" జన్మాద్యస్యయతః" అని సూత్రీకరించి యున్నారు. అనగా సృష్ట్యాదులకు కారణమగు బ్రహ్మమే జిజ్ఞాస గావింపబడుచున్నది అని వ్యాసులవారు స్పష్టంగా జెప్పినట్లే. అంటే పరిపూర్ణపరబయలు జిజ్ఞాసచేయదగినదిగాదు. ఎరుక బ్రహ్మమే జిజ్ఞాసితవ్యమని మనకు బోధపడుచున్నది.

శ్రవణ మననాదులకు జిక్కునది, ధ్యానింపదగినది, ఉపాసింపదగినది శబ్దబ్రహ్మమునకు సంబంధించినదే. అది కేవల పరిపూర్ణపరబ్రహ్మము కాదు. అయినప్పటికి **"శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి"** అని చెప్పబడినది. అనగా శబ్ద బ్రహ్మము తెలిసినగాని అశబ్ద బ్రహ్మమునకు పరమైన పరిపూర్ణ పరబ్రహ్మము తెలుకొనుటకు అధికారి కాజాలడని పరిపూర్ణ భావజ్ఞులు చెప్పుదురు. కావున జిజ్ఞాస చేయవలసినది ఎరుక బ్రహ్మమని ఎరుగవలెను.

ఇవి తెలిస్తే ఆపైన తెలియబడేదిలేదు. అద్వైత సిద్ధాంతమున "జీవోబ్రహ్మైవనాపరః" బ్రహ్మమేకాని వేరుకాదు. మహావాక్యములను దీనిని గట్టిగా ప్రతిపాదించుచున్నవి. అందు "తత్వమసి బ్రహ్మ" వాక్యము వాచ్యార్థముచే జీవేశ్వరైక్యమును, లక్ష్యార్థముచే ప్రత్యగ్బ్రహ్మైక్యమును సాధించుచున్నది. తనకు తెలిసిన తెలియకున్ననూ అంతా బ్రహ్మస్వరూపమే అయినపుడు ఐక్యము కొత్తగా గావించవలసినపని లేదు. అంతా బ్రహ్మస్వరూపమే నంటు **"బ్రహ్మణోన్యం నకించన" "సర్వంఖల్విదంబ్రహ్మ"** అని శ్రుతులు ఘోషించుచున్నవి.

**శ్లో ॥ యద్ జ్ఞాత్వా న పునర్మోహ । మేమం యాస్యసిపాణ్డవ ।**
**యేన భూతాన్య శేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథోమయి – భ.గీ॥ 4-35.**

తా॥ దేనిని తెలిసనచో తిరగి మోహము కలుగదో, దేనిని తెలియుటచే నీయందు నాయందు గూడ సకల భూతములను చూడగలవో అదియే జ్ఞానము.

**7(డి) ఆత్మవా ఽ రే ద్రష్టవ్య శ్రోతవ్యో! మంతవ్యోనిధిధ్యాసి తవ్యః॥బృహ॥**

తా॥ ఆత్మయే చూడదగినది, వినదగినది, మననము చేయదగినది. ధ్యానముచే పొందదగినది. అనగా మనస్సుచే తెలియదగినదిగా నున్నది.

**7(ఇ) మనసైవాఽను ద్రష్టవ్యం! మనసైవాఽను శ్రోతవ్యం॥**

తా॥ మనస్సు చేత ఈ బ్రహ్మమును చూడదిగనది వినదగినది.

పై రెండింటికి వివరములు

**శ్లో॥ యద్యద్పశ్యతి చక్షుభ్యాం తద్దాత్మేతి భావయత్!**
**యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయత్॥ యోగతత్త్వోపనిషతు॥**

తా॥ పంచతన్మాత్రలైన శబ్దస్పర్శరూప రసగంధాత్మికమగు సర్వము ఆత్మయే. ఏలననగా పంచభూతములు, పంచతన్మాత్ర రూపమగు చూచేది, వినేది ఆత్మయే పంచీకృతమై విశ్వరూపముగా పరిణమించినది గనుగ **"సర్వం యదయమాత్మా"** అంతయు ఆత్మస్వరూపమే.

అంతేగాక **"సర్వభూతస్థ మాత్మానాం సర్వభూతాని చాత్మనీ"** సర్వభూతములందు (ప్రాణులందు) గల ఆత్మను తనలోగల ఆత్మగా చూడుము. అనగా తనయందు సర్వభూతములను, సర్వభూతములందు తనను దర్శించుము. సాక్షాత్తు అంతా పరబ్రహ్మస్వరూపమని భావించి విశ్వసించి అఖండ స్వరూపుడవై నిలువుము. ఇదే అద్వైత సిద్ధి, ఆత్మసాక్షాత్కారము, నీతొలి స్వరూపము. ఈ విధముగా సమస్త వస్తువుల యొక్క నామరూపములను తొలగించి శ్లో॥ **అస్తిభాతి ప్రియం రూపం! నామ చ్యేదంశ పంచకం ఆద్యత్రయంబ్రహ్మ రూపం జగద్రూపం తతోద్వయం॥** అంటే నామ రూపములను తొలగించి అస్తి భాతి ప్రియం స్వరూపముగా నున్నట్టి చైతన్యమే నేను. నాలోగల చైతన్యము వాటిలోగల చైతన్యము కంటే భిన్నముగాదని గురువు ప్రసాదించిన జ్ఞానాన్ని జ్ఞాన చక్షువుచే చూచినపుడు ఆత్మను అన్నిటిలో అవలోకము చేయవచ్చును. ఈ విధంగా స్థూలాకారములతో సూక్ష్మంగావున్న ఆత్మను చూచేవారు సూక్ష్మదర్శనులనబడుదురు.

ఆత్మసూక్ష్మాతి సూక్ష్మమని ఉపనిషత్తులన్ని ఘోషించుచున్నవి. మరి మనస్సు స్థూల స్వస్వరూపముగదా! స్థూలముతో సూక్ష్మమును చూడజాలము. కనుక స్థూలముగా నున్న మనస్సును సూక్ష్మంగా జేయవలెను. రెండువస్తువులందు సమాన లక్షణములున్నప్పుడే (సూక్ష్మంగాజేసినపుడే) అదిగోచరము. కావున సూక్ష్మాతి సూక్ష్మముగా నున్న ఆత్మను చూచుటకు మనస్సును సూక్ష్మంగా, నిరీంద్రియముగా తన వశముగావించు కొని తన్మయముపొందినపుడు బుద్ధి సూక్ష్మమై సూక్ష్మంగావున్న ఆత్మను దర్శించును. బుద్ధి ఎట్లెట్లు తన్మయము పొందుతువుంటే అట్లట్లు బుద్ధి బ్రహ్మాకారమును పొందుతువుంటుంది. అట్టి బ్రహ్మాకారవృత్తియే ఆత్మ. ఈ విధంగా ఆత్మను మనస్సు చేత చూడవచ్చును.

**7(యఫ్) ఏతద్జ్ఞేయం నిత్యమేవాత్మ సంస్థం! నాతః పరం వేదితవ్యం హికించిత్! భోక్తా భోగ్యం ప్రేరి తారంచ మత్వా! సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమే తత్॥ శ్వేతా॥ 1-12.**

ఈ బ్రహ్మము తనయందే యుండి నిత్యమైనదై యున్నదని తెలిసికొనవలయును. ఇంతకంటే తెలుసుకొనదగినది కొంచమైనలేదు. భోక్తయగు జీవుడు, భోగ్యమగు ప్రపంచము, ప్రేరకుడగు అంతర్యామి అని త్రివిధముగా చెప్పబడిన దంతయు బ్రహ్మమే అనగా తెలుసుకొనదగినది బ్రహ్మమే (అంటే పరిపూర్ణ పరబ్రహ్మము దీని కన్యమై తెలియ రానిదై యున్నదని గ్రహించవలెను)

ఈ బ్రహ్మము తనయందే యుండి నిత్యమై యున్నదని తెలిసికొనవలయును. శంకరపూజ్య పాదులు తమ నిర్వాణ షట్కములో ఈ విధంగా గానం చేసియున్నారు.

**శ్లో॥ మనోబుద్ధ్యహంకార చిత్తాది నాహం, నచ శ్రోత్రజిహ్వేనచ ఘ్రాణనేత్రే నచ వ్యోమ భూమిర్నతే జోనవాయుః చిదానందరూపఃశివోహం శివోఽహం శివోఽహం ॥**

తా॥ మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడి అంతఃకరణమును నేనుకాను చెవి, నాలుక, ముక్కు నేత్రము లనెడి ఇంద్రియములును నేను గాను ఆకాశము భూమి, అగ్నివాయువు లనెడి పంచభూతములును నేను కాను, జ్ఞానానంద స్వరూపుడనైన శివుడను, నేను శివుడను.

**ఇతి తత్వమసి ప్రభతి శ్రుతి భిః ప్రతి పాదిత మాత్మని తత్త్వమసి తముపాది వివర్జిత సర్వసమం కింరోదసి మానసి సర్వం సమం.**

తా॥ అదియే (బ్రహ్మమే) నీవు అని శ్రుతి ప్రతిపాదిస్తున్నది. అది నీలో నీవై యుంటివి. నీవు సమస్తమైన ఉపాధులచే విడువబడినవాడవు. అంతాసమమై యుండ విచారించుట ఎందులకు. తత్త్వమసి వాక్యమునందు తత్, త్వం, అసి, మూడు పదములున్నవి. తత్ అనగా బ్రహ్మం, త్వం అనగా నీవు, అసి ద్వారా రెండును ఒక్కటే అని తెలుపుట జరుగుచున్నది. ఈశ్వరుడు మాయోపాధిచే చరించుచున్నాడు. జీవుడు అవిద్యోపాధిచే చరించు చున్నాడు. ఉపాధులను వేరు చేసి చూచినచో ఇరువురు ఒకే చైతన్యమై యున్నారు. ఇది తత్త్వమసి వాక్యార్థము. కనుక ఉన్న సత్యము నేనైయుండుట జరుగుచున్నది. ఉపాధులైన స్థూల, సూక్ష్మ, కారణ శరీరములనుండి వేరుపడగా జీవుడు బ్రహ్మమే అగుచున్నాడు. అట్టి బ్రహ్మము ఏకమై యున్నది. అభేదమై అద్వయమై యున్నది. సర్వము సమమైయున్నప్పుడు శోకమెందులకు అని శ్రీదత్తాత్రేయులవారు ప్రశ్నించుచున్నారు.

భోక్త - అనుభవించు జీవుడు, భోగ్యము- అనుభవింపదగిన ద్వైన ప్రపంచము, పేరకుడు - పురి గొల్పువాడు అంతర్యామి త్రివిధములని చెప్పబడిన దంతయు బ్రహ్మమే.

"జీవో బ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మమే, మరేది కాదని శ్రుతి సృష్టికి పూర్వము బ్రహ్మ మొక్కటే. రెండవది లేకుండెను."తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి" తానొక్కడే అనేకం కావాలనుకొని" ఏకం అనేకం భవతి" అనేకమును సృష్టించెను. ఆ అనేకము

జడముగుటచే "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" వాటియందు తానే అను ప్రవేశము గావించెను. అన్నిటి యందు బ్రహ్మము - నేను పరా, పశ్యతి, మధ్య, వైఖరీ రూపమున అనగా జీవుని రూపముగా నున్నాను. కనుక జీవుడు బ్రహ్మమే. నేను బ్రహ్మనే. "అహం బ్రహ్మాస్మి" అని శ్రుతి.

ఈ సృష్టి గావించిన దంత శ్రుతి లీలాదేతుకైవల్యం తన లీలావినోదముల కొరకే అని భావము. కనుక సృష్టినంత తానే సృష్టించి, తానే అనుభవించుటకై ఒక లీలగా తానే అనందించుట కొరకు సృష్టి చేసెను. కనుక సృష్టిని అనుభవించు వాడు బ్రహ్మమే - నేనే

ప్రేరకుడు కూడా బ్రహ్మమే - నేనే. నేనే అనుభవించుట కొరకు నా అంతః కరణమున చేతన రూపమున వశించి, నన్ను పురికొల్పుచున్నవాడు కూడ నేనేబ్రహ్మమే. అంతా బ్రహ్మమే బ్రహ్మము కానిదేది లేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ. అనీ నేహనా నాస్తి కించన అని శ్రుతులు ఘోషించుచున్నవి. ఈ బ్రహ్మము కంటే అన్యమై తెలియరానిదై యున్నది పరిపూర్ణ పరబ్రహ్మమే. అంతా నేనే. నేన అంతా. అన్యమెక్కడ.

# 7. పరిపూర్ణ పరబ్రహ్మము

> **ఎ) నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి నోమనః**
> **నవిద్మో నవిజానీమో యథైత దను శిష్యా దన్య**
> **దేవ తద్విది తాదథో అవిది తాదధి ఇతి శుశ్రుమ**
> **పూర్వేషాం యేనస్త ద్వ్యాచ చక్షిరే ॥ కేనోపనిషత్తు॥**

తా॥ వాక్కుకు అందదు, మనస్సుకు అందదు చక్షువునకు అందదు, జ్ఞానమునకు కూడ తెలియ రానిది ఏదో అది తెలియని దాని కంటెను తెలియరాని దానికంటెను వేరుగానున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యులకుపదేశించిరి.

7 ఎ) ఈ మంత్రము పరిపూర్ణ పరబ్రహమము యొక్క సహజ స్థితి బహు చక్కగా వర్ణించబడినది. అక్కడికి కన్ను పోజాలదు. అంటే పరిపూర్ణ పరబాహ్యాము కంటికి కనరాదు వాక్కుకు అందదు అంటే మాటలచే పలుకుటకు వీలులేదు. మనస్సుకు కనరాదు. మనస్సుకు అందదు అంటే అది తలంపులకు అందదు. శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు ఈ భావమునే చక్కగా కందార్థ దర్పనందు వెల్లడించినారు **కం.ద. 34। పలుకున బలుకగరాకను తలపోయుద మనిన మదికి దగులక యెపుడున్! ములుగృచ్ఛ సంధిలేకను। కలిగున్నది బట్ట బయలు గదరా మాయన్నా। యిదిగో చూడు కదులాదోయన్నా। పలుకన్నబలుకాక! తలపన్నదెరుగాక! చలి యెండ వానాల నలయాక నిలుచుండు।.....**"

పరిపూర్ణ పరబయలుకు రూపము లేదు. కావున రూపములేనిది గనుక దానిని మాటలచే వర్ణించుటకురాదు.

స్థావర జంగమ జీవోపాధులయందు యే ఉపాధికి ఆ ఉపాధే పూర్ణముగా నున్నది. వీటి ఉపాధికి కారణమైన వస్తువు ఎరుక బ్రహ్మము గనుక పరిపూర్ణమును

వాక్యమునందు దాని కార్యరూపమైన స్థావర జంగముల నిర్ణయము తెలియునుగాని పరబాహ్య నిర్ణయము తెలియదు. కనుక పరబాహ్యమును బయలని, పరిపూర్ణమని వాక్యములచే వర్ణించుటకు వీలుకాదని నిర్ణయము.

పరబాహ్యము నందు మనస్సు తోచుచున్నదిగాని మనస్సునందు పరబాహ్యములేదు. ఎట్లనగా సముద్రము నందు చేప తెలియుచున్నది గాని చేపలోపల సముద్రము లేదు. కనుక చేపకు సముద్రమును మననము చేయుటకు యెట్లు సాధ్యపడదో అట్లే పరబాహ్యమును మననము చేయుటకు మస్సుకు సాధ్యపడదు. మరియు దానిని పొందుటకు సాధ్యముకాదు.

ఆకాశగుణమగు శబ్దము ఉపాధి ననుసరించి పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీగా ఎరుక పరిణామము చెందుచున్నది. పరబయలుకు ఆకాశగుణ శబ్దము పరిణామము జెందు యెరుక లక్షణములు లేవు కనుక పలుకన్న పలుకదని నిర్ణయము.

పరబయలుకు జగత్తును పుట్టించాలి అను కోరికలు లేవు. చలి,యెండ,వాన యను స్వరూపముగల కాలత్రయముల నిర్ణయానుసారముగా కురియక హెచ్చుతగ్గులుగా కురిసినందున సస్యములు పండక జంగమ జీవులు ఆయాసపడును. జల ప్రళయములు భూకంపాదులవల్ల బ్రహ్మాండమునకు అలసటగలదు. ఈ పద్ధతి పరబాహ్యమునకు లేదు. గనుక చలి, ఎండ, వానలకు పరబయలు ఆయాసము పొందక నిలుచుండునని సాంప్రదాయక నిర్ణయము.

పరిపూర్ణమందు పంచతన్మాత్రలు లేవు గనుక అది తెలియరాదు. ప్రమాణములకు తెలియదగినది శబ్దాది విషయ సహితమైనదిగా యుండవలె. పరిపూర్ణము అటువంటిదిగాదు. కనుక అది తెలియరానిది.

పరిపూర్ణమును తెలిసికొనుటకు అందు తెలిసుకొనే తెలివి (ఎరుక) లేదు. కనుక శ్రీకృష్ణదేశికేంద్రులవారు ఎరుక లేక సేవింపదగును అని సెలవిచ్చియున్నారు. ఇందు గొప్ప రహస్యము కలదు. కనుక ఇట్టి గురుగోప్యమైన విషయము పరిపూర్ణ గురువుల ద్వారానే తెలియవచ్చును. "గురోర్ముఖేన జ్ఞాతవ్యం, నాన్యథా గ్రంథకోటిభిః" అనే న్యాయంగా శిష్యులు గురువుల ద్వారానే పరిపూర్ణమును పొందవలయును.

తెలుసును తెలియదు అను నిర్ణయములు ఎరుక నిర్ణయములు గావున అది తెలియరాని అచల పరిపూర్ణమును దర్శించి ఉత్తమ పురుషస్థితి యందున్న అరూఢుడు పరిపూర్ణమున్నదని గాని ఎరుక లేదనిగాని నిర్ణయము లేకుండ యుండును. కావున పరిపూర్ణ పరబ్రహ్మమును ఎరిగినవారు అది తెలియును ఇది తెలియదను నిర్ణయమున నుండును. అందుకే క.ప॥ 145 **"ఏ నిర్ణయమును చేయడు నేనని మహాత్ముడెప్పుడు॥ నేననువాడే నానావిధాల వదురును నేనను తనవంటి వారినెప్పుడు గనిన్"** అని పరిపూర్ణుని స్థితిని తెల్పి యున్నారు శ్రీకృష్ణదేశి కేంద్రులవారు.

ఈ మంత్రము నందు అది మాకు తెలియదు. దానిని ఎట్లు నేర్పించవలయునో ఆపద్ధతికూడ తెలియదని కేన ఋషి అంటున్నాడు.

పూర్వము ఋషులు తమ తమ పరిశోధనలలో తాము కనుగొన్న సత్యములను తెలియజెప్పి వాటికి కొన్ని హద్దు లేర్పరిచిరి. ఇట్లు ఒనర్చుటవల్ల వివిధ మతములు

ఏర్పడినవి. వారిలో వారు తమ తమ మతములే గొప్పవని పరస్పరము శాస్త్ర ప్రమాణములతో వాదించుటవల్ల దేనిని త్రోసిపుచ్చుటకు వీలులేకుండెను. చివరకు వారందరు నిర్వివాదము సత్యమును అనుగ్రహించుమని పరమశివుని కోరిరి. అందుకు శివుడు దక్షిణామూర్తి రూపంలో ఆవిర్భవించి పద్మాసనస్థుడై ఒక వటవృక్షము మూలన గూర్చుండెననియు, తాను కనుగొన్న సత్యమును మౌన వాఖ్యచే ఋషులందరికి సూచించుటవల్ల ఋషులందరు సంశయ రహితులై తృప్తి జెందిరని, దక్షిణామూర్తి చరిత్ర జెప్పుచున్నది. దక్షిణామూర్తి మౌన వాఖ్య ద్వారా సూచించినది పరిపూర్ణ పరబయలే, అప్పటి నుండి జ్ఞానమార్గీయులు దక్షిణామూర్తిని ఆది గురువుగా భావించి, నిత్యం గురుపరంపరా స్తోత్రము నందు పఠించుచున్నారు. అప్పటి నుండి నేటివరకు తమ గురువులద్వార తెలిసికొన్నట్లు తమశిష్యులకు తెల్పుతున్నారు. పరిపూర్ణగురువులు తమగురువుల ద్వారా పరిపూర్ణపరబాహ్యమును అపరోక్షమొనరించు కొన్నవారు గనుకనే తమశిష్యులకు తప్పక అపరోక్ష మొనర్పగలరు. ఇతరులకు యిది సాధ్యముగాదు. గురుగోప్యమైన విషయము కాబట్టి ఎలాగు నేర్పించవచ్చునో కూడ తెలియదంటున్నాడు. గురువు తమ పూర్వీకులద్వారా విన్నామని తర్వాత మంత్రముచే స్పష్టము చేయబడినది.

**7. బి) యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసా సహా॥ తైత్తిరీయ॥**

మనస్సు వాక్కుదేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది పరిపూర్ణ పరబ్రహ్మము.

(బి) ఈ మంత్రమునకు పై మంత్రము యొక్క వివరణయే సరిపోవును.

**(సి) నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో నచక్షుషా। అస్తీతి బ్రువతో ఽ న్యత్ర కథం తదుపలభ్యతే॥** కఠోపనిషత్తు వాక్కునకు మనస్సు చెవులకు ప్రాప్తించరానిది యను వరకు పై మంత్రములోని వివరణ సరిపోతుంది

**"ఆస్తీతి బ్రువతో ఽ న్యత్రకథం తదుపలభ్యతే॥** కనుక అది వున్నదనిచెప్పే వారి నుండే దాన్నిపొందాలి. "లభ్యతే" ఉన్నదని చెప్పుటకు వినా మరొక రీతిగా దాని ఉపలబ్ధికాజాలదు. కనుక అది వున్నదని చెప్పేవారినుండే దాన్ని పొందాలి.

క.ద.॥209. **"అపరోక్షమౌనె మనుజుల। కుపరోక్షంబైన బయలు గురుకృప లేకన్। అపరోక్షమౌను మనుజుల। కుపరోక్షం బైన బయలు గురుకృప గలుగా కిలిదెలేని। యెరుకతా తోలుగా" అని కృష్ణదేశికులు సెలవిచ్చియున్నారు. కనుక అది వున్నదని చెప్పేవారినుండే దాన్ని పొందాలి అని ఈ ఉపనిషద్ మంత్రార్థము.**

మంత్రరహిత నిర్ణయము నందు శ్రీకృష్ణదేశికేంద్రులవారు "229" **"ఇది తప్ప యేమిలేదని। మొదటిది మొరబెట్టుచుండు ముదమున వినుమా।** యని శిష్యునికి మంత్రరహిత నిర్ణయమును ప్రసాదించినాడు. అంటే ద్వాదశాక్షరిమంత్రము అచలపరిపూర్ణపరబయలు మాత్రమే యున్నది దాని కంటే వేరుగా నేమియులేదని ధ్వనిరూపకముగా మొర బెట్టుచున్నది. అంటే సాంప్రదాయక గురువుద్వారా ద్వాదశాక్షరి మంత్రమును బడిసిన వానికే దీనియందలి మర్మము తెలియును. ఇతరులకు ఈ

అసంపూర్ణంగా తెలియబడుతున్న వాక్యము ద్వారా అసలు అందుగల రహస్యము తెలియదు. కనుక ఉన్నదనిచెప్పిన దానిని గురువుయందు దృఢభక్తిచే, గురుడు పరబ్రహ్మస్వరూపడే యని నమ్మినపుడే అది యున్నదని తెల్పినపుడు దానివునికి శిష్యునికి ఉపలబ్ధి కాగలదు. ఇతరులకు ఇది ఏ మాత్రము అర్థముగాదు. మరియు బోధమనన విధానము నందుగూడ 230॥ క.ద. **ఉన్నది పరిపూర్ణము లేందెన్నటికి యెరుక యనుచు నిది దృఢమౌదా కెన్ను"** మని కృష్ణదేశికులవారు ప్రబోధించినారు. ఇచ్చట కూడ పరిపూర్ణ పరబయలును తాను తన గురువుద్వారా లబ్ధి పొందినవాడు గనుకనే తనశిష్యునికి చూపించి నమ్మింప జేయుచున్నాడు. కనుకనే శిష్యునికి అపరోక్షమైనది. మరియు 158, క.ద. "**ఇది వున్నది యిది వున్నది. యిది వున్నదనుచు బయలు నెరిగి ఎరుకచే యిది లేనిది యిదలేనిది॥ యిదిలేనిది యనుచు నెరుక నెరిగీతె సరిరా"** అని జెప్పి దాని ఉనికి దృఢ పరిచియున్నాడు. ముమ్మాటికి వున్నదని తెల్పియున్నాడు. మరియు 168. **క.ద. చూపించజూపరానిది॥ చూపించితి దాన్ని వుండ జూచితివి గదా!"** అని అనగా అచలపరిపూర్ణపరబయలు చూపించుటకు శక్యముగాకున్నను చూపించితి దాని వుండ జూచినావు గదా అని దృఢ పరిచినాడు. ఇందలి రహస్యము ఇతరులకు తెలియదు. వేదములందు, ఉపనిషత్తులందు నిర్ణయించిన పదవులకు హద్దులు నిర్ణయించి మతకర్తలు కర్మ, భక్తి, జ్ఞాన వైరాగ్య, తత్వము ముముక్షత్వ పద్ధతులు నిర్ణయించి మానవులను భ్రాంతి పద్ధతులందు ప్రవర్తింపజేయుచున్నందున జననమరణ రహితమునకు నిర్ణయించిన సిద్ధాంత పద్ధతివారికి తెలియదు. మనము చిన్నప్పటినుండి దేవుడు గుళ్ళో ఉంటాడు. అని నమ్ముతాము. అందుకే గుడికెళ్ళి దండము పెట్టు కుంటాము. దండం పెట్టే సమయమున రెండుచేతులు జోడించినపుడు కళ్ళుమూతపడుతాయి మనమప్పుడు నిరాకారమునే జూతుము. కళ్ళుతెరువగానే మళ్ళీ సాకారమునుజూతుము. ఈ విధంగా దేవుడు గుళ్ళోవున్నాడని కనిపించకున్నను నమ్ముతున్నాము. అట్లే గురుడు ద్వాదశి మంత్రము ద్వారా పరిపూర్ణము తప్ప తక్కిన దంత లేదని అది అంతట నిండి నిబిడీ కృతమైనదని జెప్పి చూపించునప్పుడు గురునినమ్మి, గురువు మాటపై గురియుండుటవల్ల అది అంతట వున్నదనే నమ్మకము కుదురును. అపుడింకా ఈ ఎరుక రూపమంతా లేనిదే యగును. ఇదేవుండ జూచుకొనుట.

దక్షిణామూర్తి కాలమునుండి నేటి వరకు ఈ బోధగురుపరంగా శిష్యులకు ప్రబోధించుట మనము చూస్తూనేవున్నాము. "సాక్షాత్పరత ధర్మాణః" ధర్మమును సాక్షాత్కరించు కొన్నవాడు గనుకనే తమ శిష్యులకు దర్శింపజేయగలరు. ఈ బోధను తానొక పూర్ణగురువును ఆశ్రయించి ధర్మోపదేశము పొంది, సాంప్రదాయక సిద్ధాంతమును అవగాహన చేసుకొన్నవాడై "స్వయం "తీర్ణః పరాం తారయతి" అనే న్యాయంగా తాను సర్వభ్రాంతి రహితము జేసుకొన్నపిదప తన గురువువలన బోధాధికారము పొంది తదాజ్ఞానుసారము శిష్యసేకరణ గావించి ప్రబోధప్రచారములు గావించు వాడై యుండవలెను. పరపూర్ణగురువులకే ఇందలి మర్మధర్మములు తెలియును. గావున వారే తమ శిష్యులకు పరబయలు ఉనికిని ఉపలబ్ధి చేయగలరు. కనుక జన్మరాహిత్యముగోరువారు, పరిపూర్ణ గురువులను బడయగలరని సవినయముగా ప్రార్థించుచున్నాను.

**7.డి) సఏష నేతి నేత్యాత్మా -గృహ్యోనహిగృహ్యతే - శీర్యో నహిశిర్యతే = సంగోనహి, సజ్జ్యతేః = సితోనవ్యధతే, నరిష్యతి ॥బృహ అ5. బ్రా 9**

7 (డి) ఆకేవలాత్మ గ్రహింపదగినవాడు కాదు. గ్రహింపబడడు. నశింపదగినవాడు కాదు, నశింపడు, నిస్సంగుడు, శీతాదులు లేనివాడు సుఖదుఃఖాదులులేనివాడు అశరీరుడు క.ద. 33 **ఎరుకైన రీతి నుండును। యెరుగ నశక్యంబటంచు। యెన్నిన యెరుకన్। యెరుగుదు ననినను యెరుకకె। యెరుగుట దుర్లభము సుమ్మి। యీ వుత్తబయలూ యెరుగానె యెరుగరు దెరుక నీ బైలూ। పెరుగాదు విరుగాదు వొరుగాదు తరుగాదు। అరుగాదు కరుగాదు మొరుగాదు। యీ వుత్తబైలూ।"**

తా॥ అచలపరిపూర్ణ పరబయలు యెరుకైనట్టులను, యెరుగుటకు శక్యంగా నటులను యే ఎరుక తెలుసుకొంటున్నదో ఆ ఎరుకకే ఈ గుర్తులన్నీ. అదే విధముగా అచల పరిపూర్ణ పరబయలు నందు ఐక్యము పొందుతానని నిర్ణయించుకొన్నను పొంద నశక్యము, ఎందుకనగా అచల పరిపూర్ణ పరబ్రహ్మము యీ ఎరుకను యెరుగదు. ఆ పరిపూర్ణ పరబయలు పెరుగదు, విరుగదు, తరుగదు, కరుగదు, తిరుగదు, మొరుగదని భావము.

**ఎందుకు గ్రహింపరానిదని అనగా అందు పంచతన్మాత్రలు లేవు. కం.ద. 39 "లేదనకువున్నదదిగో। నేదెలిసితిననకు దీన్ని నీ వెరిగేవా, కాదది నీచే దెలియను। యేదిర తన్మాత్రసమితి యీబట్ట బయటా। దీనికి సాటిదేది యెచ్చోట".**

తా॥ ఈ పరబయలు లేదని చెప్పకుము. ఉన్నదదిగో చూడుము. దానిని యెరిగితినని చెప్పకుము. నీవు దానిని యెరుగుటకు సాధ్యంగాదు. ఎందుకనగా దానియందు పంచతన్మాత్ర స్వరూప స్వభావములు లేవు. దానికి సమమైనది యితర మేమియు లేదు. కనుక పరిపూర్ణ పరబయలు గ్రహింపదగినది కాదు. గ్రహింపబడదు.

పరిపూర్ణ పరబ్రహ్మము నశింపదు, నశింపదగినవాడుకాదు. పరిపూర్ణ సిద్ధాంతము నుద్ధరించిన శ్రీ శివరామ దీక్షితులవారు పరబయలును ఈ క్రింది విధముగా వివరించియున్నారు. **"పుట్టనిది చావనిది, రాకడ పోకడ లేనిది సకలదేశాలయందు సర్వ కాలాలయందు సమస్తవస్తువులందు మొదట కొనలేక చలించక వక్క తీరుగా తనకు తానే స్వత సిద్ధముగా నున్నది"** మరియు క.ప. 60 **"బయలెపుడు పుట్టిగిట్టదు బయలెప్పుడు ముట్టుకోదు। బ్రహ్మాండంబుల్ బయలెపుడు నన్నెరుంగదు । బయలెపుడు జేయబోదు పనులెవ్వైనన్॥** అని శ్రీ కృష్ణదేశికులు సెలవిచ్చి యున్నారు .

కనుక బయలు ఏకాలమందు పుట్టదు. నశించదు కనుక క.ప. 61 **"బయలనిన నిత్యవస్తువు బయలన నొక్కరీతినుండు బ్రహ్మాండములో "** అని స్పష్టంగా చెప్పినారు. బయలు నిత్యవస్తువు అంటే త్రికాలా బాధ్యమైనది. ఎట్టి మార్పునెరుగదు. కనుక నశింపదు, నశించేవాడు కాదు. ఎల్లప్పుడు ఎట్టి మార్పులు లేక ఏకరీతిగా నుందువాడు.

తాను పుట్టనిది, చావనిది కనుక పరిపూర్ణ పరబ్రహ్మము ఇతరమును పుట్టింపజాలదు, గిట్టింప జాలదు. విచారించిచూస్తే సృష్టిలో పుట్టుక వున్నప్పుడే జీవి తనవంటిమరొక జీవిని ఉత్పత్తి చేయడానికి సమర్థత కలిగిఉన్నది. ఉదాహరణ, వృక్ష

బీజములు, ఇవి పరస్పర కార్యకారణములుగా వుంటున్నాయి. పుట్టేటప్పుడు కార్యకారణ రూపంగా పుడుతున్నాయి. పోయేటప్పుడు కూడా కార్యము తన యందు యిముడ్చు కొని కారణం పోతూవున్నది.

**"నతోహి మాయ యా జన్మయుజ్యతేనతు తత్వతః**
**తత్త్వతో జాయతే యస్యజాతం తస్యహిజాయతే ॥ మాండూక్య కారికలు**

అనగా పుట్టని దానినుండి ఏదియు పుట్టజాలదు. పుట్టిన దాని నుండియే మరొకటి పుట్టును. దీనినే అన్వయ వ్యతిరేకముగా చెబితే పుట్టించుటకు కారణమైన దేదో అనగా సృష్టికి కారణమైన దేదో అది పరిపూర్ణ పరబ్రహ్మంకాదు. కనుక పరిపూర్ణపరబయలున కన్యముగాతోచ బడువానిలో దేనికిన్ని పరిపూర్ణ పరబ్రహ్మము మూలముకాదు. కాబట్టి అతడు పుట్టలేదు. గనుక గిట్టడు, నశింపడు, నాశనమొందు వాడుకాడు.

పరిపూర్ణ పరబ్రహ్మము నిస్సంగుడు. నిస్సంగము అనగా సంగమములేనిది, కూడనిది, పొసగనిది అని అర్థము. పరిపూర్ణ పరబ్రహ్మము దేనితో కూడుకొని యుండుటలేదు. అది ఏకమైయున్నది. శుద్ధమైనది. ఆకాశము సమస్త వస్తువుల బాహ్యాభ్యంతరములందు వ్యాపించి యున్నను వస్తువునుగాని, వస్తుధర్మమునుగాని అంటక వానిచే ఏ విధముగా వికారములు చెందక అసంగమైయున్నదో ఆవిధంగా పరిపూర్ణ పరబ్రహ్మము బాహ్యాంభ్యంతరములందు నిండి నిబిడీకృతమై యున్నప్పటికి వాటి నంటక వాటి ధర్మములు అంటక యున్నది. కావున నిస్సంగుడు.

పరిపూర్ణ పరబ్రహ్మము శీతాదులు లేనివాడు. అతడు చలిచేత చలించబడడు వణుకడు ఎండకు ఎండడు, వానకు తడువడు. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు 34 క.ద. పలుకన్నబలుకాక। తలపన్న దెరుగాక। చలియెండ వానాల నలయాక నిలుచుండు గదరా మాయన్నా" అని సెలవిచ్చియున్నాడు. జలప్రళయములు, బ్రహ్మప్రళయములు వచ్చినను బ్రహ్మాండమునకు అలసటగలదు. ఈ పద్ధతి పరబాహ్యమునకు లేదు. కనుక యెండ వానలకు పరబయలు ఆయాసపడక ఏక రీతిగా నుండును.

# 8. ఎరుక

**8(ఎ) సహస్ర శీర్షాపురుషః స్సహస్రాక్షః సహస్రపాత్ – శ్వేతాశ్వతరోప నిషత్తు 3-14**

తా॥(ఎ) ఆపరమాత్మ కనేక శిరస్సులు, అనేక కండ్లు మరియు అనేక పాదములున్నవి.

(ఎ) ఆ బ్రహ్మకు వేయి శిరస్సులు, వేయి కన్నులున్నాయంటే స్థూలముగా బ్రహ్మను దర్శించువారికి వున్నవనియే చెప్పనగును. స్థూలాకారముగల సమస్తవస్తువుల రూపములు నామములు వదిలితే అందలి చైతన్యమును, శక్తి, జ్ఞాన జీవ,ప్రాణ రూపములలో మనకగుపడును. సర్వమును వ్యాపించియున్నవాడు. గనుక అనేక ముఖములు, అనేకమైన కండ్లు గలవని చెప్పవచ్చును. ఎందుకనగా బ్రహ్మము సర్వంతర్యామి, సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము, వ్యాపకత, ఏకత, స్వతంత్రత, సమర్థత పరోక్షత మాయోపాధి అను ఎనిమిది లక్షణములు కూడి యున్నవాడు. ఇక్కడ లేక అక్కడ గలడా? అంతటగలడు, అంతటిని చూస్తున్నాడు. గనుక అంతట వ్యాపించియున్నాడు. అంతట అతడే. అంతట

అతని అవయవములే. అన్ని శిరస్సులే అన్ని కండ్లుగా వర్ణించబడినది. ఎక్కడ లేదు? కనుక ఆ బ్రహ్మము వేయి శిరస్సులు,వేయి కండ్లుగలవని ఈ ఉపనిషద్మంత్రము వర్ణించింది. ఈ భావము నిర్గుణ నిరాకారమును దర్శించలేనివారు సాకార, సగుణ దర్శనముకోరి "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణోరూప కల్పన" అని వేయిశిరస్సులు వేయి చేతులు వారు ధరించు, అయుధములు, కల్పించి పూజించుటగలదు. అంతటితో తృప్తి జెందక వారికి సంసారమును కల్పించి పిల్లలను కల్పించి వారిని కూడ పూజించుట మొదలుపెట్టిరి. వారికి వాహనములు రథములు కల్పించిరి. వారికి నిత్యకృత్యములలో మేలు కొలుపు, పంచామృతస్నానములు, శుద్ధోదక స్నానములు, ఆభరణములు, రత్నకచిత సింహాసనములు, ఇట్లనేకము కల్పించిరి. సేవలు చేసి మేము దేవునికి సేవలు జేసినాము, తరించినామని భ్రాంతిలో యున్నారు. ఇవన్ని లేని వారికి బ్రహ్మము నిరాకారముగా నున్నప్పుడు ఏకమే.

వేయి తలలు, వేయి కన్నులు, వేయి పాదములు మొదలగునవి యున్నవనుట స్థూలవర్ణన "యావదృశ్యే దృగాకారం" చూడబడేదంతా దృగాకారమైన బ్రహ్మమే అయినప్పుడు ఖండ ఖండములుగా కనపడే ప్రతివస్తువు ఆత్మయే, బ్రహ్మమే, ఖండ ఖండములు అన్నప్పుడు ఆ ఖండములు అనంతము. కాని ఈ శ్రుతి యందు వాటిని వేయికి పరిమితి జేసినట్లయినది. ఈ సంఖ్య చాలస్వల్పం. బ్రహ్మ అనగా పెద్దది అంతకన్నపెద్దది లేనప్పుడు వేయిసంఖ్యతో జెప్పుట బ్రహ్మమును చిన్నగాజేసి చెప్పినట్లయినది. కనుక అనంతమని, చుక్కలవలె లెక్కింపరానన్ని వున్నవని జెప్పిన సరిపోతుందేమో!

వేదోపనిషత్తుల కాలము నాటికి వేయి అనే సంఖ్య చాలా పెద్దదిగానే కనిపించును. పోతే ఆ బ్రహ్మకు వున్నవా? అంటే 84లక్షల జీవరాసుల అవయముల వెనుక యుండి వాటిని సమర్థవంతగా పనిచేయించుట గలవాడు గనుక వున్నవనిచెప్పవచ్చును. అందుకే ఈ విశ్వము నంతటిని ఇంత సౌష్ఠముగా పనిచేయించగలుగుతున్నాడు.

సంఖ్యారూపములో జెప్పిన కాళ్ళు, చేతులు, తలలు, కండ్లున్నవని మనమే చెప్పుచున్నాము. మనము నమ్మితే వున్నవి లేకుంటే లేదు.

| బి) | **సర్వతఃపాణి పాదం త త్సర్వతోఽ క్షిశిరో ముఖం**<br>**సర్వతః శ్రుతి మల్లోకే సర్వమావృత్య తిష్ఠతి భ.గీ. 13-14.** |
|---|---|

తా॥ అంతటను కాళ్ళు చేతులు గలదానిగాను, అంతట కన్నులు, తలలు ముఖములు గలదియు, అంతటను చెవులు గలదియు నయి ప్రపంచమునందు సమస్తమును ఆవరించి యున్నది. (వ్యాపించి యున్నది.)

ఆ బ్రహ్మమునకు సర్వత్రనేత్రములు, చెవులు, ముఖము లుండుటవల్ల జీవులు చేయు పుణ్యపాప కర్మలన్నింటిని అతడు సదా గమనిస్తూనే యున్నాడని స్పష్టమగుచున్నది. ఈ సత్యమును తెలుసుకొనిన్నచో నిక పాపకృత్యములను ఎవరు చేయుటకు ప్రయత్నించరు. మనస్సునకందు ఆ పరమాత్మ వ్యాపించి యుండుటవల్ల జీవుడు చేయు

ప్రతిసంకల్పమును అతని దృష్టియందు పడుచుచునే యుండును. ఇక్కారణమున ఏ కార్యమైనను, ఏ సంకల్పమైనను అది ఎంత రహస్యమైనది అయినను అంతఃరంగమున వసించు భగవంతునికి తెలియకపోదు. కాబట్టి జీవులు తమ ఆచరణ విషయమై బహు జాగురూకులై పాపకార్యములు, పాప సంకల్పములను విడనాడి సన్మార్గములననుసరించ వలయును.

అంతఃరంగమున అపరాధములు జేసి। మంచివానివలె మనుజుడుండు
తానెరుగకున్న ఈశ్వరుడెరుగడా। విశ్వదాభిరామ వినురవేమ.

పరమాత్మ సర్వత్రా వ్యాపించియున్నాడనుటకు ఇచ్చట "సర్వమావృత్య తిష్ఠతి" అని చెప్పబడింది. సమస్తకృత్యములను ఆవరించి యున్నదని చెప్పుట వలన ఆత్మదృశ్యము కంటే పరమైయున్నదని తెలుచున్నది. ఆవరించువస్తువు, ఆవరింప బడువస్తువు కంటే అతీతమై యుండువలెను గదా! దృగ్వస్తువగు ఆత్మ బ్రహ్మము దృశ్యము నంతను ఆవరించి తన యందంచుకొన్నది. తన గుప్పిటి యందు పెట్టుకొన్నది. కాబట్టి అల్పమైన దృశ్యమును నాశ్రయించక మహత్తరమగు దృశ్యవస్తువగు పరమాత్మనే ఆశ్రయించవలయును.

8(సి) **సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।**
**సర్వస్య ప్రభు మీశానాం సర్వస్యంశరణ సుహృత్॥ శ్వేతా శ్వతర 3-17**

ఏ ఇంద్రియములు లేకపోయిన అన్ని కర్మేంద్రియములతో విరాజిల్లు తున్నాడని, సమస్తానికి ప్రభువని, నియామకుడని, సర్వశరణ్యుడని అన్నింటికి స్నేహితుడని ఆయనను సాక్షాత్కరించు కొంటారు.

ఇక ఈశ్లోకార్థమును పరిపూర్ణ బోధ క్రమమున పరిశీలిద్దాము.

**50. క.ద॥ అన్నియు తానై । తనకవి। పన్నుగవేరనుచునోట బలుకుచు। మరితానన్నిటి యెరిగే యెరుకై। యున్నానని యెరుక నెరుక । నూహింపు చుండూ। తనలోతాను మెహింపుచుండూ। యెన్నో విచిత్రా లీయెరుక సేతలువింటే । వున్నాది లేదు। లేకున్నాదిగలదని వూహింపుచుండూ తనలోతాను మోహింపుచుండూ ।** తా॥ ఓ శిష్యుడా పిపీలికాది బ్రహ్మ పర్యంతసర్వము తానే యై తనకవి లేవనుచు చెప్పుచు మరియు సర్వమును తెలుసుకొనెడి యెరుకైవున్నానని, యెరుకే యెరుకను ఊహింపుచుండును. మరల తనలోతాను తనయందుంగల జీవేశ్వర జగత్తుల వ్యవహారము తెలియజేయుదునుగాని చేయునది నేను గానని నిర్ణయించు కొని తనలోతాను ఆనందించును. ఓ పుత్రుడా! ఈ ఎరుకచేష్టలు విచారిస్తే వున్నది లేదని, లేనిది వున్నదని తనలో తాను తలంచు చుండును. భ్రమ చెందుచుండును.

కారణమగు బీజము దానికి కార్యరూపమగు వృక్షాకారము వేరు వేరుగా యున్నందున ఇది బీజము, యిది వృక్షమని ఎట్లు నిర్మింపబడునో అట్లు కారణ రూపమైన ఎరుక యొక్క ఆకారము కార్యరూప జీవేశ్వర జగత్తుయొక్క ఆకారము వేరువేరుగా యున్నందున కారణరూపమైన ఎరుక, కార్యరూపమైన జీవేశ్వర జగత్తులను వేరు జేసి తాను వేరని, తనకు అవి వేరని నుడువుచుండును.

ఊసరవెల్లి యనుతొండ నిలకడలేకుండ తనరంగులను ఎట్లు మార్చుచుండునో అట్లే జీవేశ్వర జగదోపాధిని స్థావర జంగమ రూపమున మార్పుచేయు చుండును. కావున ఎరుక వ్యవహారము విచిత్రముగా యుండును.

పంచతన్మాత్ర ప్రపంచము నెరుగునటువంటిది ఎరుక గనుక అన్నిటి యందు నేను ఉండి తెలుసుకుంటువున్నానని వూహించి లేనితాను ఉన్నట్లు నిర్ణయించును. పంచతన్మాత్రలు లేనిది పరబయలు గనుక దానిని నిర్ణయించ లేక అది లేదని చెప్పును.

52 క.ద॥ **"ఆటాడి ఆడకుండును..............అచలమకర్తా"** ఎరుక పురుషుడు ఆటాడును. ఆడకుండ యుండును. మరియు శరీరము చేత ఆడకుండ తనలో తానే ఆడుచుండును. గనుక ఆటాడించేవాడు ఎరుకనే పురుషుడేయని నిర్ణయము. స్వర్గ నరకాల ఫల ప్రాప్తికొరకు యొనర్చు కర్మజ్ఞానఫలంబులు అనుభవించి జనన మరణములు బొందుటకు యెరుక పురుషుడే కర్త, భోక్త గాని అచల పరిపూర్ణపరబాహ్యము కర్తగాదు భోక్తకాదని నిర్ణయము.

ఈ ఎరుక పురుషుడే అన్నితానే అయినాడు. తాననేకమును చూస్తున్నాడు. తానే చెవిగా అయి వింటున్నాడు. తానే నాలుక అయి రుచి చూస్తున్నాడు. తానే చర్మమై స్పర్శానందములో మునిగి తేలు తున్నాడు. అనగా విషయేంద్రియముల వెనుక (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల) ఉండి అన్నిటిని తానే అనుభవిస్తు తానే కర్త అయి ఆకర్తనంటున్నాడు. అన్నిటికి కర్తగా నున్న ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మము గాదు. ఈ విషయమును కేనోనిషత్తు లోని రెండవ మంత్రము ధృవ పరుచుచున్నది. పరిశీలిద్దాము.

మంత్రం ॥ **శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్। వా చో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః॥**

**చక్షుషశ్చ క్షురతి ముచ్యధీరాః । ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి"॥** – కేన.

తా॥ ఆత్మ చెవులకు చెవులుగా, మనస్సుకు మనస్సుగా, వాక్కునకు వాక్కుగా ప్రాణానికి ప్రాణంగానుండి ఆత్మను నేరుగా జూచే ధీరులు ఇంద్రియబద్ధమైన జీవితాన్ని దాటి అమరత్వాన్ని పొందుతారు.

అదేవిధంగా బృహదారణ్యా కోపనిషత్ కూడ ఈ భావమును నొక్కిచెప్పింది.

మంత్రం॥ **ప్రాణస్య ప్రాణముత చక్షుషః శ్చక్షురుత శ్రోత్రస్యశ్రోత్రం।**

**మనసోయే మన విదుఃతేని చిక్యుర్బ్రహ్మ పురాణమగ్ర్యమ్ ॥ 4-4-18**

ఎవరు బ్రహ్మమును ప్రాణమునకు ప్రాణముగా, నేత్రమునకు, నేత్రముగా మనస్సుకు, మనస్సుగా వున్నదని ఎవరు తెలుసుకొంటున్నారో వారు బ్రహ్మమును శ్రేష్ఠవస్తువు అని, పూర్వమేయున్నదని ఎరుగుచున్నారు. మరియు వేమన భావములో.

కం॥ **నీవాడిన నేనాడుదు నీవుండిన నేను నుందు నిర్వీణ్ణుడనై। నీవుదలచిన దలపుదు। నీవునగిన నేను నగుదు నిజముగా వేమా ॥** అని వేమన ఎరుకస్థితిని బహుచక్కగా వర్ణించినారు. మూర్ఖుడు అంతా స్వశక్తితో చేస్తున్నానని అంటాడు. విమర్శ చేస్తే వెలుగులేకుండ మనకళ్ళతో దేనిని చూడలేము. ఆకాశం లేకుండ అవకాశములేదు. పరమాత్మలేకుండ చైతన్యములేదు. కనుక పరమాత్మ సత్తాచేతనే మనశరీరమునందు

ప్రత్యగాత్మపలికిస్తే పలుకుతున్నాము. అది నిశ్చలం గావుంటే మనము నిశ్చలంగా వుంటామని వేమన ఆత్మ తత్వమును వివరించుచున్నారు.

కావున ధీరుడైనవాడు ఇంద్రియ బద్ధ జీవితమును దాటి అఖండ ఎరుక స్వరూపమును పరిపూర్ణమును తెలుసుకొని అఖండ ఎరుక స్వరూపములేనిది, పరిపూర్ణపరబ్రహ్మమే శాశ్వతమైనదని దృఢముగా నమ్మి, కర్తృత్వ కర్మాచరణద్వారా జనన మరణ రాహిత్యము పొందుటే మానవుడై పుట్టినందులకు చేయవలసిన మొదటిపని.

# 8. పరిపూర్ణ పరబ్రహ్మము

## (ఎ) అచక్షుష్క, మశ్రోత్రమవాగ్గమనః

కండ్లు, చెవులు, వాక్కు, మనస్సు, లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము, సాంఖ్యపరంగా వీటిని పరిశీలింతము.

కన్ను జలతత్వమునకు సంబంధించినది. రూపమునకు స్థానమై యున్నది. కన్ను అధిష్టానదేవతయైన సూర్యుడు రూపము మిశ్రమమై రూపమును ఎరుగును. జలము యొక్క 1/8 భాగము అగ్ని భూతముతో చేరుటవల్ల రూపమాయెను. కనుక అగ్ని భూతము కన్ను, రూపమును ఎరుగుటకు ఒకసాధనము మాత్రమే, పరిపూర్ణ పరబ్రహ్మమందు పంచతన్మాలు లేవు. రూపములేనిదానిని కన్నులెట్లు చూడగలవు? అంటే చూడ జాలవు. కనుక కన్నులకు అది అందేది కాదని స్పష్టము.

శ్రోత్రము అనగా చెవి. చెవి శబ్దమును వినును లేదా ధ్వని నెరుగును. శబ్దము ఆకాశ తత్వమునకు చెందినది. విష్ణుప్రత్యగాత్మ ప్రకాశము చెవుల స్థానమందు చేరి శబ్ద తన్మాత్రతో కూడి శబ్దమాయెను. ఈ శబ్దమునకు అధిష్ఠాన దేవత సదాశివుడు ఈ సదా శివుడు శబ్దము కూడి ధ్వని నెరుగును. జలము యొక్క 1/8భాగమే ఆకాశములో చేరుటవల్ల శబ్దమేర్పడెను. శబ్దమునకు స్థానము చెవులు, చెవులు ఆకాశాంశము.

పరిపూర్ణ పరబ్రహ్మమందు ఆకాశాంశమైన శబ్దములేదు. అంటేధ్వనిలేదు. ధ్వని తన్మాత్రలేనిదానిని చెవులు వినలేవు. అందుకే పరిపూర్ణ పరబయలు శబ్దమునకు అందునదికాదు. వాక్కుచేకూడ పరిపూర్ణ పరబ్రహ్మము తెలియరాదు.

వాక్కు పృథ్వీ అంశము. బ్రహ్మప్రత్యగాత్మ ప్రకాశము, నోరుస్థానమందు జేరి శబ్ద తన్మాత్రతో కూడి వాక్కును ఎరుగును. పృథ్వీ యొక్క 1/8వంతు భాగము ఆకాశముతో కూడుటవల్ల వాక్కాయెను. పరిపూర్ణ పరబ్రహ్మమందు వాక్కులేదు. కనుక అదివాక్కుకు అందదు.

మనస్సునకు కూడ అందదు. సదాశివ ప్రత్యగాత్మ ప్రకాశము కంఠస్థాన మందు జేరి, స్పర్శ తన్మాత్రతోజేరి మనస్సాయెను. మనస్సుకు చంద్రుడు అధిష్టానదేవత. ఈ చంద్రుడు మనస్సు రెండు విశ్రమమై సంకల్ప వికల్పములు చేయును. ఆకాశముయొక్క 1/8భాగము వాయువుతో కూడుటవల్ల మనస్సాయెను. మనస్సు వాయుభూతము. పరిపూర్ణ పరబ్రహ్మమందు మనస్సులేదు. కనుక అది మనస్సుకు అందదు. ఈ విధంగా కండ్లు, చెవులు,వాక్కు లేనిది పరిపూర్ణపరబ్రహ్మము. అది కేవలం

8)బి) **అప్రాణోహ్యమనాః శ్శుభ్రో। హ్యక్ష రాత్ పరతః పరః-ముండక 2-2**

తా॥ మనఃప్రాణములు లేనిది. అమృత స్వరూపుడు అక్షర పురుషుని కంటె పరుడగు పురుషోత్తముని కంటే పరమైనది (క్షరాక్షర పరుషోత్తముని కంటే పరమైనది) పరిపూర్ణపరబ్రహ్మము మనః ప్రాణములు లేనిది. క॥ద॥ 92 **"అన్నపు సూక్ష్మాంశముమన। సెన్నగ నీరంబు ప్రాణ। మెరుగుము యీరెండెన్నడు కలియవో। నాడే సున్నసుమీ యెరుక మాట సుగుణ సంపన్నా। కలుసుటే ఎరుక సుమి। యింతకన్నా వున్నా దెరుకమూల మన్నది వినలేదు। యెన్నాడు యీ భ్రాంతి నిన్నంట నివ్వాకు సుగుణసంపన్నా" ॥**

అన్నపు సూక్ష్మాంశము మనసు, జలము యొక్క సూక్ష్మాంశము ప్రాణము, ఈ రెండు కలిసినపుడే ఎరుక పుట్టు చున్నది. ఈ రెండు కలియనినాడు యెరుక పోవుచున్నది. ఇంతకన్నా ఎరుకకు మూలములేదు. ఈ భ్రాంతిని దరిజేరనివ్వకుమని శిష్యునికి ఈ పద్యముద్వారా హితవు పలుకుచున్నాడు శ్రీకృష్ణదేశికులు.

ఈ మనఃప్రాణములు కలియకుండజేసిన తిరిగి జన్మరాదు. ఇదే ఎరుక యందలి భ్రాంతి రహితము. జన్మరాహిత్య మోక్షము. అదెట్లో పరిశీలింతము.

పైనజెప్పినట్లు మనఃప్రాణములు కలయిక లేకుండ జేయుట పరిపూర్ణబోధ వల్లనే సాధ్యము. ప్రాణము అనగా కేవలం వాయువుగాదు. ప్రాణము అనగాశక్తి ఈ శక్తి సర్వమునందు నిగూఢంగా వుండియే యున్నది. ఈ ప్రాణశక్తి తండ్రియొక్క శుక్లమునందు తల్లి యొక్క శోణితమందుండి రెంటి చేరికతో ప్రకటితమై తల్లి యొక్క ఆహారపానీయములతో విజృంభించి పిండముగా వృద్ధి గాంచుచున్నది. తల్లి గర్భములో వున్నంతకాలము బిడ్డపుట్టువరకు తల్లి పిల్లల ప్రాణశక్తి కలిసియేవున్నది. బిడ్డ ఘ్రాణేంద్రియమునకు బ్రహ్మాండమందలి వాయువు సోకగానే లోననున్న ప్రాణశక్తి పని చేయుట ప్రారంభించి ఉచ్ఛ్వాస నిశ్వాసములు ప్రారంభమగును.

మరణ కాలమున శరీరమునుండి మనఃప్రాణములు పోవును. ఆ సమయమున ఇంద్రియాధిష్ఠానదేవతలు ఒక్కొక్కరు హృదయస్థానమున నున్న అంతఃకరణమున చేరుదురు. ఏ యింద్రియాధిష్ఠాన దేవత అట్లు చేరితే ఆ ఇంద్రియము పని చేయుట మానివేయును. చివరకు ప్రాణేంద్రియములలో ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేయుముఖ్య ప్రాణము హృదయస్థానమునచేరి సర్వేంద్రియ ఏకరూపమైన అంతఃకరణము (లేక మనస్సుతో)చేరి వుదానరూపము వహించి ప్రాణము ఆకాశము యొక్క ఆకర్షణశక్తిచే ఒక్క ఊపున నవరంధ్రములలో ఏదేని ఒకద్వారము ద్వారా బయటికి పోవును. ఇదియేమరణము. ఇక్కడ మనః ప్రాణములు రెండుకూడి బయటికి పోవును. ఇదియేమరణము. **"వాయుర్గంధా నివానిచ"** వాయువు గంధమును మోసుకొని పోవునట్లు ప్రాణము మనస్సును మోసుకొని పోవును. ఇట్టి వానికి జన్మరహితముకాదు. అంటే తిరిగి జన్మ వచ్చును. ఎందుకనగా మనఃప్రాణములు కూడియేవచ్చును. కూడియే పోవును. ఇట్లు కూడుటయే ఎరుక. కనుక మనః ప్రాణములు వేరు చేయుటకు శ్రీ శ్రీధర స్వామి **"సదాసుషు ప్త్యవవస్థస్తే"** అని చెప్పి ఎల్లప్పుడు సుషుప్త్యవవస్థలో యుండిన జన్మ రహితమగునని జెప్పినారు.

వాసనలకు స్థానమైనది మనస్సు. కనుక మనోనాశము వల్లనే వాసవలు నశించును. గాఢ సుషుప్తియందు సమాధి యందు మనస్సు మగ్నత చెందినదేగాని నశించలేదు. కనుక జాగ్రదవస్థలోగాని వ్యుత్థాన దశయందు గాని మనస్సుతోనే జాగృతమై కర్మకు కారణములగుచున్నవి. మనస్సు యొక్క విక్షేపము పోయిననేగాని ఆవరణము పోదు. **"కేవల మోక్షాపేక్షా సంకల్పోబంధః"** అని నిరాలంభోపనిషత్తు చెప్పుచున్నది. యేలననగా మనస్సు వున్నంత వరకు సంకల్పములకు తావిచ్చుచునే యుండును. మనోనాశనం తత్త్వజ్ఞానముచే అగునని చెప్పబడింది. తత్త్వజ్ఞానమనగా ఆత్మసాక్షాత్కారము. అనగామనస్సే ఆత్మగా మారుచున్నది. కాని మనస్సుతిరిగి దిగజారుటకు అవకాశమున్నది. కనుక గురు కృపకు పాత్రుడై పూర్ణబోధ తెలిసి గురూప దిష్టమార్గమున నడచి ఎరుక కూకటివేరు యెరిగి త్రవ్వవలసి యున్నది. **"పిండబ్రహ్మాండములురెండు"** అన్న కందార్థములోని రహస్యమును గురుముఖతః వస్తునిశ్చయముగా యెరుగవలెను. ఇదే ఎరుక కూకటివేరు దానియందలి భ్రాంతి పోవలసి యున్నది. కనుక అట్టి కూకటివేరును యెరిగి నేననే బ్రహ్మమునకు ఎరుకకు పరిపూర్ణమందు మూలములేదని స్థానము లేదని తెలుసుకొని భ్రాంతి రహితము పొందుటే కూకటి వేరును త్రవ్వివేయుట. ఫోటో ఫిల్మునకు పూసిన రసాయనిక ద్రవ్యం తీసివేస్తే రూపములు అంటునట్లు <u>మనస్సునకు మూల కారణమైన ఎరుక (నేనే బ్రహ్మననే భ్రాంతి) పరిపూర్ణమందు మూలము గాని నిలిచే యందుకు స్థానముగాని లేదని దృఢపరచు కొన్నచో మనోనాశనమగును.</u> అంటే సంస్కారములతో కూడిన మనసు లేకుండపోవును. అప్పుడు ప్రాణమొక్కటే బయటికి పోయి బ్రహ్మాండైక్యము చెందును. జన్మకారణమైన బీజము సంస్కార యుతమైన మనస్సు ప్రాణముతో విడిపోవుటవల్ల తిరిగి జన్మించుటకు అవకాశము లేకుండజేసుకొనవచ్చును.

**క్షర, అక్షర, పురుషోత్తములకు పరముగానున్నది పరిపూర్ణము.**

**1. క్షరపురుషుడు:** జ్ఞానేంద్రియముల చేత విషయ పంచకము తెలుసుకొని కర్మేంద్రియముల చేత కర్మఫలము పొందువాడు. **2. అక్షరపురుషుడు** కర్మ ఫలానుభవాలు పొందక సంకల్పరూపమున పిండబ్రహ్మాండములు సృష్టి స్థితి లయ ఆకర్షణములు యొనర్చువాడు. అన్నమయ కోశములకు అంతరముగా నుండువాడు క్షరపురుషుడు. సమిష్టి కోశములకు అతీతంగా అంతరముగానుండు వాడు అక్షరపురుషుడు. స్థావర జంగమ జీవోపాధులు క్షరపురుషులు. అధిష్ఠాన చేతన బ్రహ్మము వాయువు యొక్క సూక్ష్మమగు ప్రాణము. ఈ రెండు అనగా ఆత్మప్రకాశ బ్రహ్మము ఆత్మరూప ప్రాణము ఈ రెంటి చేరిక అఖండఎరుక అక్షర పురుషుడు.

ఈ క్షరాక్షర పురుషులు వస్తుసముదాయము చేత నిర్ణయింపబడిన వారే గాని ప్రత్యేక రూపములు గావు. కలయిక వలన యేర్పడినవారే. పదార్థములు విడిపోయిన యెడల ఉభయులు లేకుండ పోవువారే, కనుక క్షరాక్షరములు శాశ్వతములని మోక్షభ్రాంతి కలిగి వుండడము వ్యర్థమే.

క్షరమనగా నశించునది. అక్షరమనగా నశించనిది. ఇవి ద్వంద్వములు. ఈ లోకమునందు మానవులకు సౌఖ్యము నొసంగు సక్ఛందన వనితాదులు, ధన, కనక వస్తువాహనములు అయివున్నవి. ఊర్ధ్వలోకమందు ఆనందము విశేషముగాను విశేషకాలమందుండునదిము యుండవచ్చునేమో గాని అవియు నశ్వరమే. అనగా అశాశ్వతమే ఇదంతయు క్షరసంపద క్రిందనే జమకట్టవలెను. ఇక అక్షర సంపద ఏది? అఖండమగు జ్ఞాన సంపత్తియే చిత్ప్రకాశము, అది సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మ స్థానమేయై యున్నది. ఇదియే అక్షరసంపద.

క్షరాక్షరములు రెండునూ నశ్వరములే, జ్ఞానముకూడ అశాశ్వతమేనా? రెండు నశ్వరములే! ఎట్లనగా సృష్టికి పూర్వము ఒక రీతిగా, సృష్టి యనంతరము మరొకరీతిగా న్యూన్యాధిక్యములతో నున్నది. జ్ఞానము కూడ మారును. మార్పుగల దానిని శాశ్వత మనరాదు. ఈ జ్ఞానము, జ్ఞానాతీతమైన పరిపూర్ణ మందులేదు. **జ్ఞానా జ్ఞానములు వచ్చును, పోవును, జ్ఞానాతీతము తాగాంచినదాకన** ॥ అని నిర్ణయించినారు.

ఈ క్షరాక్షరముల కంటే పరమైనవాడు పురుషోత్తముడు. ఈ పురుషోత్తముని కంటే పరమైనది పరిపూర్ణ పరబ్రహ్మమని గ్రహించవలయును.

## 9) ఎరుక

| **అణోరణీయాన్ మహతోమహీయానాత్మ౽స్యజం తోర్నిహితో గుహాయాం॥కఠ॥** |
|---|

తా॥ అణువుకంటె అణు స్వరూపమును, మహత్తుకంటె మహత్ స్వరూపమును, అయి యున్నది. కామనారహితుడు, శోకరహితుండై యింద్రియాల యొక్క మనస్సు యొక్క పవిత్రత ద్వారా ఆత్మమహిమను సాక్షాత్కరించు కొంటాడు.

**అణోరణియాన్** అణువు అనగాబహుచిన్నది. ఉదాహరణ - ఇంటి కప్పులోని రంధ్రముగుండా సూర్యకిరణము ఇంటిలోనికి ప్రవేశించినపుడు ఆ కిరణములో అనేక నలుసులు మనకు కానవచ్చును. అంతకంటే సూక్ష్మమైన వస్తువు మనకు కానరాదు. అనేకాణువులు దగ్గరగా చేరి ఒక దాని కొకటి దగ్గరగా కరచిపెట్టుకొని యుండుటచే వస్తువు ఏర్పడినది. వస్తువునందణువులు సూక్ష్మముగా అత్మ నిండియున్నది. అట్లే అనంతములైన బ్రహ్మాండమునందు ఆత్మనిండి యున్నదన్నమాట. రూపముగాన రాక నిరవయవ రూపముగా నున్న వాయువు, ఆకాశము, రూపము కనబడు అగ్ని, జలము, పృథ్వియను పంచభూతములందు కాలము దిక్కుమనస్సు ఆత్మయు నాలుగు కలసిన నవవిధ ద్రవ్యములయందు కూడా ఆత్మసూక్ష్మముగా వ్యాపించియున్నది. ఏ వస్తువు యొక్క సూక్ష్మము ఆ వస్తువునందే యుండును. అట్లుగాక వస్తువుల బయట మహాతో మహీయాన్‌యందు కూడ సూక్ష్మంగావుంది.

**మహతో మహీయాం** :- మహతో అనగా గొప్పది. మహత్తులోనే సృష్టి జరిగినది. సృష్టియెంత వరకు యున్నదో ఆ ఆవరణము కంటే పెద్దదై అతిక్రమించియున్నది. అట్టి మహత్తు కంటెను పెద్దదై దానినిగూడ మీరి అతిక్రమించి ఆత్మయున్నదన్నమాట.

సృష్టి విధానమును పరిశీలించిన **"బ్రహ్మణోఅవ్యక్తాన్ అవ్యక్తాన్మహత్"** - అనగా

బ్రహ్మమునుంచి అవ్యక్తము, అవ్యక్తము నుండి మహత్ వరుసగా సృష్టిక్రమము చెప్పబడినది. మహత్తుకంటే బ్రహ్మము పెద్దదైయున్నది అని అనవలెను. అట్లే "ఏతస్మాత్తస్మాదాత్మనః" అనుశ్రుతి యందు ఆత్మయందు ఆకాశము, ఆకాశమందు వాయువు మొదలగునవి పుట్టినవని చెప్పబడుటచే పృథ్వి కంటే జలము, జలము కంటే అగ్ని, అగ్నికంటే వాయువు, వాయువు కంటే ఆకాశము పెద్దది, ఆకాశము కంటే ఆత్మ పెద్దదనవలెను.

నేను సృష్టికి పూర్వమున్న ఆత్మను లేక బ్రహ్మమును అయివున్నాను, నేను అణువు కంటే చిన్న వాడను. మహత్తు కంటె పెద్దవాడను అని వర్ణించబడినది.

అణురూపంగా **"తదంతరస్యసర్వస్య"** అన్నిటిలో, లోపలయున్నది **"తదు సర్వస్యాస్యబాహతః"** విభూ రూపంగా సమస్తవస్తువుల బైట వ్యాపించియున్నది.

సూక్ష్మాతి సూక్ష్మమైన అణువుకంటే చిన్నది. బ్రహ్మాండము కంటే ఘనమైన ఆత్మ ప్రాణుల హృదయాలలోనే యున్నది. అట్టి ఆత్మను కామనా రహితుడు, ఇహపర జీవితంలో కూడా సుఖించాలనే కోరిక లన్నిటిని త్యజించిన వానికి మరియు ఈ మనస్సు యింద్రియములను చెడు వృత్తులనుండి మరలించి ప్రశాంత పరిస్తే అప్పుడు మనస్సు బ్రహ్మాకారము వహిస్తుంది. ఆత్మసాక్షాత్కారము పొందదానికి ఇంద్రియాలు, మనస్సు ప్రశాంతంగా వుండడము చాల అవసరము.

## 9. పరిపూర్ణ పరబ్రహ్మము

**ఎ) అస్థూల మనణ్వ మహ్రస్వ, మదీర్ఘ మశబ్ద మస్పర్శ మరూప మవ్యయం ॥ బృహ. 3-3-8.**

తా॥ అది స్థూలముగాదు, అణువుకాదు, పొట్టిగాదు, పొడగుగాదు. అది శబ్ద స్పర్శ రూపాదులుగాదు. అవి దానియందులేవు. అది తరుగులేనిది.

పరిపూర్ణ పరబ్రహ్మము స్థూలముగాదు సూక్ష్మముగాదు. రూపముగల సమస్తము అవరణము గలిగియున్నది స్థూలము. భద్రాది రామశతక కర్త శ్రీపరుశు రామనర సింహ్మదాసుగారు 19 వ.సీస పద్యము ద్వారా **"జ్ఞానేంద్రియంబులు, కర్మేంద్రియములు అంతరేంద్రియములు, విషయేంద్రియములు, ప్రాణాదులు గూడి పరగ నిరువదైదు తత్వంబులును స్థూల తనువునయ్యె ॥"** ఈ స్థూలమును కంటిచే చూచుటకు వీలు కలదు. అదెట్లనగా స్థూలాకారము అన్నిటిలో నున్నది సూక్ష్మమైన చైతన్యమొక్కటే. అన్నిటిలో ఆ చైతన్యమున్నది. కనుక **నామరూపములను వదలిచూచిన అందరి చైతన్యమొక్కటే అని చూచే నేర్పుగలిగినపుడు చూచేదంతా ఆరాధ్యదైవమేనని బోధపడును. అట్టి కన్ను చర్మచక్షువుగాదు. జ్ఞాన చక్షువు. ఇదే మానవునికి మూడవకన్ను.**

సూక్ష్మమైన ఆత్మనులేక బ్రహ్మమును ఈ మాంసపు కండ్లతో చూడలేము. ధ్యానములో తదేక నిశ్చలత్వము పొందుటచే మనస్సు ఆత్మరూపమే వహించును. ఆత్మను చూడవచ్చును. 'ఆత్మవారే ద్రష్టవ్యం శ్రోతవ్యం' అనే శ్రుతి ఈ భావమును బలపరుచు చున్నది.

ఈ విధంగా (ఆత్మ) బ్రహ్మము సూక్ష్మంగా మరియు స్థూలంగా యున్నదనవచ్చును. కాని పరిపూర్ణ స్థూలంగాదు. సూక్ష్మముగాదు అది అంతట నిండి నిబిడీకృతమై యున్నది.

పరిపూర్ణ పరబ్రహ్మము పొడుగుగాదు, పొట్టిగాలేదు. పరిపూర్ణ పరబ్రహ్మము అంతట నిండి నిబిడీకృత మైనప్పుడు పొట్టి పొడుగుల ప్రసక్తేలేదు. ఆవరణముగల దానికి పొట్టి పొడుగులు, లావు సన్నములుండునుగాని, నిరావరణమైన పరిపూర్ణ పరబాహ్మమునకు లావు సన్నము పొట్టి పొడుగులతో కుదించుటకు వీలులేదు. పొడుగురేఖను గీచి దాని ప్రక్కన దాని కన్న పొట్టి రేఖను గీచి పొట్టి పొడుగులనెడి తారతమ్యమును చెప్పవచ్చును. గాని ఏకముగానుండి ఎప్పుడు మార్పులేని పరిపూర్ణ పరబ్రహ్మము పొట్టి పొడుగులతో కొలతలు వేయుటకు రాదు. కొలతలు వేయాలంటే వాటి యొక్క ఆద్యంతము లుండ వలసినదే. ఆద్యంతములులేని పరిపూర్ణ పరబ్రహ్మము కొలుచుటకు వీలులేదు. అది పొట్టి పొడుగులు లేనిది.

అది శబ్ద స్పర్శ రూపాదులులేనిది, కం.ద॥39 **లేదనకుమున్నదదిగో। నేదెలిసి తిననకు దీన్ని। నీ వెరిగేవా కాదది నీచే దెలియను। యేదిర తన్మాత్ర సమితి యా బట్టబయటా ।** అనీ

క.ద. 37॥ **కనరానిదాన్ని శూన్యం అని యనదగును గాని బయలు ననదగదు సుమీ! కనవచ్చు చున్న దిందులో కనుగొనుటకు యెరుకలేదు కనుగొన రాదా! యెరుకనె శూన్య మని యనరాదా॥** మొదటి కందార్థములో పరిపూర్ణ పరబ్రహ్మము కనుగొనుటకు పంచతన్మాత్ర సమితి అయిన శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు లేవు కనుక అది తెలియబడదు. రెండవ కందార్థములో పరిపూర్ణపరబ్రహ్మమందు తెలుసుకొను తెలివి లేక ఎరుక లేదు. కనుక ఎరుక పరిపూర్ణమును యెరుగజాలదు. కనుక పరిపూర్ణములో ఎరుక శూన్యమని శిష్యుని కనుగొనుమంటున్నాడు శ్రీకృష్ణదేశికేంద్రులవారు. కనుక పరిపూర్ణ పరబాహ్మమందు శబ్ద స్పర్శరూపాదులు లేవనెడిది స్పష్టము. శబ్ద స్పర్శాదులుంటే ఎరుక నెరిగి నట్లు పరిపూర్ణమును ఎరుగుట సులభమయ్యేది. పరిపూర్ణ పరబ్రహ్మమొకటి తప్ప మిగతదంతా యెరుకే, ఆ ఎరుక పరిపూర్ణ మందు లేకనే తోచింది. పరిపూర్ణమెప్పుడు ఎరుకగా మారలేదు. అందు పరాప్రకృతుల గాని, ప్రాణముగాని జ్ఞానముగాని ఏ విధమైన కర్మలుగాని లేవు. అది దేనికి ఆధారము అధిష్ఠానముగాదు. వాక్కు రూపములో గల పరా,పశ్యంతి, మధ్యమ, వైఖరీ వాక్కులు కూడ లేనిది. అది సర్వవస్తువులందు సంపూర్ణముగా నిండియున్నది.

ఎరుక పరిపూర్ణమందులేదు. గనుగ అది అసత్యము. వున్నట్లు తోచబడుటయేగాని నిజముగా అది లేనేలేదు. ఉన్నట్లు తోచబడినదెవరికి? గుర్తెరిగి తెలివిగా తోచినది తానే, తెలిసేవాడు, తెలియబడేవాడు తానే, అంటే తానే తోచి, తోచిన దానిగా తన్నుతానే చూచు కొనుచున్నది. తానే సత్యమైన బ్రహ్మనని తానేతనను నమ్మింది. కనుక తన్ను తానే బ్రహ్మననుకొన్నది. ఒక్కటైనతానే అనేక మగుదుగాక! అని సంకల్పించి తానే ఆధారము, అధిష్ఠానము అనిన్ని నిమిత్తోపాదాన కారణము అయి జీవేశ్వర జగత్తుగామారి

తన్నుతానే చూచుకొని సుఖదుఃఖములు పొందుచు, పట్టుకాయలోని పట్టు పురుగువలె బంధములో తగుల్కొన్నది. తానుగాని తానులేని పరిపూర్ణపరబ్రహ్మాను తెలుసుకొనే వరకు భ్రాంతిలో మునిగి జననమరణ ప్రవాహమున పడి కొట్టుకొని పోవుచున్నది.

పంచతాన్మత్రలు పరబయలునందులేవు. తన్మాత్ర స్వరూపము గల ఎరుకకు పరబాహ్యాముతో సంబంధము లేక వుండును. గనుక పరబాహ్యామందు ఈ ఎరుకలేదు. ఇదివేద వేదాంత సిద్ధాంతము, నిజనిర్ణయము. కనుక పరబాహ్యాము తన్మాత్ర రహితము. అది తరుగులేనిది.

**9 (బి) అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం। తథాఽరసం నిత్యమగంధ వచ్ఛయత్। అనాద్యనంతం మహతః పరం ధృవం। నిచాయ్య తం మృత్యు ముఖాత్ప్రముచ్యతే॥** కఠో॥

తా॥ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములైన పంచతన్మాత్రలు లేనిది, ఆద్యంతములు లేనిది, గొప్పదని చెప్పబడే భూమా పదార్థముకంటెను పరముగా నున్నట్టియు, స్థిరమైనది. దానిని (పరిపూర్ణపరబయలును) యెరిగినవాడు మృత్యురూప మగు సంసార బంధమునుండి విడివడు చున్నాడు.

ముందుగా పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శ రస, రూప, గంధములంటే ఎట్టివో సాంఖ్య పరంగా పరిశీలించి పరిపూర్ణపరబయలందు వాటి లేమిని గురించి విచారింతము.

పంచతన్మాత్రలు జలపంచకములోనివి. జలము యొక్క అధిష్ఠానదేవత విష్ణువు, గుణము -రసము, శక్తి -యిచ్ఛాశక్తి, బీజము -వంబీజము.

**శబ్దము** విష్ణు ప్రత్యగాత్మ ప్రకాశము చెవుల స్థానమందు జేరి శబ్దతన్మాత్ర కూడి శబ్దము అయెను. ఈ శబ్దమునకు అధిష్ఠాన దేవత సదాశివుడు, ఈ సదాశివుడు శబ్దముతో కూడి ధ్వని నెరుగును. వంబీజము యొక్క ప్రాణచలనము శబ్దమునందు జేరి ధ్వనించును. శబ్దమునకు స్థానము చెవులు, జలము యొక్క 1/8 భాగము ఆకాశముతో చేరుటవల్ల శబ్దమేర్పడును. శబ్దము ఆకాశ భూతము.

**స్పర్శ**-విష్ణు ప్రత్యగాత్మ ప్రకాశము **చర్మస్థానమందుజేరి** స్పర్శ తన్మాత్రతో కూడి స్పర్శఅయ్యెను. స్పర్శకు, అధిష్ఠానదేవత ఈశ్వరుడు. ఈ ఈశ్వరుడు స్పర్శ మిశ్రమమైన స్పర్శను తాకును. వంబీజము యొక్క ప్రాణచలనము స్పర్శయందు జేరి స్పర్శను తాకును. స్పర్శకుస్థానము చర్మము జలము యొక్క 1/8 భాగము వాయువుతో చేరుటవల్ల స్పర్శయేర్పడును. కావున స్పర్శ వాయుభూతము.

**రూపము** విష్ణు ప్రత్యగాత్మప్రకాశము నాలుక స్థానమందుజేరి రూప తన్మాత్రతో కూడి రూపమాయెను. ఈ రూపము యొక్క అధిష్ఠానదేవత రుద్రుడు. ఈ రుద్రుడు రూపము మిశ్రమమై వర్ణమునెరుగును. వంబీజము యొక్క ప్రాణచలనము రూపమునందు జేరి వర్ణమును యెరుగును. రూపమునకు స్థానం కన్ను. జలము యొక్క 1/8 భాగము అగ్నితో చేరుటవలన రూపమేర్పడును. రూపము అగ్నిభూతము.

**రసము:-** విష్ణుప్రత్యగాత్మ ప్రకాశము నాలుక స్థామందు జేరి రసతన్మాత్రల కూడి

రసమాయెను. రసమునకు అధిష్ఠాన దేవత విష్ణువు. విష్ణువురసము కూడి రుచి నెరుగును. వం బీజము యొక్క ప్రాణచలనము. **రసము**నందు చేరి రుచి నెరుగును. రసమునకు స్థానము నాలుక. రసము జలభూతము.

**గంధము.** విష్ణు ప్రత్యగాత్మ ప్రకాశము ముక్కుస్థానమందుజేరి గంధ తన్మాత్రతో కూడి గంధమాయెను. గంధమునకు అధిష్ఠానదేవత బ్రహ్మ. బ్రహ్మ గంధముకూడి వాసన నెరుగును, వంబీజము యొక్క ప్రాణచలనము గంధమునందు జేరివాసన నెరుగును. గంధమునకు స్థానము ముక్కు. జలము యొక్క 1/8 భాగము పృథ్వీ భాగముతో చేరుటవల్ల వాసన నెరుగును. కావున గంధము పృథ్వీ భూతము.

ఈ విధముగా పంచతన్మాత్రలు యేర్పడిన విధము, అధిష్ఠానదేవతలు, స్థానము ఎరుగు అంశములు, భూతములను పరిశీలించిన ఇవన్నియు ఎరుకకే గాని పరిపూర్ణ పరబ్రహ్మము నందులేవు.

ఆద్యంతములు లేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. ఆది అనగా మొదలు, మూలము పుట్టుక అనే అర్థములు గలవు. అట్లే అంతము అనేవరకు కొన లేక చివర మూలములేనిది, చావు గలదని అర్థములు వచ్చును. నేనుకు మొదలులేదు. తుదియు లేదు. నేనుకు తుదిమొదలు లేవన్నప్పుడు రెండర్థములు సిద్ధించుచున్నవి. 1) దేశమును పురస్కరించుకొని మొదటి కొనయే మొదలు, చివరి కొనయే తుద. 2 కాలమును పురస్కరించుకొని ఆరంభించిన కాలము ఆది, ముగించిన కాలము అంత్యము, ఆద్యంతములు 3) పుట్టుకనే అనే అర్థములో నేనుకు పరిపూర్ణ పరబ్రహ్మమునందు జనన మరణములు లేవు. "అజోహమమ రోహం" అని ముందే చెప్పినారు. యీ అర్థమే మరల జెప్పితే పునరుక్తి దోషము సిద్ధించును. 4) మొదలగు అని అర్థము సమంజసముగాదు. ఎందుకంటే "ఏకమేవా ఽ ద్వితీయం బ్రహ్మ" **సర్వంఖల్విదంబ్రహ్మ** శ్రుతులు నేనైన బ్రహ్మమును ఏకము అద్వితీయము, అదే అనేకమై సర్వము అదే అయివున్నది. దేశ కాలాతీతమై అదే అయివున్నప్పుడు దానికి పూర్వం దేశ కాలములు లేవు పరిపూర్ణ పరబ్రహ్మము దేశ కాలతీతమైయున్నది. కావున పరిపూర్ణ పరబయలునకు ఆద్యంతములు లేవు.

గొప్పదని చెప్పబడే భూమా పదార్థము కంటెను పరముగా నున్నది పరిపూర్ణ పరబ్రహ్మము. అన్నిటికంటే ఏది బృహత్ పదార్థమో అదే బ్రహ్మము లేక గొప్పస్వరూపము (గురుస్వరూపము) కలదియే బ్రహ్మము. బృంహి వృద్ధౌ అను ధాతువు నుండి బ్రహ్మశబ్దము వచ్చినది. "బ్రహ్మ బృంహణాత్ బృంహతి వర్ధతే" అని శబ్ద కల్పద్రుమము నిర్వచించుచున్నది. బ్రహ్మమనగా బహు గొప్పది. అంతకంటే పెద్దది లేదన్నమాట అది విశ్వగతము, విశ్వాతీతము. పృథ్వీవ్యాపస్తేజోవాయు రాకాశములన్నియు సర్వ వ్యాపకమై యున్న ఆకాశమును గూడ నతిక్రమించి యున్నది. కనుకనే మహతోమహీయాన్ అని కీర్తింపబడుతున్నది. గురు స్వరూపమని సార్థకనామముచే నొప్పుచున్నది. లఘుస్వరూపుడు, పూర్ణస్వరూపుడు లేక విభుస్వరూపుడు అయివున్నాడు. జగద్రూపముగా కనబడునది. తాత్వికముగా బ్రహ్మమే. "ఏకమేవా ఽ ద్వితీయం బ్రహ్మ"

"నేహనా నాస్తి కించన" "సర్వంఖల్విదంబ్రహ్మ' 'అయమాత్మబ్రహ్మ' యిత్యాది, శ్రుతి వాక్యములు నాతో గూడా సర్వమూ బ్రహ్మమే అని ఘోషించుచున్నవి. కనుక ఉపాధి రహితమైన గురుస్వరూపము విభుస్వరూపమునకు కూడ మీరినది అతిక్రమించినదే పరిపూర్ణపరబ్రహ్మము.

**స్థిరమైనది** – పరిపూర్ణ పరబ్రహ్మము స్థిరమైనది. స్థిరమునకు మోక్షము, కొండ,చెట్టు, నిలుకడైనది యనెడి అర్థములు గలవు. వీటియన్నిటి సమాహారములో నిలకడకలది, కదలనిది, చలించనిది యనే అర్థము ద్యోతక మౌతుంది. కదలిక లేనిచోట శక్తి యుత్పత్తి కాజాలదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు చలనాంశ రూపమైన ప్రాణము లేదు. శక్తిన్నిలేదు. కనుక అది స్థిరముగా నున్నది. అందుచేతనే కొందరు అచలమని పేరుపెట్టారు. ఆపేరుదానికి సరిపోదు. ఎందువల్లనంటే చలాచల లక్షణములు రెండు, ఎరుక లక్షణములే, కదలిక సహజలక్షణముగా నున్న యెరుకకు అచలస్థితి కూడ గలదు. జాగ్రదవస్థయందు చలన రూపంగాయున్న యెరుక (జ్ఞానము) సుషుప్తి, సమాధ్యాధి అవస్థల యందు అచలస్థితిలో యుంటుంది. సృష్టి స్థితి లయాదులందు చలన రూపం వహించిన బ్రహ్మము సృష్టికి పూర్వదశయందు ప్రళయానంతరము అచలముగానే వుంటుంది. కనుక ఈశావాస్యోపనిషత్తు **"తదేజతి తన్నైజతి, తద్దూరే తద్వదంతికే, తదంతరస్య సర్వస్యతదు సర్వస్యాస్యబాహ్యతః"** అని అంటుంది. అనగా అది కదలును. అది కదలదు, అది దూరముననున్నది, దగ్గరలోనున్నది, అది సర్వమునకు బాహ్యాంతరములోయున్నది. కనుక చలనము గల ఎరుక అచలముగాను వుంటుంది. ఆ రెండులేనిది పరిపూర్ణ పరబ్రహ్మము, బ్రహ్మసన్నిధానంలో పరిణమించుచున్న మాయావిషయములో కూడ కారణ కర్తృత్వములు బ్రహ్మకేయున్నవని చెప్పనగును. అందుకే 'తేనవినా తృణాగ్ర మపినచలతి' బ్రహ్మము కదిలించనిచో గడ్డి పోచకొననైన కదలదని శ్రుతి చెప్పుచున్నది. ఈ చలనశక్తి బ్రహ్మమందే బీజరూపముగా నున్నది. పరిపూర్ణమొక్కటే **'నిత్యసర్వగతః స్థాణు రచలోయం సనాతనః'** అని గీత పేర్కొన్నది. కనుక తాను చలించక ఇతరమును చలింపజేయక, విశ్వ విశ్వాంతరాళముల యందలి చలనము ఆధారముగాగాని, అధిష్ఠానముగగాని గాక, కేవలం అచలముగా స్థిరముగా యున్నది పరిపూర్ణపరబ్రహ్మయొక్కటే యని యెరిగిన నాడు మృత్యురూపమగు సంసారము నుండి విడివడు చున్నాడు. అట్టివాడు మృత్యువునకు మృత్యువు.

# 10. ఎరుక

> **ఆత్మవస్తు కామాయ పతిః ప్రియాభవతి...**
> **ఆత్మవస్తు కామాయ జాయా ప్రియాభవతి..**
> **ఆత్మవస్తు కామాయ పుత్రాః ప్రియాభవన్తి...**
> **ఆత్మవస్తు కామాయ విత్తం ప్రియం భవతి..**
> **ఆత్మవస్తు కామాయ బ్రహ్మం ప్రియం భవతి..**
> **ఆత్మవస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి..**

| ఆత్మవస్తు కామాయ లోకా[ప్రియా భవంతి.. |
|---|
| ఆత్మవస్తు కామాయ దేవాః ప్రియా భవంతి... |
| ఆత్మవస్తు కామాయ భూతాని ప్రియణి భవంతి... |
| ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియంభవతి... |

బృహదారణ్యక 4అధ్యా 4 బ్రాహ్మణం 5. వ మండలం.

ఆత్మయందలిప్రేమ చేతనే భర్తా, ఆత్మయందలి ప్రేమ చేతనే భార్య, పుత్రులు, విత్తము, బ్రహ్మ, క్షత్రములు, లోకములు, దేవతలు, భూతములు మొదలగు సర్వమూ, ప్రేమాస్పదమై యున్నవి.

'ఆత్మన్యే వోపాసీత ప్రియమిత్యుపాసీత' అనగా ఆత్మనే వుపాసింపుము. అది ప్రేమ స్వరూపమైనదిగా వుపాసింపు మని ఈ శ్రుతుల తాత్పర్యము. సరియైన భక్తుడే నాకు ప్రియమంటున్నాడు గీతాచార్యుడు. భక్తున కాభగవంతుని కంటే ప్రియతమమైనది లేదు కనుక భక్తియొక్క స్వరూపమే భగవంతుడు. విభక్తి కానిదే భక్తి. కనుక ఏ కమేనా౨ ద్వితీయంబ్రహ్మ అని చెప్పబడినదే భక్తి. భక్తి జ్ఞానములు వేర్వేరుకావు.

రాధాకృష్ణుల ప్రేమ దివ్యము. అట్టిప్రేమయే భక్తి యొక్క పరాకాష్ఠ. అట్టి ప్రేమ తర తమభేదముచే ఆత్మయందెట్లు పర్యవసించు చున్నదో చూతము.

**విత్తత్ పుత్రఃప్రియం భవతి పుత్రాత్స్వశరీరం ప్రియం।**
**యింద్రియాణి ప్రియా ప్రాణః ప్రాణాదాత్మ పరః ప్రియః॥**

అనగా విత్తము, పుత్రుడు, స్వశరీరము, యింద్రియములు, ప్రాణము, ఆత్మ, అవి పూర్వా పూర్వముకంటే పుత్తరోత్తరములు ఒక దానికంటే నొకటి ప్రియతమములై చివరిదైన ఆత్మ అన్నికంటే ప్రియతమైనదని భావము. పరమాత్మ యందు పర్యవసింపజేయని ప్రేమకు సార్ధక్యతలేదు. "ఆత్మవస్తుకామాయ విత్తం ప్రియం భవతి...ఆత్మవస్తుకామాయ సర్వం ప్రియం భవతి" యని శ్రుతియును ఉద్ఘాటించుచున్నది. అనగా తానైన ఆత్మయందు సహజముగా ప్రేమయుండుట చేతనే విత్తము పుత్రుడు భార్యా యిత్యాదులయందు తనకు ప్రేమ కలుగుచున్నది. కాబట్టి అట్టి ఆత్మయే ప్రేమకు నిధానము, ప్రేమకు పరంధామము అయివున్నది. ఆత్మకు సత్యజ్ఞానానందములు స్వరూపమై యున్నవి. కనుక స్వరూప లక్షణముచేత కూడా ఆత్మప్రేమ రూపము జ్ఞానరూపము కూడనై యున్నది. కనుక ఆత్మయందలి ప్రేమ యుండుట వల్లే సర్వమును ప్రేమించగలుగుతున్నామని ఈ శ్రుతి నిర్ణయం.

**10) పరిపూర్ణ పరబ్రహ్మము.**

| ఎ) యద్యత్స్వాభిమతం వస్తుతత్యజక్ మోక్షమశ్నుతే ॥ మహోపనిషత్॥ |
|---|

తనకు అభిమతమైన అనగా ప్రేమాస్పదమైన వస్తువును వదిలిన వాడే మోక్షము పొందగలడు. ఆత్మకంటే ప్రియతమమైన వస్తువుఏదిలేదు. తన "స్వ" ఆత్మవస్తువే ప్రియతమము కనుక అట్టి ఆత్మయందలి భావమును త్యజించి ఆత్మాతీతమైన కేవలాత్మను అనగా పరిపూర్ణ పరబ్రహ్మమును తెలిసి జనన మరణ రహిత రూపమగు మోక్షమును పొందుచున్నాడు.

ధన కనక వస్తు వాహనములు గాని, గృహారామక్షేత్రాదులుగాని, దశవిధ దానములు గాని, షోడశ దానములుగాని, పుత్ర మిత్ర కళత్రములను వాసనాత్రయము, ఈషణత్రయాలను త్యాగంజేసి సన్యాసాశ్రమమును స్వీకరించి, జిహ్వాచాపల్యము విడిచి, ఆకు అలములు కందమూలములతో ఆకలి దప్పులను తీర్చుకొన్నను లేదా కేవలం వాయు భక్షణముతో ప్రాణము నిలబెట్టు కొన్నను జనన మరణ రూప రహితస్థితి చేకూరజాలదు. కనుకనే **"నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైక అమృతత్వ మానుశుః"** అనుశ్రుతివాక్యమునందు త్యాగమువలన తప్పమరొక దాని వలన అనగా కర్మవలనగాని సంతానము వలగాని ధనము చేతగాని మరే యితర విధంగా గాని శాశ్వత అమృతత్వము సిద్ధించదు. చావులేనిచో జన్మయే లేదని గ్రహించవలెను. ఏలననగా పుట్టినది చావక తప్పదు అని సిద్ధాంతము. **"జాతస్యహిధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్యచ"** అనే గీతావచనము. కావున పైన జెప్పిన శ్రుతి వాక్యమునందు త్యాగమొక్కదాని వల్లనే అమృతత్వం సిద్ధించునని చెప్పబడినది. కాని త్యాగమేదో వివరించబడలేదు. భగవద్గీతా చరమ శ్లోకంలో సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ అని నిగూఢంగా జెప్పబడినది. సర్వధర్మములను వదలి తన్ను శరణు పొందుమంటున్నాడు భగవానుడు. శరణాగతి లక్షణములను భాష్యకారులు పూర్తిగా వివరించలేదు. ఈ రహస్యము పరిపూర్ణభావజ్ఞులు పూర్తిగా సూటిగా జెప్పియున్నారు. **'త్యజధర్మమధర్మంచ'** అను భ్రాంతి రహిత శ్లోకమున వివరించబడింది. ధర్మాధర్మములను సత్యాసత్యములను సర్వద్వంద్వములు విడిచిన తర్వాత దేనిచే ఆ సర్వద్వంద్వములు విడిచితివో ఆ వస్తువును కూడ వదిలివేయుట త్యాగము.

త్యాగముచేయుశక్తి గల దానికి ప్రతిగ్రహించు శక్తియుండును. కనుక ఆ వస్తువుశేషించి యున్నచో మరల గ్రహించు ప్రవృత్తికి లోబడే ప్రమాదమున్నది. కనుక త్యాగము దేనిచే చేయబడినదో ఆ వస్తువును కూడ త్యాగము చేయుమని **"ఏన త్యజసి తత్యజ"** అని భ్రాంతి రహిత శ్లోక ముద్ఘాటించుచున్నది.

సృష్టి స్థితిలయములకు అత్యంతమూల కారణము ఆత్మయే (కారణబ్రహ్మమే). **ఈ ఆత్మకు పరిపూర్ణ పరబ్రహ్మమందు స్థానముగాని, మూలముగాని లేదు. కనుక ఆ బ్రహ్మమును లేక ఆత్మను లేనెరుక అన్నారు. కనుక ఎరుకను ఎరిగి దేని చేత విడువవలెను.** **"యేనత్యజతత్యజ"** అని శ్లోకమున జెప్పబడినది పరిపూర్ణపరబ్రహ్మము నిష్క్రియము కనుక దానిని ఒక పని ముట్టుగాజేసి దానితో ఎరుకను విడుచుట అసాధ్యము. కనుక పరిపూర్ణ గురువుల నాశ్రయించి పరిపూర్ణము ఎరుకలను వస్తు నిశ్చయముగా నెరిగి యెరుక లేనిదే యని దృఢం జేసుకొన్నయెడల ఆ ఎరుకే బ్రహ్మమనే తన పూర్వానుభవమును భ్రాంతిని పూర్తిగా వదిలివేయుటయే యెరుకను విడుచుట. ఇదంతా భావనారూపమే. కనుక యెరుక చేతనే తీసివేయరా అని కృష్ణప్రభువుల వారు సెలవిచ్చియున్నారు. విడిచేవాడు విడువ బడేవాడు విడువబడేది (విడిచేపనిముట్టు సాధనము) మూడు యెరుకే. ఇది జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములనే త్రిపుటి. ఈ త్రిపుటి రహిత మందే సర్వభ్రాంతి రహితము, శాశ్వత జనన మరణ రూప రాహిత్యము. మరో మార్గములేదు.

క్లుప్తంగా జెప్పాలంటే ఆత్మవస్తువే తనకు ప్రియము. కనుక అట్టి ఆత్మ (నేనుయందలి) యందభిమానమును త్యజించి ఆత్మకు అతీతముగానున్న కేవలాత్మను అనగా పరిపూర్ణపర బ్రహ్మమును తెలసి జనన మరణ రహితమోక్షము పొందుమన్నారు.

ఐహికాముష్మిక సుఖములకై చేయబడు కర్మలు ఆత్మస్వరూపమగు మోక్షముగోరి చేయు కర్మలూ కామ్య కర్మలే, మరియు బంధ కారణములే. **"కేవలమోక్షాపేక్ష సంకల్పోబంధః"** అని నిరాలంబోపనిషత్ వాక్యము. అనగా కేవలం మోక్షము కావలెననెడి కోరిక కూడ బంధమే. ఈ త్రివిధకర్మలలోను స్వార్థమున్నది. స్వ + అర్థము = స్వార్థము కనుక యిందు స్వ అనగా తాను తన ప్రయోజనముంటూవున్నది. కనుక నిస్వార్థకర్మలేక నిష్కామ కర్మ కాజాలదు. తాను లేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. పరిపూర్ణ భావజ్ఞుడు తానులేడనే ఆరూఢతపై చేయు కర్మలే నిస్వార్థకర్మలు కాగలవు. అతడే కర్త కర్మలు చేసియు చేయని వాడగుచున్నాడు. తాను లేడు గనుక తనకు కర్మలంటునా ? యిట్టి భావనతో చేయబడు కర్మాచరణ విధానమే అశరీరపద్ధతి.

"స్వ" ఆత్మవస్తువే తనకు ప్రియతమము కనుక అట్టి ఆత్మ వస్తువందభిమానము వదలి అశరీర పద్ధతిలో శేషజీవితమును గడిపి జన్మరాహిత్య మోక్షమును పొందుదముగాక!

**10** **(బి) త్యజధర్మమధర్మంచ ఉభే సత్యా ౽ నృతే తేత్యజ ।**
**ఉభేసత్యానృ తేత్యక్త్వా యేనత్యజసి తత్యజ ॥** సన్యాస – అ–2

తా॥ శీతోష్ణాది సమస్త ద్వంద్వములను విడిచిన విధంగానే ధర్మాధర్మములు (విధినిషేదాలు) సత్యా సత్యములను భేదబుద్ధికూడ జ్ఞాని విడిచిన వాడగుచున్నాడు. అయితే దేని చేత ఆ ద్వంద్వ లక్షణములను విడుచునో అట్టి జ్ఞాన స్వరూపమగు ఎరుకను (తెలివి) విడువుము.

ఇందు ధర్మా ధర్మములను, సత్యా సత్యములను తెలుసుకొని తర్వాత జ్ఞానస్వరూపమైన ఎరుకను విడుచు టెట్లో పరిశీలింతము.

ధర్మ శబ్దమునకు **"ధార్యతే యితిధర్మః"** అనగా ఏది ధరించునో, భరించునో అది ధర్మము, సృష్టిస్థితి లయము లన్నిటికి మూలకారణమైన పరమాత్మ తాను సృష్టించిన సమస్తమును పోషించుచూ కాపాడుతు వాని వాని నిర్ణయానుసారముగా అవి నశించు పర్యంతము వానిని ఆస్థితి యందే వుంచుటకు సర్వశక్తి వంతుడైన పరమాత్మకే సాధ్యము. కనుక పరమాత్మయే ధర్మ శబ్ద వాచ్యుడు. ఏయే నిర్ణయములకు లోబడి యీ విశ్వము నడుచుచున్నదో అవన్నియు ధర్మములే.

"ధర్మోరక్షతి రక్షితః" ధర్మాచరణములో ధర్మమును రక్షించినచో ధర్మమాతనిని రక్షించును.

ధృతి,క్షమ,దమము,అస్తేయము,శౌచము, యింద్రియ నిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము యీపదిన్ని ధర్మ లక్షణములుగా జెప్పబడినవి. మానవులందరు ఈ ధర్మ లక్షణములతో జీవించుట విహిత ధర్మమైయున్నది. ఈ ధర్మలక్షణములకు

విరుద్ధముగా జీవించుట అధర్మము, అధర్మములను వదలుట సబబుగా అనిపించును. గాని ధర్మమును కూడ వదిలివేయుమంటుంది ఈ శ్లోకము.

సుఖదుఃఖములు కావడి కుండలు. దాన ధర్మాల వల్ల స్వర్గాది పుణ్యలోకము లలోని సుఖభోగములు పరిమితములు, అశాశ్వతములు అయివున్నవి. ఏలననగా పుణ్యలోకముల లోని సుఖభోగములచే పుణ్యము వ్యయంకాగా **'క్షీణేపుణ్యేమర్త్య లోకం విశంతి"** అన్నట్లు తిరిగిచావు పుట్టుకలుగల లోకం అనగా భూలోకంలో పుట్టి జనన మరణ రూప సంసార చక్రములో పరిభ్రమించ వలసినదే. ఇహలోక సుఖములకై ప్రాకులాడుట ఎంత అవివేకమో, స్వర్గాది పుణ్యలోకములందలి భోగములాసించుట అంతే అవివేకము. అందుకు గాను సాధనముగా దానధర్మాలొనర్చుట కూడ అంతే అవివేకము.

ఇది ధర్మము, యిది అధర్మము అని నిర్ణయించుటకు ఆ ధర్మాధర్మములను పాటించుటకు గుర్తెరిగే శరీరమే మూలకారణమైయున్నది. ఏలననగా గుర్తెరుగకుండా యెవరును యేకర్మ చేయరు. ధర్మాధర్మములను చేయునది ఈ గుర్తెరిగే శరీరమే (ఎరుకయే) ధర్మముగా నడుచుకో అధర్మముగా నడువకు అనుట కూడ ఎరుక క్రియలే, కనుక గుర్తెరిగే శరీరమును విడువుమని ఆదేశించినట్లే. ధర్మమనగా ఆత్మ, అధర్మమనగా అనాత్మ, అపుడు ఆత్మానాత్మలను అంటే ఎరుక మరుపులను వదిలివేయుమని చెప్పినట్లే.

సత్యశబ్దమునకు ఆత్మయని, జగత్తని, అనృతము, అసత్యమని లేక మిథ్యయని చెప్పబడుచున్నది. ధర్మాధర్మములు, సత్యాసత్యములు మరియు సమస్త సాపేక్ష ద్వంద్వములు యెరుకయేగాని అందేదియు పరిపూర్ణ పరబ్రహ్మము గాదు. పరిపూర్ణపరబ్రహ్మము ఏకానేకములు గానిది నిరపేక్షక నిర్ద్వంద్వము. ఏమని నోటితో యనరానిది. ఉచ్ఛిష్టముగానిది.

పై వివరణవల్ల మనకు బోధపడిన దేమనగా మనము త్యజింపవలసినది, విడువ వలసినది తెలియవచ్చింది. అదే ఎరుక. ఎరుక కాని దొక్క పరిపూర్ణపరబ్రహ్మము. అది నిష్క్రియము. దానిని ఒక పనిముట్టుగా జేసి దానితో ఎరుకను విడుచుట అసాధ్యము గదా! పరిపూర్ణమెరుకలను గురుముఖతః తెలిసి యెరుక లేనిదేయని దృఢం చేసుకొన్న మీద ఆ యెరుకే బ్రహ్మమనే తన పూర్వానుభవమును భ్రాంతిని పూర్తిగా వదిలి వేయుటయే యెరుకను విడుచుట. ఇదంతా భావనారూపమే. యెరుక చేతనే పట్టి తీసివేయమన్నారు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు.

**10 సి)** **1. ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి 2. జ్యోతిర్జ్వలతి బ్రహ్మాహమస్మి**
**3. అహమస్మి బ్రహ్మాహమస్మి**
**4. అహమే వాహం మాంజుహోమి స్వాహా॥** (తైత్తిరీయోపనిషత్తు - నారాయణప్రశ్నః ద్వాదశాను వాకః)

**ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి:** 1) అపోజ్యాతి రూపంగా ఏది ప్రకాశించు చున్నదో, ఆజ్యోతి స్వరూపుడను నేనే అయి వున్నాను.

2) పరంజ్యోతి అను పేరుతో ఏది ప్రకాశించుచున్నదో, ఆ బ్రహ్మము నేనైయున్నాను.

**ఆపజ్యోతి పరం జ్యోతిని** గురించి తెలుసుకొందాము. స్వయం జ్యోతి అని ఆ పరమాత్మను వర్ణిస్తున్నారు. ప్రతిఫలిత చైతన్యరూపమై నేత్రస్థానము లేక భ్రూమధ్యస్థానమున నిర్ణయించబడినది ఆపోజ్యోతి.

సూర్య చంద్ర నవగ్రహ నక్షత్రములందు ప్రకాశమానమై అగ్నిభూత సంబంధము గానున్నది భూతజ్యోతి.

ఈ రెంటికి ఆధారమై మూలమైయున్నది. పరంజ్యోతి, ఇదే కేవలం జ్ఞానస్వరూపమై 'జోతిషాంజ్యోతిః అనగా జ్యోతులకెల్ల జ్యోతి స్వరూపముగానున్నది. ఇదిశ్రేష్టమైనది, సర్వోత్కృష్టమైనది. కనుకనే దీనిని పరంజ్యోతి అన్నారు. జ్యోతి అనగా దీపము అని సామాన్యార్థము, ఒక్కదీపముంటే ఆదీప సహాయంచే మరొకదీపము దాని సహాయంతో మరొక దీపం, యిట్లే అనంత కోటిదీపములను 'దీపోదీపాంతరంయథా' దీపమునుండి మరొకదీపము యన్నట్లు వెల్గించవచ్చును. అదే విధంగా భూత జ్యోతికిన్ని, అపోజ్యోతికిన్ని ఆపరమాత్మయే మూలకారణమని చెప్పవచ్చును.

దీప దృష్టాంతములో ఆమొట్ట మొదటి దీపం కూడ సహజంగా ఎవరో వెలిగించినదే అయి వుంటుంది. కాని అన్ని జ్యోతులకు మూలమైన పరంజ్యోతి వెలిగించిన వారెవ్వరు అంటే మరొక రెవ్వరుకారు. దాని స్వరూపమే ప్రకాశరూపము. అనగా జ్ఞాన స్వరూపము **'జ్ఞానము నేనన నొక్కటే అన్నట్లు"** నేనే ఆపరంజ్యోతిని. అదిచిద్ఘనమైయున్నది. ఆ ప్రకాశమునకు మూలప్రకాశమనునదివేరేలేదు (నాకు నేనే మూలము లేక ఎరుక కెరుకేమూలం) దానికే స్వయం ప్రకాశము లేక స్వప్రకాశము అన్నారు. దానినే ఈ శ్రుతులయందు నేను అన్నారు.

వ్యష్టిరూపములో ఆ జ్యోతిగా ప్రకాశించు వాడనునేనే. మరియు సమిష్టి రూపములోగల పరంజ్యోతిగా ప్రకాశించుచున్నది నేనే, అంటే పిండాండ బ్రహ్మాండములో జ్యోతిరూపముగా నేనే అయి ప్రకాశించున్నాను. పిండాండములో అహంగా బ్రహ్మాండములో జ్యోతిరూపముగా నేనే 'అహం'గా ప్రకాశింపజేయుచున్నాను. ఈ రెండు అహం జ్యోతులు, పిండ బ్రహ్మాండములు రెండు వెరసి నాలుగు కలసి అఖండ ఎరుక రూపము. ఈ అఖండ ఎరుకస్వరూపములను దర్శింపజేసిన వాడే సద్గురువు. అట్టి సద్గురువునకు ఇవే మా ప్రణామములు.

**3. అహమస్మి బ్రహ్మోహమస్మి**

నేను నేనైన బ్రహ్మమునై యున్నాను.

అనగా నేనునేనైన బ్రహ్మమునైయున్నాను శ్రుతి **" సదేవసోమ్యేౖ ద మగ్ర అసీదేకమేవా ౖ ద్వితీయం బ్రహ్మ"** ఛాందోగ్యోపనిషత్తు అనగా సృష్టికి పూర్వం ఏకమును అద్వితీయమును అగు సత్పదార్థమొకటియే యుండెను. ఇంకొక పదార్థము లేక ఏకమై యుండుటవల్ల ఆ ఏకమునే అద్వితీయమని కొనియాడినారు. ఆసద్పదార్థమే నేను. అదియే నా తొలిస్వరూపము. అప్పుడు నాయందు చలనము లేక అనగా సంకల్పములు కలుగలేదు. సృష్టి కామన అసలేలేదు. నేను నేనైన స్థితి అది. ఎట్టి వికారములకు లోను కాలేదు. అట్టి స్థితియే నాయొక్క స్వరూపము, అదే పరబ్రహ్మ స్వరూపము.

మొదలు నేననగా యేది? వైఖరీ వాక్కుగల మానవోపాధి యందున్న ప్రతి వ్యక్తి నేను నేను అని తనను గురించి పలుకుచున్నాడు. మాటలు వచ్చినది మొదలు ఆబాల గోపాలము మరణము సిద్ధించు వరుకు లింగ వయో భేదములేక నేను నేను అంటూ పలుకుచుండుటచే దానికి వ్యాకరణవేత్తలు సర్వనామములలో మొదటిస్థాన మిచ్చియున్నారు.

ఈ నేను వాక్కు వైఖరీ రూపములో మానవులందు, మధ్యమ పేరుతో పశుపక్షులందు పశ్యంతివాక్కు తరు లతాగుల్మాదులందు, పాషాణములందు పరావాక్కురూపములో గలదు. ఈ తెలివి పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి వాక్కు రూపములో సర్వోపాధులందు జడచేతనములందు వేయేల సమస్తము నందును తెలివి, గుణ, శక్తి రూపములోవుండియే యున్నది. మహావాక్యములలో దీనినే ప్రజ్ఞానబ్రహ్మమని, అహంపదార్థమని, అయమాత్మయని, సృష్టికి పూర్వము బ్రహ్మయని, తత్పదం అనీ వివిధనామములతో అభివర్ణించబడినది.

ఈ నేను స్థూలశరీరముతో తాదాత్మ్యముచెంది నేను పొడగరిని, నల్లటివాడను అనీ, నేను సుఖంగావున్నాను, దుఖములోవున్నాను అని సూక్ష్మశరీరము తాద్యాత్మ్యము చెంది అంటున్నారు. అట్లే కారణశరీరముతో తాదాత్మ్యముచెంది నాకేమి తెలియదు అంటున్నాడు. అహంబ్రహ్మాస్మి, శివోహం యిత్యాదివాక్యములలో మహాకారణ శరీరముతో తాదాత్మ్యంజెంది సత్యమునకు చేరువగుచున్నాడు. కనుక మానవోపాధి యందలి నాల్గుశరీరములు అట్లే ఈశ్వర తనువులను ఈ నేను చేరుచున్నవి. సమస్తోపాధులందు ఈ నాలుగు శరీరములునూ వున్నవి. కనుక నేను అనగా గుర్తెరిగేతెలివి. సర్వభూతములందు ఎరుక రూపములోనో, మరుపు రూపములో యున్నది. సృష్టికి పూర్వము, నిజరూపంలోయున్నది. ఇదియే నా స్వస్వరూపము.

సంవిత్తు, అభిజ్ఞ, గుర్తు, సాక్షి, ద్రష్ట, దృక్కు, ఎరుక, మరువు, స్ఫురణ, జ్ఞప్తి, మనోబుద్ధి, చిత్తాహంకారములని, తెలివి, జ్ఞానము, అజ్ఞానము ప్రజ్ఞ, ప్రజ్ఞానమని, అహం అని, త్వం, నేను మేను, అంతఃకరణమని అనేక పేర్లతతో ఎరుక వ్యవహరించబడుతున్నది. ఈ నేను నేను అను వ్యహారమునకు అధారమెవ్వడో అతడే ప్రత్యగాత్మ, సర్వేంద్రియ వ్యాపారమునకు నాధార భూతమగు జ్ఞానమేది గలదో అదే నేను.

తత్త్వమసి బ్రహ్మలోని తత్పద లక్ష్యార్థము కూడ శోధించినచో నేత్రము గ్రహించు పదార్థమునకు సూర్యప్రకాశ మాధారమైయున్నది. అట్లే సూర్యుని ప్రకాశింపజేయు స్వయం ప్రకాశవస్తువొకటి గలదు. అదియే చిత్స్వరూపము. అదే పరబ్రహ్మము, ఏ పదార్థమును గుర్తెరిగిన యెడల రెండవ పదార్థము లేకపోవుటచే మరియొక దానిని చూచుట వినుట మొదలగునవి లేకుండునో అదే పరబ్రహ్మము. ఆకాశమున్నది, వాయువున్నదను, మొదలగు వ్యవహారములచే సర్వపదార్థము లున్నవని తెలియబడు సత్ యునికి ఆ బ్రహ్మమునకు స్వరూపము.

ఈ బ్రహ్మము సృష్టికాక మునుపు చలనమనునది లేక నిశ్చల స్థితిలోవుండెను. ఈ స్థితియే బ్రహ్మమునకు తాను తానైన స్థితి, అనగా అప్పుడు తాను తప్ప అన్యము లేదు. ఈ స్థితికే పరబ్రహ్మ స్వరూపమని నిర్ణయము. ఈ పరబ్రహ్మ స్వరూపమే నా స్వరూపము. నేను నా నిజస్వరూపమునుండి చ్యుతి జెందిన స్థితి ఇదే. నేను నేనైన స్థితిలో నేను ఏకంగా యున్నాను. ఈ స్థితిలో నాలో బీజరూపముగా నున్న త్రిగుణముల విజృంభణవల్ల చలనమేర్పడి సృష్టి కామన గలిగి ఏకం అనేకం నైతిని. అప్పుడు నాస్థితిని ఈశ్వరుడనబడును. కనుక నేను సృష్టికి పూర్వము ఉన్న పరబ్రహ్మ స్వరూపమునే అదే నేను నేనైన బ్రహ్మమును.

**4) అహమేవాహం మాంజుహోమి స్వాహా ॥**

అనగా అట్టినేను నన్ను నేను ప్రేల్చుకొనుచున్నాను. అనగా త్యాగముచేయుచున్నాను. అనగా ఎరుక యందలి సర్వవిధములైన అభిమానములను భ్రాంతులను పూర్తిగా విడుచుచున్నారు.

స్వాహా అనగా సంపూర్ణముగా వదలుట. అంటే లేశమాత్రం కూడ మిగుల్చు కోకుండ విడువుమని అర్థము. తల్లివేరు ఛేదించకుండా వృక్షముయొక్క మొదలు నరికినను చెట్టునశించదు. చిదిమిన కొద్ది చిగుర్చుచునే యుండును. అంటే సమూలముగా నరికి పారవేసినను ఆ తల్లివేరు మరల పృథ్వీ సంయోగముచే మరల నాటుకొనకుండ బ్రతుకకుండ చేయవలయును. సృష్టికారణ బ్రహ్మమైన ఆత్మను అనగా బంధములకు అత్యంతమూల కారణమగు అఖండజ్ఞాన స్వరూపమైన సృష్టికారణ బ్రహ్మమునే వదులవలెను. ఏలననగా సృష్టికారణ బ్రహ్మమే సర్వసత్తాంశము, స్వయం ప్రకాశము. దానికి జ్ఞానమే స్వరూప లక్షణము. అయిననూ పరిణామములో అజ్ఞాన స్వరూపమగు ఆవరణ రూపముజెంది అనంతముగా జనన మరణములు పొందుచున్నది. కనుక జ్ఞానమే స్వరూప లక్షణము గల ఆత్మ (నేను నేననే బ్రహ్మము) యొక్క సత్యత్వదృష్టి విశేషముగా నశించిననేగాని, భ్రాంతి రహితముగాదు. జ్ఞానము విడిచిన గాని సర్వభ్రాంతి రహితముగాదు. భ్రాంతి రహిత మిదంమోక్షం" అట్టి భ్రాంతి రహితమునందే శాశ్వతమగు జన్మ రాహిత్యము.

సర్వభ్రాంతిరహిత మెట్లగును. చలచలా ద్వంద్వ లక్షణములుగల నేను నేనైన బ్రహ్మము, దాని కార్యములగు మనఃప్రాణములు సర్వజగత్తును తోచుచున్నను పరిపూర్ణ పరబ్రహ్మము నందు లేనే లేవనే దృఢ నిశ్చయముగలుగుట ద్వారా సర్వభ్రాంతి రహితమగును. ఇట్లు తనను తాను ప్రేల్చు కొనవలయును లేదా భ్రాంతిని వదలవలెను.

# 11 ఎ ఎరుక

**సదేవసోమ్యేదమ్ అగ్ర ఆసీత్ ॥ ఛాందో॥ 6-2-1**

తా॥ సృష్టికి పూర్వము సత్పదార్థముండెను. అద్వైత పద్ధతి యందు బ్రహ్మము త్రికాలా బాధ్యమని, సత్పదార్థమని కొనియాడబడింది. కాని కాల త్రయమందు అది ఒక తీరుగా లేదు. అదెట్లో పరిశీలింతము.

1) "సృష్టికి పూర్వం **"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్॥"** సృష్టికి పూర్వము ఆ బ్రహ్మము సత్ పదార్థముగానుండెను.

2) అనంతరము **"సో<u>೭</u> కామయత బహుస్యాం ప్రజాయేయేతి"** ఆ బ్రహ్మమే అనేకం కావలెనని కోరెను. అట్లు కోరి ఏకం అనేకం భవతి. ఆ ఒక్కటే అనేక మాయెను.

3) **"తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్"** పిమ్మట తానే అందు అనుప్రవేశము జేసెను. ఆ బ్రహ్మమే తనశక్తులచే సర్వమును నియమించు చున్నాడు. సర్వ నియంతగానున్నాడు. అన్నిటికి కర్తఅయ్యి అకర్తగా అంటే సాక్షిగాను కూడ ఆ బ్రహ్మమే యంటున్నాడు.

4) పిదప లీలను ముగించు కొని సర్వం తనలోనికి ఉపసంహరించు కొంటుంది. కనుక సృష్టి పూర్వమొక రీతిగా అనంతరము మరొక రీతిగా చివర మరొక రీతిగా వివిధ నామ రూపక్రియాత్మకముగా నున్నది. కనుక ఈ బ్రహ్మమును కాలత్రయాబాధ్యమనరాదు.

కాలత్రయములందు మాత్రమేగాక కాలమునకు పూర్వోత్తరమధ్యకాల మందున్నూ యెట్టి మార్పులెరుంగని పరిపూర్ణపరబ్రహ్మమొక్కటియే కాలమును మీరినదనుట చేత కాలాతీతమనదగియున్నది. తాను తానైన స్థితిలో మాత్రమే ఈ బ్రహ్మమును సత్పదార్థముగా జెప్పుదురు.

బి) **అసద్వాయిదమగ్ర అసీత్ – <u>తైత్తిరీయ</u> ॥**

తా॥ సృష్టికి పూర్వము అసత్ పదార్థమే యుండెను.

ఇంతకు ముందు శ్రుతి సృష్టికిపూర్వం సత్పదార్థమే యుండెనని వక్కాణించగా ఈ <u>తైత్తిరి</u>యోపనిషత్తు సృష్టికి పూర్వము అసత్ పదార్థమే యుండేనని జెప్పుచున్నది. అసత్ అనగా సత్తుకానిది అసత్ అన్నమాట. దానినే శూన్యమన్నారు. ఆ శూన్యమును గుర్తించేవానిని సత్ అన్నారు. ఏలననగా సద్రూపమైన పూర్ణమున్ను అసద్రూపమైన శూన్యమున్ను సాక్షిభాస్యములు. ఎరుకకు గోచరములై ఎరుకచేత సేవింపదగినవైయున్నవి. ఐతే సత్పదార్థము మూడు కాలములందు వున్నదంటే ఏకాలమందు లేక పోయిన అది అసత్ శబ్దార్థము లోనికే రాగలదు. కాలములు మూడింటి యందూ కూడా లేనిదేదో అది మాత్రమే అసత్తని చెప్పరాదు. ఏలననగా అట్లు చెప్పినచో అసత్ అనునద కుందేటి కొమ్మువంటి కేవల అలీక పదార్థమే కాగలదు. సదసత్తులు రెండూ ఎరుకనే. ఎరుకలేనే లేదు. పుట్టనేలేదని పరపూర్ణబావజ్ఞులు అందురు. అప్పుడు సద్రూపమగు యెరుక అలీక పదార్థమగుట లేదా ! అనుశంక పరిపూర్ణబోధ సమగ్రముగా నెరుగని వారిమాట మాత్రమే. పరిపూర్ణపరబాహ్మమునందు ఎరుక లేనే లేదు. దానికి ఎరుక పుట్టనే లేదు అను నిజార్థము నెరుగని వారి మాట మాత్రమే. <u>యెరుక యందు ఎరుక సత్యమే.</u>

మృద్ఘటమును దృష్టాంతముగా గైకొనవచ్చును. ఘటోత్పత్తికిపూర్వము, ఉత్పత్తి సమకాలమున, ఘటనిర్మాణం పూర్తి అయిన తర్వాత ఘటానంతరము కూడా మట్టి మరియు అందలి ఘటాకారశక్తి యుండియే యున్నది. కనుక మట్టి మరియు ఘటాకారశక్తిన్ని సద్రూపములు. ఘటము యొక్క నామరూపములు ఒక దశలో నుండి ఒక దశలో లేవు గనుక అవి అసద్రూపములు. కనుక మృద్ఘటము సద్రూపమని అనాలి గాని కేవలం, సద్రూపముగాని, కేవలం అసద్రూపముగాని అనరాదు. ఘటాకారశక్తి, సద్రూపము. ఘటము యొక్క నామరూపములు అసద్రూపములు.

సదేవ సోమ్యేద ఉ మగ్ర అసీత్" అన్నశ్రుతి సత్తే సృష్టికి కారణమంటున్నది. "అసద్వాయి దమగ్ర ఆసీత్" అను శ్రుతి సృష్టికి పూర్వము అసత్ పదార్థమే యుండేనని నంటున్నది. ఈ శ్రుతులలో దేనిని పరిత్యంచరాదు. రెండూ సమాన ప్రతిపత్తిగల్గినవే. రెంటికి పూర్వపక్షములున్నవి. అసత్తునుండి సత్తు ఎట్లుపుట్టును? ఇసుకనుండి తైలము తీయగలమా? అట్లే సత్తులేని అసత్తు ఎట్లు పుట్టును అని శంక కల్గును. కాని ఇసుకలో మొలచిన నూవ్వుల చెట్టున పండి నువ్వుల నుండి తైలమును తీయవచ్చును కదా! అసద్గర్భమందు సత్తున్నందుననే అసత్తున రూపము చెందిన అనుటలో అభ్యంతము ఏమి? సత్తె జగత్కారమను మాటకు సత్తునుండి సత్తు పుట్టినదనరాదు. రెండు సత్తే కదా! ఇక పుట్టుట ఏమి అని కొందరు శంకింతురు. కార్యమందలి లక్షణములు కారణమందు ఉండి తీరవలెననే సిద్ధాంతమును పురస్కరించుకొని సత్తే జగత్కారణమని శ్రుతి చెప్పినది అని అనుకొంటే సరిపోతుంది. సదసత్తులు కారణ కార్యములుగా భావించక ఒక దాని యందు ఒకటి గర్భీకృతముగా నున్నవని, అవి భిన్న వస్తువులు కావనీ, ద్వంద్వరూప ఏకమని గ్రహించవలయును.

**"అసన్నేవ సభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్ "** అసత్తే బ్రహ్మమనే వారు శూన్య స్థితిని పొందుతారని, సత్తే బ్రహ్మమనే వారు పూర్ణస్థితిని పొందుతారని శ్రుతులు చెప్పుచున్నవి. కాని ఏ రూపం పొందిన ఏమి బాధలేదు. ఏలననగా స్వభావంచేత అసత్తు సత్తుగను. సత్తు అసత్తుగాను మార్పుచెందే లక్షణమున్నప్పుడు ఏరూపు చెందినా ఒక్కటే.

**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చా హమర్జున ॥భ.గీ॥ 9-19**

తా॥ అర్జునా సమస్త ప్రాణికోట్లకు ఏది మూలకారణమై యున్నదో అది నేనే అయియున్నాను. వేయేల స్థావర జంగమాత్మకమైన వస్తువు నేదియు నన్ను వినాగా లేనే లేదు.

పై విధంగా భగవానుడు అర్జునునికి చెప్పియున్నాడు. ఇందు అధిష్ఠానమగు పరమాత్మ జగత్తు కంటే వేరుగాదు. అంటే పరమాత్మనే జగత్తుగా మారినాడు. ఆ పరమాత్మ సృష్టి కామన కలుగక పూర్వం అచలస్థితిలోనున్నప్పుడు అంటే తాను తానైన స్థితిలో అమృత స్వరూపుడు. అట్టి అమృతం స్వరూపమునుండి చ్యుతి జెంది జీవేశ్వర జగత్తు రూపము వహించినాడు. ఈ జగద్రూప మంత మృత స్వరూపము అంటే ఒక స్థితియందే దీర్ఘకాలము వరకు వుండక అనేక మార్పులకు గురియగుచున్నది. తాను తానైన స్థితిలో మాత్రమే పరమాత్మ సద్రూపముగాని తర్వాత క్షణక్షణమూ మారుతున్న ఈ విరాట్స్వరూపము ధరించినపుడు ఆ పరమాత్ముడే అసద్రూపుడని పిలువబడుచున్నాడు. పై వివరణను పరిశీలించిన శ్లోక పంక్తిని బట్టి పరమాత్ముడు అమృత స్వరూపుడు మరియు మృత స్వరూపుడుగా మారుతున్నాడు. అట్టి సద సదూప్రములు గలిగి యున్నాడంటే ద్వంద్వ స్వరూపముగానున్నాడు. సర్వద్వంద్వములు లేనివే కనుక ఎరుకరూప పరమాత్మను వదలిననే గాని పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షము గాదు.

# 11. పరిపూర్ణ పరబ్రహ్మము

(ఎ) నాసదాసీన్నో సదా సీత్తదానీం। నాసీద్రజో నోవ్యోమోప రోయత్ ।
కిమావరీవః కుహకస్య శర్మన్ అంభః కీమాసీద్గహనం గంభీరం॥

-ఋగ్వేదం 10 మండలం 129 సూక్తం,

తా॥ సృష్టికి పూర్వం సదసత్తులు లేవు అంతరిక్షాకాశములు లేవు. అప్పుడు దేనిని, ఎవరు, ఎక్కడ, ఎవరి సుఖము కొరకు ఆవరించిరి ? గహనం గంభీరం అయిన అంభస్సుమాత్రం అప్పుడేడెక్కడ యుండెను ?

ఈ మంత్రము పరిపూర్ణపరబ్రహ్మను గూర్చి వివరిస్తుంది. సత్తు అనగా మూడు కాలాలలో మార్పు లేనిది. కూటస్థ బ్రహ్మము అసత్తు. అనగా అనాత్మ లేక జీవేశ్వర జగత్తు-కూటస్థ వ్యాపకం పరమాత్మ సదసద్రూపుడు. దీనికి అన్యంగా లేక అతీతంగా నున్నది సదసద్రహితమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. ఇది అంభస్సు రూపమగు పరమాత్మా తీతమైనది. ఇందు గహనమైన గంభీరమైన అంభోతత్వం (జలరాశి) ఉందా? అంతరిక్షములేదు. ఆకాశములేదు. అట్టి స్థితిలో యున్నది. సర్వలక్షణ విలక్షణమైన పరిపూర్ణ పరబ్రహ్మమే. అంభో తత్వమే పరమాత్మతత్వము (పరమాత్మ) స్వీయశక్తియగు త్రిగుణాత్మక ప్రకృతి ద్వారా కాలాన్ని స్థలాన్ని సృష్టించి సాలెపురుగువలె (ఊర్ణనాభి) తననాభి యందుత్పన్నమైన దారముచే ఆవరణరూపమగు గూడు నిర్మించి నటుల అందులో తన ఆవరణ రూపంలో పూర్ణంగా వ్యాపించి యున్నాడు. ఈ **"ఆవరణము నాకసము నిరావరణము అచల మనుచు అనిరి మహాత్ముల్"** అని కృష్ణదేశికేంద్రుల వారు పలికి యున్నారు. మంత్రములో చెప్పినవన్నీ లేనప్పుడు పరిపూర్ణ పరబ్రహ్మమే ఉన్నది.

**11 బి)** నసత్తాన్నా సదుచ్యతే ॥భ.గీ.॥

అది బ్రహ్మము సత్తుగాగాని, అసత్తుగా చెప్పుటకు వీలు లేనిది అనగా సదసద్రహితమైనదే పరిపూర్ణ పరబ్రహ్మము.

సత్ అనగా శ్రుతి, "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అనే న్యాయమున బ్రహ్మము సత్యమైనది, జ్ఞానమైనది మరియు అనంతమైనది అని నిర్ణయము.

బ్రహ్మ కాలత్రయా బాధ్యమై యుండుటవల్ల అనగా మూడు కాలములలో ఏలాంటి మార్పులేనిదగుట వలన సత్ అనబడును.

ఒక దానిచే తెలియబడక, ఇతర సహాయము లేక సర్వమును తెలుసుకొనుచు దీపంవలె స్వయంగా ప్రకాశించుట వల్ల జ్ఞానమనబడును.

దేశకాల వస్తుపరిచ్ఛేదము లేకుండుట వల్ల యనంతమనబడును.

బ్రహ్మము తనయందు మాయచే కల్పించబడిన ఉపాధులలో నుండుటచే బ్రహ్మము కూటస్థుడని ప్రత్యగాత్మయని పేరు.

కూటస్థుడైన స్థూల సూక్ష్మ శరీరములకు అధిష్ఠానమై యుండుటచే బ్రహ్మము కూటస్థుడనబడెను. వాస్తవమున కూటస్థుడు బ్రహ్మమే. కావున బ్రహ్మ లక్షణములైన సత్య జ్ఞాన యనంతములు కలిగి యున్నాడు.

ఇట్లు గలిగి యుండుట వల్ల జాగ్రత్,స్వప్న, సుషుప్తుల యందు అనుభవమున తెలియదగును. ఆ అవస్థలయందు దృశ్యములు సత్యములై యున్నవి, వానిని నేరుగా సంవిత్తు (తెలివి) సత్యజ్ఞానమంతమైయున్నది. ఆతెలివియే కూటస్థ చైతన్యము కావున దేశకాలవస్తు పరిచ్ఛేదములు లేక సత్య జ్ఞానానందము బ్రహ్మము గనుక కాలత్రయా బాధ్యమగుట వల్ల సత్ అనబడును.

అసత్ అనగా శ్రుతి ॥ "సర్వం వికారాజాతం మాయా మాత్రం" భేదత్రయముగానిది కాని దానికి వ్యతిరేకమైన నామ రూపములతో గూడిన జగత్తంతయు యింద్రజాలము వంటిదిగాని వాస్తవము గాదు "యామాసా మాయా" యేది లేనిదో అది మాయ అని మాయకు శబ్దార్ధము. కనుక బ్రహ్మము కన్న వ్యతిరేకమైనది మిథ్య అని అసత్తని నిర్ణయము.

ఈ ఉభయ పద్ధతులవల్ల జన్మభ్రాంతి రహితమునకు బదులు అనేక జన్మంబులు కలుగుటకు కారణమగుచున్నది. వాటి రహితమందే జన్మభ్రాంతి తొలగును. అందుకే శ్రీకృష్ణదేశికేంద్రుల వారు క.ద. 7॥ **శీమత్సీతారామస్వామి కృపన్ జెప్పనయ్యె॥ సదసద్రహితం బేమి పదార్థమోదానిని యీ॥మహి కందార్థములుగా నివి వినరయ్యా॥ ఓజనులారా యిటుగనరయ్యా॥**

తా॥ శ్రీమత్సీతారామస్వామి వారి కృపవల్ల జెప్పినట్టి అచల పరిపూర్ణ బోధ సదసద్రహితమైనది. ఆ బోధ భావమును కందార్థములుగా ఈ మహిలో చాటినాను. కనుక జనులారా! ఈ మార్గమును గమనించి చూడ వలసిందని వేడుకొనుచున్నాడు.

పై వివరములను బట్టి తేలినది యేమనగా పరిపూర్ణ పరబ్రహ్మ సదసద్రహితమైనది.

**సి) అన్యత్ర ధర్మాత్, అన్యత్రాం ఽ ధర్మాదన్యత్రా స్మాత్కృతా కృతాత్,**
**అన్యత్ర భూతనచ్చ భవ్యా చ్ఛయత్త త్పశ్యతి తద్వద ॥ కఠో॥ 2-14)**

తా॥ ధర్మాధర్మముల కంటెను, చేయబడిన సృష్టికంటెను, చేయబడని సృష్టి కంటెను, చేయబడిన సృష్టికారణమగు వస్తువు కంటెను, భూతాది కాల త్రయము కంటెను వేరైనట్టియు అతీతమైనట్టియు దానిని నీవెరుగుదువు. అట్టి బోధను నాకెరింగింపుము.

**1. ధర్మాధర్మముల కంటెను వేరైనట్టిది.**

ధర్మాధర్మమునకు "ధార్యతేయితి ధర్మః" అనే నిర్వచనము ప్రకారము ఏది ధరించి భరించునో అది ధర్మము. సృష్టి స్థితి లయములన్నిటికి అత్యంత మూలకారణమైనది పరమాత్మ(కారణబ్రహ్మము). కనుక పరమాత్మయే శబ్దవాచ్యుడు. ఏ యే నియమములకు లోబడి ఈ విశ్వము నడుచుచున్నదో అవి అన్నియు ధర్మములే. ఆ ధర్మములకు లోబడి ఆ పరమాత్మ ఈ విశ్వమును పాలిస్తున్నాడు. మానవుడు యేది ధర్మమో యేది అధర్మమో, గుర్తెరిగి నడువవలసియున్నది. అట్లు ఎందుకు ధర్మపద్ధతిగా నడువవలెనంటే **"ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ"** అనగా తనయొక్క మోక్షము కొరకు లోక హితార్థము చెప్పబడినది. **"ధర్మో రక్షితి రక్షతః "** ధర్మాచరణతో ధర్మమును రక్షించినచో ధర్మమాతని రక్షించును. ధర్మములకు విరుద్ధముగా నడుచుట అధర్మము.

ధర్మాధర్మనిర్ణయము చేయునది ఈ గుర్తెరిగే శరీరమే. అదే ఎరుక. ధర్మాధర్మముల నిర్ణయించి ధర్మములను గుర్తెరిగి ఆచరించుట, మరొకటి అధర్మమని మానుట యెరుక క్రియలే, **కావున గుర్తెరిగే శరీరమునే విడువుమని ఆదేశించి నట్లగును.** ధర్మమనగా ఆత్మ, అధర్మమనగా అనాత్మ ఈ అర్థములో అధర్మమనగా అనాత్మయని అర్థము స్వీకరించవలసి యున్నది. అప్పుడు ఆత్మను అనాత్మలను యెరుక మరుపులను వదలివేయమని చెప్పినట్లే అగును. ధర్మాధర్మములు సాపేక్షికములు. కనుక మిథ్య.అంటే ఆత్మానాత్మలు ద్వంద్వములు మరియు వైశేషికములు ఆత్మను కూడ వస్తుకోటిలో చేర్చినారు గనుక అందేది పరిపూర్ణపరబ్రహ్మము కాదు. పరిపూర్ణ పరబ్రహ్మము నిరపేక్షికము నిర్ద్వంద్వము ఏకానేకములు గానిది, ఏమని నోటితో అనరానిది కనుక అది ధర్మాధర్మమును మీరినది మరియు అతీతమైనది.

**1. చేయబడిన సృష్టి కంటెను అతీతమైనది.**

పరిపూర్ణాచల సిద్ధాంతమున సృష్టి విధానమెట్లో తెలుసుకుందాము. వీరు **"తస్మాద్వా, ఏ తస్మాదాత్మన ఆకాశ్శస్సంభూతః। ఆకాశాద్వాయుః వా యోరగ్ని అగ్ని రాపః అద్భ్యః పృధ్వీ...."** అనేశ్రుతిని అంగీకరించినారు "ఆకాశశ్శరీరం బ్రహ్మరీతిగా ఆకాశమే శరీరము గల ఆత్మనుంచి వాయ్వాదులు కలిగి సమస్త బ్రహ్మాండ పిండాండములు కలిగినవి. ఈ భావమునే శ్రీకృష్ణ దేశికులు **"ఆకాశాధిక భూతా నీకాత్మకమగు ఎరుక యీ జగమయ్యెన్"** అనీ, **"ఎరుకైన భూతముల నీవెరుగుము ఆకసము గాద్పు యింగలమును నీళ్ళి రవందనేల యని। నేనెరిగిన పద్ధతిని నీ। కెరింగిచినానూ ముజ్జగములయ్యెను వీట్లతోను"** అని అన్నారు. మరియు **"ఎరుకైన భూత పంచక మెరుకకు చరణములు కటియ హృదయము గళమున్ శిరమును నయ్యెను క్రమమున ధరణిమొదల్ జేసి యిట్లు తనయాగుర్తెరుగూ"** అన్నారు. పంచ భూత పరిణామము చెందిన ఎరుకకు అనగా విశుద్ధచేతనమునకు ఆ పంచభూతములు పృథ్విపాదములు, జలము కటి, అగ్నిహృదయము, వాయువు కంఠము, ఆకాశము శిరోభాగముగానూ అయి విరాట్ పురుషుని స్థూలదేహమాయెను. ఆకాశమే శరీరము గల పురుషుడే సృష్టికి కారణము ఆ ఆకాశము పురుషుని యొక్క దేహమే గనుక దేహీదేహముగా నున్న ఆపురుషుడు (ఊర్ణనాభి సాలెపురుగు) వలె జగద్రచనగావించు చున్నాడు. ఆకాశాధికము అనగా కూటస్థుడు పంచ భూతములు కలసి షట్కోశముల రూపము చెంది ఎరుకే ఈజగమయ్యెను. కనుక ఈ విధముగా చేయబడిన సృష్టికంటె అతీతమైయున్నదానిని నీ వెరుగుదువు. అట్టి బోధను నా కెరింగుపుము.

## 2. చేయబడని సృష్టి కంటెను

2. చేయబడని సృష్టి అంటే బ్రహ్మము తాను తానైన పరిస్థితి. అప్పటి కింకా సృష్టి జరుగలేదు గాని సృష్టి కలుగుటకు వలయు సృష్టి బీజములన్ని ఆ బ్రహ్మము నందు నిక్షిప్తమైయుండి నిద్రాణావస్థ యందున్నవి. అంటే వాటి యందు ఇంకా చలనస్థితి లేదు. చలనము కలుగుటకు వలయు పరిస్థితులు కలుగలేదు. కనుక సృష్టి చేయవలయు ననెడి సంకల్పము కలుగ లేదు. కనుక ఆస్థితి చేయబడనిసృష్టి. ఇట్టి చేయబడని సృష్టి కంటెను అతీతమైనది పరిపూర్ణ పరబ్రహ్మము.

**3. చేయబడని సృష్టికారణమగు వస్తువు కంటెను.**

చేయబడని సృష్టికారణ వస్తువు పర బ్రహ్మము స్వయంభూః లేక సచ్చిదానంద బ్రహ్మము. ఈ పర బ్రహ్మమునకు మూలము లేదు. ఇదే ఎరుక. ఎరుకకు మూలము ఎరుకనే గాని దానికి మరొకటి మూలం లేదు. కనుక ఈ ఎరుక బ్రహ్మము కృతకముగాదు. అనగా చేయబడనిది. మరి కారణ వస్తువు ఎట్లయినది? అంటే ఈ ఎరుక నుండే జీవేశ్వర జగత్తు జరిగినది. ఈ జగత్తుచేయబడినది కృతకము. ఈ జగత్తు (కార్యము) దేనినుండి అయినదో అది కారణము అంటే చేయబడని సృష్టికారణ వస్తువు ఎరుక బ్రహ్మమే పరబ్రహ్మము. ఈ ఎరుక బ్రహ్మమునకు అతీతమైనదే పరిపూర్ణపరబ్రహ్మము.

4. **భూతాదికాలత్రయము కంటే వేరైనట్టియు అతీతమైనదియగు దానిని నీవెరుగుదువు.** అట్టి బోధను నాకెరిగించుము అని నచికేతుడు యమధర్మరాజుతో పరిపూర్ణ పరబ్రహ్మమును నీవెరుగుదువు. అది భూతాది కాలత్రయముల కంటే వేరైనట్టిది అతీతమైనది.

**భూతాది కాలత్రయముల కంటే అతీతమైనది.**

కాలములు మూడు విధములు. భూత, వర్తమాన, భవిష్యత్కాలములు. కాలమే కారణమను వాదులు వైశేషిక దర్శనులు. ఇది **శైయ్యాయికుల వాదమును అంగీకరించును.** కాలము లేనిదే ఏ కార్యము జరుగదంటారు. విత్తనములు మొలుచుట, మొలచినవి ఫలించుట కాలానుసారముగనే జరుగుచున్నది. కనుక కాలము కారణ మంటారు. అయితే కాలమునకు స్వతంత్ర సత్తాగాని యునికి గాని లేదు. స్వయం సమర్థత కాజాలదు. ఒక సంఘటన అంటూ వుంటే దాని దృష్ట్యా దానికి పూర్వము భూతకాలము ఆసంఘటన యనంతరము భవిషత్కాలమని, ఆ సంఘటన జరుగుకాలము వర్తమానకాలమని అనజెల్లును. సృష్టియే ఆ సంఘటన గనుక సృష్టికి పూర్వకాలము సృష్టికాలము సృష్టియనంతరకాలము అని అనదగును. అందు చేత కాలము సృష్టితో పాటు యుత్పత్తి యగుచున్నది. కనుక కాలము దేనికి పరమ కారణము కాజాలదు.

త్రికాలములు సంఘటనల మార్పువల్ల కలుగుచున్నవి. మార్పు చెందేది మాయా, లేనిది కనుక మార్పులేనిది ఏకమైనది స్థిరమైనది, సర్వలక్షణ విలక్షణమైన పరిపూర్ణ పరబ్రహ్మము ఈ కాలములకు వేరైనది, అతీతమైనది. కావునా అట్టి అతీత బోధయైన పరిపూర్ణ ప్రబోధను నా కుపదేశించుమని యమధర్మరాజును నచికేతుడు కోరెను.

అద్వైతపద్ధతియందు బ్రహ్మమునకు సృష్టి స్థితిలయములు తటస్థలక్షణములుగా జెప్పబడినవి. కాలము కూడ యీతటస్థలక్షణముతో జతపడియున్నది. అంతే గాని కాలమనేది ఆస్తి సిద్ధపదార్థమే కాదు కేవలం భాతి సిద్ధ పదార్థమే. సూర్యాది గ్రహగతి భేదముచే వాతావరణము నందు వచ్చే మార్పుల మధ్య నుండే వ్యవధికి వేసవికాలము, వర్షకాలము, శీతాకాలము అని పేర్లుపెట్టబడినది. మరియు భూత భవిష్యత్ వర్తమా కాలములుగా కాలము విభజింపబడింది. నిజంగా వర్తమాన కాలము అనే దాని

కాలపరిమితి ఒక లిప్తకాలము కూడ యుండదు. ఎందుకనగా మరుక్షణంలోనే అది భూతకాములో చేరి పోవుచున్నది. ఏది ఏమైనను కాల త్రయము నిర్ణయమైనాయి. ఈ కాలత్రయములందే గాక కాలమునకు పూర్వోత్తరమధ్య కాలముల యందు ఎట్టి మార్పు లెరుంగక పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటియే కాలమును మీరినది అగుట చేతను కాల నిర్ణయమే లేనిదగుట చేతను కాలాతీతమని యనదగును. అట్టి బోధ నీకు తెలుసును. దానిని నాకు ప్రసాదించుము అని నచికేతుడు యమధర్మరాజును ప్రార్థించెను.

# 12) ఎరుక

| ఏషసర్వేశ్వర, ఏష ర్వజ్ఞ, ఏషోంతర్యామేషయోనిః ।<br>సర్వస్య ప్రభవాస్యయోహి భూతానాం ॥ |
|---|

అతడు సర్వమునకు ప్రభువు; సర్వజ్ఞత్వలక్షణములు గలవాడు. సకల జీవుల హృదయములను అంతర్యామి రూపంగా యున్నాడు. సకల భూతముల యుత్పత్తికి అతడు యోని స్వరూపుడు.

జ్ఞానము, వైరాగ్య, ఐశ్వర్య, యశస్సు, సంపద, ఆత్మయను వీనితో గూడు కొనుట వల్ల షడ్గుణైశ్వర్యయుక్తుండగు భగవానుడు సృష్టికర్త, సర్వమునకు అనగా జీవేశ్వర జగత్తు కంతటికి ప్రభువు.

**య యేకో జాలవాన్ ఈశత ఈశనీభిః, సర్వాన్ లోకానీశత యీశనీభిః,**
**యఏవైక ఉద్భవే సంభవే చ, యయే తద్విదు రమృతాస్తే భవన్తి॥**
*(శ్వేతా 3. 1.వ మంత్రం॥)*

తా॥ ఆ బ్రహ్మమే తనశక్తులచే సర్వమును నియమించుచున్నాడు. సృష్టి స్థితి లయములు చేయుచున్నాడు. "**భీషాస్మాద్వాతః పవతి, భీషోదేతి సూర్యః భీషాస్మాదింద్రశ్చాగ్నిశ్చ, మృత్యుర్ధావతి పంచమాః,**" సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, వాయువు మృత్యువులు భయముచే అతని ఆజ్ఞకు లోబడి వర్తిస్తున్నాయి. ఇట్లు సర్వనియంతగా వర్తించు చుండియు, **తస్యకర్తారమసి విధ్యకర్తారమవ్య**" (గీత) యిన్నింటికి కర్తయయ్యియు అకర్త అనగా కేవలం సాక్షిగా కూడ ఆ బ్రహ్మమేయుంటూ యున్నది. పిదప లీలను ముగించుకొని సర్వమును తనలోనికి ఉపసంహరించుకొంటుంది. కనుక సృష్టికర్త బ్రహ్మము సర్వమునకు ప్రభువు అనగా జీవేశ్వర జగత్తునకు ప్రభువుగానున్నాడు.

**సకల భూతముల యుత్పత్తికి అతడు యోని స్వరూపుడు.**

వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత షడ్దర్శనములు, వివిధ వాదములు పురాణములు, బ్రహ్మసూత్రములన్నీ సృష్టి కత్యంత మూలకారణం బ్రహ్మమేనని తేల్చిచెప్పినవని ముండకోపనిషత్తు – ప్రథమ ముండకము ఆరవ మంత్రం.

**యత్ తదద్రేశ్య మాగాహ్యా మగోత్ర మవర్ణ ।**
**మచక్షుఃశ్శోత్రం తదపాణి పాదం । నిత్యం విభుం**
**సర్వగతం సుసూక్ష్మం। త దవ్యయంయా యద్భూత**
**యోనిం పరిపశ్యంతి ధీరాః ॥**

తా॥ జ్ఞానకర్మేంద్రియములచే తెలియ బడునది, వర్ణమూ గోత్రము లేనిది, అంతట వ్యాపించినది. అత్యంత సూక్ష్మమైనది. నాశనములేని శాశ్వత వస్తువును సకల భూతములకు యోని రూపంగా యున్నది ఏదో దానిని పండితులు చక్కగా చూచుచున్నారు. ఇచ్చట గల భూతయోని అనగా మూల ప్రకృతియా? లేక బ్రహ్మమా? అనుసంశయమునకు వ్యాసుడు బ్రహ్మసూత్రములలో (అదృశ్యత్వాధికరణం) "అదృశ్యత్వాది గుణ కోధరోక్తేః" "విశేషణభేదవ్యపదేశాభ్యాం చనేతరౌ" అను సూత్రములచే బ్రహ్మమే భూతయోని అని సిద్ధాంతము చేసెను. నిర్గుణ సద్గుణ స్వరూపములుగా నుండిన బ్రహ్మమే భూతయోని.

బ్రహ్మసూత్రము 1-4-27 **"యోనిశ్చహిగీయతే"** బ్రహ్మమే జగదుపాదానమని వేదమునందు గానము చేయబడుచున్నది.

ఇక భగవద్గీత యందు పలుచోట్ల తనకు తానే తన మహిమచేతనే అవసరాను సారంగా అవతరిస్తున్నానని, సర్వమునకు తానే బీజ స్వరూపుడనని, ప్రకృతిని అధిష్ఠించి సర్వమును సృష్టించుచుండునని గీతాచార్యుడు పలుచోట్లచెప్పియున్నాడు

**1. బీజం మాం సర్వభూతానాం విద్ధిపార్థ సనాతనమ్ । 7-10**

**2. సర్వయోనిషు కౌన్తేయ మూర్త యస్సమ్భవన్తి యాః**
**తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥ 14-4**

తా॥ సమస్త జాతులందును ఏశరీరములు పుట్టు చున్నవో వానికి మూలప్రకృతియే కారణము. కనుక బ్రహ్మము సగుణ స్వరూపమై, జీవజగత్తుల సృష్టికి హేతువగుచున్నది. కనుక సకల భూతముల ఉత్పత్తికి అతడు యోని స్వరూపుడు.

## 12 పరిపూర్ణపరబ్రహ్మము.

| ఎ) | సాహివాచామ గమ్యత్వా దసత్తామివ శాశ్వతీం ।<br>వైరాత్మ్య సిద్ధాంత దశామువ యాతేవ శిష్యతే॥ ॥సన్యాస॥ |
|---|---|

మనోవాక్కులకు అగమ్యమైన యా పరిపూర్ణపరబ్రహ్మము శాశ్వతము గలదై దాని యందు ఆత్మగలదని చెప్పుటకు వీలు లేనిదై అసద్రూపమువలె(శూన్యము) ఉన్నను చివరకు మిగిలియుండునది అదియొక్కటే.

పరిపూర్ణ పరబ్రహ్మము మనోవాక్కులకు అగమ్యమైనది. అనగా మనస్సు మరియు వాక్కుకు అందదు. ఈ భావమునే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు తమః 34వ కందార్థ దర్పనందు స్పష్టపరచిన విధమును చూద్దాం.

**34. క.ద॥ పలుకున బలుకగ రాకను ! తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్"** అని సెలవిచ్చి యున్నారు. అనగా పరిపూర్ణ పరబయలు వాచ్య వాచ్యార్థములకు అందునట్టిది గాదు. లక్ష్యలక్ష్యార్థముగా మదిలో దానిని తలపోయదమనిన మనసుకు సాధ్యము గాదు. అనగా మనసుకు తగులదు. అది స్థిరముగా నున్నది శాశ్వతమైనది.

ఈ భావమును బలపరిచే అనేక శ్రుతులు.

**1. "అన్యదేవ తద్విదితాదథో అవిది తాదధి" - కేనోపనిషత్తు**

తా॥ నిశ్చయముగా అదితెలిసిన దానికంటెను భిన్నమైనది. ఆపైన తెలియని దాని కంటెను వేరైనది, అతీతమైనది.

2. **యత్ వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥ కే.న 1-5**

తా॥ ఏది వాక్కుద్వారా వ్యక్తపరచ జాలదో అది మాత్రమే బ్రహ్మము అనగా పరబయలు.

3. **యన్మనసా న మనుతే యేనాహుర్మనోమతమ్ ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాస్మతే ॥ కేనోపనిషత్తు ॥ (1-6)**

మనస్సు చేత గ్రహింప శక్యం కానిది మాత్రమే పరిపూర్ణ పరబ్రహ్మము అని నీవు తెలుసుకో. దేని సహాయము చేత, మనస్సు గ్రహించబడుచున్నదో, జనులు ఇక్కడ పూజించేది బ్రహ్మముకాదు.

**శాశ్వతమైనది:** పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది. నిత్యమైనది, త్రికాలాబాధ్యమైనది. ఈ భావమును స్పష్టపరుచుచు శ్రీకృష్ణదేశికేంద్రుల వారు ఇట్లు గానము చేసియున్నారు. క.ద. 61 **"బయలని నిత్య వస్తువు"** అనగా బయలు నిత్య వస్తువనగా శాశ్వత మైనది. త్రికాలాబాధ్యమైనది. మూడుకాలాలో ఎట్టి మార్పు ఎరుగనిది, స్థిరమైనది. అట్లే 77 వ.క.ద. **నీ తండ్రి జనిన మీదట। నీతనయుడు రాకమునుపు ।నీవున్నపుడున్। యేతత్త్వమంతటగల । దాతత్త్వము నరసి మృషని తలపుము మిమ్మున్ ॥**

తా॥ నీ తండ్రి చనిపోయినపుడు, నీకుమారులు కలగక ముందు, నీవు వున్నప్పుడు ఏ అచల పరిపూర్ణ పరబయలు అంతట నిండి యున్నదో దానిని సద్గురు మూర్తి అనుగ్రహము వలన తెలసి నిన్ను సకల ఆనందములు అశాశ్వతములని విడువుమని సెలవిచ్చియున్నారంటే పరిపూర్ణము ఎల్లప్పుడు భూత, భవిష్యత్, వర్తమానకాలము లందు ఎట్టి మార్పు లేక యున్నదని భావము.

**దానియందు ఆత్మలేనిదని చెప్పుటకు వీలులేనిదై అసద్రూపము (శూన్యము) వలె యున్నను మిగిలి యుండునది అది యొక్కటే.**

పరిపూర్ణ పరబ్రహ్మమునందు కారణబ్రహ్మము లేక ఆత్మలేదు. ఆ మాటకొస్తే సమస్తము బ్రహ్మమే. "సర్వంఖల్విదం బ్రహ్మ" అను ఎరుక బ్రహ్మములేదంటే అందు ఏ వస్తువు లేదనియే చెప్పవలెను. క్రింది పద్యములను పరిశీలింతము.

క.ప. 86॥ **"బ్రహ్మందు కలిగిన । బ్రహ్మనునేననెడి మాయ ప్రబలె జగంబై। బ్రహ్మను గని తానేగుటె । బ్రహ్మననే మాయకు పని । బ్రహ్మందు జుమీ ।"** అని సెలవిచ్చియున్నారు.

అచల పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనటువంటి అహం బ్రహ్మమును ఎరుక జగత్తు రూపముగా ప్రబలి యున్నది. గనుక అచల పరిపూర్ణ పరబ్రహ్మను తెలుసుకొని దానియందు లేననే నిశ్చయమున తాను లేక పోవడమే **అచల పరిపూర్ణము నందు లేని ఎరుక పని.** అనగా ఎరుక ఆచరించు విధానము. ఈ పద్ధతి ఎరుగక "ప్రజ్ఞాం బ్రహ్మ" అయమాత్మబ్రహ్మయని శ్రవణాదులు యొనర్చి శ్రవణాదులు నిరసించి బ్రహ్మ నిర్ణయానుసారము యున్నను జనన మరణములు తొలగవని భావము.

**క.ద॥74॥ యెరుక బయలందు లేమిని । యెరుకను శూన్యంబటంచు యెరిగించ బడెన్ । యెరుగుమిదె ఆకసం॥ బిట్లెరిగితె యెరుకాకసములు ఏకమౌగదరా! ఆకసము బయ లేకమెట్లవురా॥ పరిపూర్ణమిదుగో కన్పడు శూన్యమనరాదు యెరిగుండు ॥"** పరిపూర్ణ పరబయలులో ఎరుక లేనందున ఎరుక శూన్యం అని చెప్పబడెను. ఈ ఎరుకనే ఆకాశమని ఎరుగుము. ఇట్లు తెలిసిన యెడల ఎరుక యనియెడి ఆకాశమును బెల్లము యందు తీపి వలె రెండు ఏకమే అగును. ఆకాశము పరబయలు ఏకం గావు. అచల పరిపూర్ణ పరబాహ్యము అదిగో చూడుము. కనబడుచున్నది. దీనిని శూన్యమని అన గూడదు యని తెలిసి యుండుము.

**క.ద.54॥ పరిపూర్ణ మొకటి దక్క॥ నితరమైన ప్రపంచమెల్ల దగ తెలియుము నీ వెరుకేనని మదిలోపల ......" ॥** అని చాటినారు.

**క.ద.64॥ ఎరుకతో వచ్చిన విశ్వము॥ యెరుకతో జనును గాని నిల్వదీ బయలైతే, ఎరుకతో రాదెరురుకతోబో॥ దెరుక తనందేమిలేదు ఇది నిశ్చయమురా॥ వుండుంటె యీ ఎరుకే తానౌరా॥ యెరుకా యెరిగివనస్తువెరు కాని తెలియుము॥ యెరుకా యెరుగదు బయలు నిట్టిదట్టిది యన॥నిది నిశ్చయమురా ॥**

ఎరుకతో వచ్చిన విశ్వము ఎరుకతో పోవునుగాని నిలకడగా నుండదు. ఈ పరబయలు ఎరుకతో రాదు. [illegible]పోదు. ఎరుక ఆ పరబయలునందు ఎచ్చటను లేదు. యిది నిశ్చయము, ఆప[illegible]దు ఎరుక ఎచ్చటనైనా యున్నట్లయితే ఈ ఎరుకనే ఆ అచల పరిపూర్ణమని చెప్పనగును. అట్లుగాక ఎరుక చలనము గలది. మృషయని చెప్పబడును. గనుక యీ ఎరుక యే వస్తువును యెరుగుచున్నదో అది అంతయు ఎరుకనీ తెలిసికొనుము. ఎరుకనగా ఆత్మ, ఆత్మతో సహా పరబయలునందు వుంటే అది ఎరుకనే. పరిపూర్ణ పరబయలందు ఏమిలేక అది ఏమిగాకయున్నది. అసత్‌రూపముగా అంటే శూన్యముగా కనబడినను ఏమి లేనప్పుడు ఏముండునంటే ఆ పరిపూర్ణ పరబయలే మిగిలి యుండును.

**శ్లో॥ కార్యోపాధి రయం జీవ కారణోపాధిరీశ్వరః**
**కార్యకారణ తాంహిత్వా పూర్ణబోధోవ శిష్యతే ॥**

(॥కృ.య.శుకరహస్య)

ఈ జీవుడు అవిద్య కార్యమైన శరీరము ఉపాధిగా గలవాడు, ఈశ్వరుడు మాయాకారణమైన ఉపాధిగలవాడు. కార్యకారణత్వమైన ఉపాధి ద్వయమును విడువగా పరిపూర్ణ పరబాహ్యమే శేషించును. ఉపాధి ద్వయమును విడువగా మనకు గోచరమయ్యేది అసత్తు, శూన్యం అనిపించిన అక్కడ మిగిలియుండేది పరిపూర్ణ పరబ్రహ్మమని ఈశ్లోకము ఘోషించుచున్నది.

## 13. ఎరుక

ఎ) **ఉల్కాహస్తో యథాకశ్చిత్ ద్రవ్యమాలోక్య తాం త్యజేత్ ।**
**జ్ఞానేన జ్ఞేయ మాలోక్యపశ్చాత్‌జ్ఞానం పరిత్యజేత్॥**

***(ఉత్తరగీత॥)***

వస్తువును దీప సహాయముతో వెదకి పిమ్మట దీపమును విసర్జించిన విధముగా జ్ఞేయమును జ్ఞాన సహాయముతో యెరిగి జ్ఞానమును వదులు మని భావము.

బ్రహ్మరూపమైన జ్ఞానమైన ఆత్మయే జ్ఞాన రూపంగాను, జ్ఞేయ రూపంగాను గూడ యున్నది. అట్టియెడ జ్ఞేయరూపమును దెలసిన పిమ్మట జ్ఞానమును వదులుట యనగా జ్ఞేయ బ్రహ్మమునే (నేను అహం వదులుట) వదలుటయగును. అప్పుడు పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షము.

జ్ఞాన జ్ఞేయములందు సమాన ధర్మములున్నప్పుడే జ్ఞానము జ్ఞేయమును తెలుసుకొనగలదు. అసలు జ్ఞానము ఏ వస్తువునైన ఎట్లెరుగుచున్నదనగా జ్ఞానేంద్రియముల ద్వారా విషయ పంచకమును, ఆ శబ్దాది విషయములుండిన వస్తువులను తెలుసుకొంటుంది. ఇట్లు ఇంద్రియములచే జతపడనపుడు తన్నుతానే అనగా తన ఆవరణమును తానే చూచుకొంటుంది.

జ్ఞానమే బ్రహ్మమని కొందరు, జ్ఞేయమే బ్రహ్మమని మరికొందరు భిన్నాభిప్రాయములు వ్యక్తం జేయుచున్నారు. జ్ఞానజ్ఞేయములు రెండు పోవలసినవే. ఎందుకనగా ఈ త్రిపుటి యందు ఒకటి లేకుంటే రెండవదిలేదు. వీని రహితమందు జన్మరాహిత్యస్థితి కలుగును. గుర్తెరిగిగాని ఎవరున్ను యే పని చేయరు. కర్మయున్నంత వరకు జన్మతప్పదు. జన్మవచ్చి జన్మవల్ల కర్మ, కర్మవల్ల జన్మ వచ్చి కర్మచేయును. ఆ కర్మానుభవము వల్ల జన్మలెత్తును. ఇట్లు సంసార చక్రభ్రమణములో జీవుడు పరిభ్రమించు చున్నాడు. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ రహిత స్థితిని ఈశ్లోక ముటంకించు చున్నది. కనుకనే భ్రాంతి రహిత శ్లోకములందు దీనిని చేర్చినారు. యదార్థముగాని ఊహ, లేక భయమే భ్రాంతి. యదార్థ అయదార్థ జ్ఞానము కలిగించునది సంవిద్రూప మగు ఆత్మయే . పరిపూర్ణ పరబ్రహ్మమందు భ్రాంతి కారణములు లేనేలేవు. జ్ఞాన జ్ఞేయములు రెండు లేని, రెండు కాని పరిపూర్ణ పరబ్రహ్మమే యున్నదని అచల ఋషుల సిద్ధాంతము.

ఎరుక అన్ని తానే అయింది 'ఏకం అనేకం భవతి' అనెడి శ్రుతి యున్ను మరియు **'అన్నియు తానై'** అనే కందార్థము కూడ ఈ విషయము స్పష్టము చేయు చున్నది. తనయందు బీజరూపంగా సూక్ష్మాతి సూక్ష్మంగా పంచతన్మాత్రలు దాగి యున్నప్పుడు ఆత్మబ్రహ్మము (నేను) అని వికాసము చెంది విషయ స్వరూపమైనపుడు విశ్వమని ఒక్క ఆత్మయే పిలువబడుచున్నది. కనుక తానే దృక్కు, తానే దృశ్యము,
విశ్వమని ఒక్క ఆత్మయే పిలువబడుచున్నది. కనుక తానే దృక్కు తానే దృశ్యము, తానే జ్ఞేయం. అట్లే సర్వత్రిపుటుల, ద్విపుటులు తానే అయి **"ఆత్మనోన్యం నకించన"** అను శ్రుతి గనుక తన్ను తానే చూచుకొను చున్నది. నారూపములు మాత్రమే భేదించుచున్నది.

**ఉల్కాహస్తోయథాకశ్చిత్** ద్రవ్యమాలోక్యతాంత్యజేత్' అను దృష్టాంతము సరియగునా అనెడి సంశయము గలుగును. అంటె దీపము చేపట్టిన వారికి దీపము దీపపుకాంతి, దాని చూడదగు ద్రవ్యము మూడు వున్నవి. అనగా ద్రష్టా, దృష్టి, దృశ్యములను త్రిపుటి ఉన్నది. సృష్టికి పూర్వం బ్రహ్మమే తెలియదగిన వస్తువు అయివున్నది. దానిని తెలుసుకొనుటకు అప్పుడెవరున్నారు. "ఏకమేవాఽ ద్వితీయా బ్రహ్మ" అనీ "నేహనా

నాస్తి కించనా" అనె శ్రుతులు లేవు. అప్పుడు బ్రహ్మము తప్ప ఎవరున్నూ లేరని, వుండజాలరని స్పష్టం చేయుచున్నవి, ఇక దానిని తెలుసుకొను వాడు గాని వాని తెలివిగాని తెలియబడునదిగాని ఆబ్రహ్మము వినా వుండుటకు వీలులేదు. కనుక జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయములు, మూడున్ను ఆ బ్రహ్మమునందే పర్యవసించుచున్నది. ఆ ఒక్క బ్రహ్మమే జ్ఞాతయై తనస్వరూపము జ్ఞానము ద్వారా తన్నుతానే తెలుసుకొంటుంది. కనుక జ్ఞాతృజ్ఞాన, జ్ఞేయములు అవినాభావ సంబంధములు గలిగి అందొకటి పోయిన మిగతా రెండు లేకపోవుచున్నవి.

"జ్ఞానేన జ్ఞేయమాలోక్యపశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్"

శ్లో॥ జ్ఞేయ సర్వమతీతంచ జ్ఞానంచ మన వుచ్యతే జ్ఞానం జ్ఞేయం సమం కృత్వాయథానాన్యద్వితీయకం" అంటుంది గురుగీత. జ్ఞానముచే జ్ఞేయమును తెలుసుకున్న తర్వాత జ్ఞానమును వదులుమని అర్థము.

జ్ఞాన జ్ఞేయములు ఒకటి జేసిన ఆపైన రెండవది లేదు. కనుక జ్ఞానమును వదలిన జ్ఞేయవస్తువు దానితో పోవును. దీపం ఆర్పివేస్తే దీప ప్రకాశము కనిపించునా? పరిపూర్ణ పరబ్రహ్మమునకు, ఎరుకకు ఎలాంటి సంబంధములేదు. ఎప్పటికి వుండునది పరిపూర్ణ పరబ్రహ్మమే అది జ్ఞాన, జ్ఞేయములు కావు. కనుక జ్ఞేయ శబ్దము కారణ బ్రహ్మమని కీర్తించును. కనుక ఎరుక బ్రహ్మమును వదిలిన నాడే పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షము.

**బి) నాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నో భయతః ప్రజ్ఞం న ప్రజ్ఞాన ఘనం న ప్రజ్ఞం। నా ప్రజ్ఞం। అదృష్టమవ్య వహార్యమగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థ మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥ మాండూక్య – 7.**

అంతరమైన చేతనం కాదు, బాహిరమైన చేతనం గాదు, రెండూ చేరిన చేతనం కాదు. అస్పష్టమైన చేతనం మాత్రముకాదు. సమిష్టి చేతనం కాదు. అచేతనం కూడా కాదు. అది కనిపించదు. ఇంకొక దానితో సంబంధం పెట్టి చెప్పడానికి లేదు. దానిని మనస్సు గ్రహించలేదు. ఊహించ శక్యం కాదు. గుర్తులు జెప్పి నిర్ణయించడానికి సాధ్యపడదు. వర్ణించడానికి వీలులేదు. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు మూడింటికి సామాన్యమైన ఒకే ఆత్మ తత్వపు సారము అది. అన్ని వికారాలు అందులో ఆగిపోతాయి. ఆదే శాంతం, శివం అద్వైతం అదే ఆత్మ తెలుసుకోవలసింది. అదే.

యాజ్ఞవల్కి జనకునకు ఒక్క వాక్యములో ప్రత్యగాత్మ స్వరూపమును తెల్పిన ఈ దిగువ బృహదారణ్యక శ్రుతివాక్యమును పరిశీలించిన ఈ శ్రుత్యర్థము సులభమగును. **"యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యం పర్జ్యోతిః పురుషః".**

**1. యోయం విజ్ఞానమయః ప్రాణేషు :** అనగా ఆత్మ విజ్ఞాన మయుడు ఇంద్రియములందును ప్రాణములందును యున్నాడని చెప్పబడినందున యింద్రియములు ఆత్మ కాదని తేలుచున్నది.

**2. హృది :** అనగా హృదయము నందు అనుటవలన యింద్రియాధిష్ఠాన దేవతలుగాదు. ఏలననగా ఇంద్రియాధిష్టానదేవతలు ఆయా ఇంద్రియములందు వుందురుగాని హృదయము లోపల యుండరు.
**3. అంతః :** హృదయములోపల అనుటచే విజ్ఞానశబ్దముచే చెప్పబడిన బుద్ధియును గాదు. ఎందుకనగా హృదయమందే యుండును గాని హృదయములోపల యుండదు.
**4. జ్యోతిః :** అనగా దేహేంద్రియాదులన్నిటికి జడ పదార్థములన్నిటికి ఉదానమైన అవ్యాకృతము ఆత్మగాదు. ఏలనన అవ్యాకృతము సర్వకారణమున్నూ, సర్వాంతరమున్నూ అయినప్పటికి జడమైనందున ప్రకాశమైన ఆత్మగాదు.
**5. పురుషః :** దేహములందు వ్యాపించియున్న పరిపూర్ణుడనుట సిద్ధించును. కనుక అంతః కరుణయందు ప్రతిబింబించి పరిచ్ఛిన్నత చిదాభానుడున్న పూర్ణుడు కాదు. ఆ చిదాభానుడు ఆత్మకాదు.

కనుక దేహేంద్రియాలకంటే తదిష్టానదేవతల కంటే బుద్ధికంటే అవ్యాకృతము కంటే చిదాభానునికంటే,విలక్షణుడై సర్వపరిపూర్ణమై సర్వప్రకాశమై స్వభావముగా అవిద్యకామ్యవాసనాది సర్వబంధశూన్యమై చిద్ధాతువు మాత్రము ఆత్మయని నిర్ణయించబడినది. కావున ఆత్మ అంతరమైన చేతనముగాదు. బాహ్యామైన చేతనంకాదు. ఎందుకనగా దేహములు ఆత్మకాదు.

**అస్పష్టమైన చేతనంకాదు.** ఆత్మ అస్పష్టమైన చేతనం కాదు. స్పష్టంగా మనకు గోచరించును. బ్రహ్మము తాను సృష్టించిన దానిలో అనుప్రవేశ జేయుటవల్ల అన్నిటి యందు తాను గుణ, శబ్ద, తెలివి, శక్తి రూపములో యున్నాడు. అన్నిటి యొక్క నామరూపములను వదలి వాటి యందలి చైతన్య రూపప్రకాశమును దర్శింపగల నేర్పు గలిగిన ప్రతివానికి ఆత్మ అస్పష్టము గానే కాదు స్పష్టంగా గోచరించును. **"ఆత్మవారేద్రష్టవ్యం"** అనే శ్రుతి స్పష్టపరిచినది.

**సమిష్టి చేతనంకాదు.** సకల జీవులందు, సమస్త ప్రాణులందు బహ్యాభ్యంతరములనే భేదములేక నిండి యున్నది ఆత్మ. ఈదృష్టితో చూస్తే ఆత్మ సమిష్టి చేతనం కాదు. మొదట ఏకంగా యున్నను, సమిష్టిగా యున్నను సృష్ట్యనంతరము అనేకమైనది. ఈదృష్టితో సమిష్టిగాదు.

**అందరికి కనిపించదు :** ఆత్మ అందరికి కనిపించదు. గురుకృపా ప్రసాదలబ్ధిపొందినవారికే అది గోచరము. దానిని ఈ చర్మ చక్షువుతో చూడలేము. గురుడు జ్ఞాన నేత్రమును ప్రసాదించిన వారు చూడగలరు. అది సూక్ష్మాతిసూక్ష్మము. అందరి దృక్కు లేక దృష్టి స్థూలరూపము. స్థూలరూపము సూక్ష్మరూపమును ఎట్లు చూడగలుగును. వాటి యందు సమాన ధర్మములు లేక పోవుటే యిందుకు కారణము. ఎవరైతే దృక్కును సూక్ష్మాతి సూక్ష్మము గల సామర్థ్యము తమ గురువుల ద్వారా పొందిన వారికి ఆత్మ కనిపించును. సాధన ద్వారా మనసు నిర్విషయము జేసినవారికి గోచరము. ఇతరులకు అసాధ్యము. కావున ఆత్మ అందరికి కనిపించదు.
**ఇంకొక దానితో సంబంధం పెట్టి చెప్పడానికి వీలులేదు :** "ఆత్మనోన్యం నకించన" అని

సర్వం ఖల్విదం(బ్రహ్మ అని శ్రుతులు ఘోషించుచున్నవి. ఆత్మ తప్ప ఇతరమేది లేదని అద్వైతము వర్ణిల్లినది. అప్పుడు ఇంకొక దానితో సంబంధం పెట్టి చెప్పడానికి వీలులేదు. ఆత్మ ఆకాశమువంటిది. అంతటవ్యాపించి, అన్నిటికి అవకాశమిస్తున్నా అది దేనిని అంటకయున్నది అట్లే ఆత్మకూడ దేనికి అంటక యున్నది. ఇతర వస్తువులతో దీనికి సంబంధం లేదు. అన్ని తానే అయింది. ఇంకొక దానితో సంబంధము పెట్టి చెప్పడానికి వీలు లేదు.

**దానిని మనస్సు గ్రహించలేదు :** "ఆత్మ వారే ద్రష్టవ్యం, శ్రోతవ్యం మనన నిధి ధ్యాసితవ్యః "అని వున్నదిగదా అంటే ఆత్మను చూడవచ్చును గాని మనస్సుతో గాదు. అతీంద్రియమైన మనస్సుతో మాత్రమే చూడ వచ్చును, అట్టి మనస్సు, స్వవశీయము జేసినప్పుడు మాత్రమే గోచరము. కాని మనస్సు చేత సాధ్యముగాదు. గ్రహించబడదు.
**ఊహించ శక్యము గానిది :** ఆత్మ అనుభవ గమ్యంబు. ఎవరికి వారే అనుభవము ద్వారా పొందవచ్చును. అది యిట్లున్నది. అట్లున్నది చెప్పుటకు రానిది ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మము. దానికి రూపము లేదు. రూపము లేనిదానిని ఊహించ శక్యము గాదు.

**గుర్తులు జెప్పి నిర్ణయించుటకు వీలులేదు :** ఆత్మకు యే గుర్తులు లేవు. బ్రహ్మకు లేవు. గుర్తులు గలదానిని గుర్తులు జెప్పి నిర్ణయించవచ్చును. కొలతలకు లొంగనిది గనుక పొట్టిదియని, పొడగరని, దళసరి అని చెప్ప వీలు లేదు. నిరాకారమైన సూక్ష్మమైనది కావున గుర్తులు జెప్పి నిర్ణయించుటకు వీలు లేదు. దీని ఉనికి తమతమగురువుల ద్వారా పొందవచ్చును.

**వర్ణించుటకు వీలులేదు :** ఆకారమున్నదానిని కన్నులుచూడవచ్చును. అది యిట్లున్నది, అట్లున్నదని వర్ణించవచ్చును. గాని ఆకారము లేని ఆత్మను వర్ణించుటకు వీలు లేదు.

# 13. పరిపూర్ణ పరబ్రహ్మము

> **జ్ఞేయవస్తుపరిత్యాగే విలయం యాతి మానసం ।**
> **మానసే విలయం యాతే కైవల్య మవ శిష్యతే॥**

తా॥జ్ఞేయవస్తువు (ఎరుక బ్రహ్మము)ను వదిలినప్పుడు మనస్సు నాశనము చెందుచుండును. మనస్సు నాశనము చెందు చుండగా కైవల్యమే అనగా పరిపూర్ణ పరబ్రహ్మమే స్థిరమైనిలుచును.

1. విషయరూపము వహించునపుడు మనసు ఆ జ్ఞేయ రూపమును దాల్చును. జ్ఞేయ రూపము దాల్చు చుండగ మనసు నిర్విషయమై నిజస్వరూపము అనగా జ్ఞేయరూపమై నిలుచును. **"మనోహి జతువత్"** అనగా మనస్సు లక్కవంటిది. కరిగించి ఏ మూసలో పోస్తే ఆరూపము దాల్చును. అంటే ఘనస్సు ఏ వస్తువునందు లగ్నమైనా ఆరూపమును దాల్చును. ధ్యానము నందు మనస్సు విషయేంద్రియములపై పోకుండ అరికట్టిన మనస్సు అప్పుడు బ్రహ్మాకారమే వహించును. ఇదే ఆత్మసాక్షాత్కారము. అప్పుడు మనస్సు స్వవశీయమగును అనగా జ్ఞేయరూపమై నిలుచును.

2. కనుక జ్ఞేయమును విడిచినచో జ్ఞాన జ్ఞేయ రహితమగు కైవల్యము అనగా పరిపూర్ణపరబ్రహ్మమే స్థిరమై వుండును. చూద్దాం.

**జ్ఞాత:**- సర్వేంద్రియముల ద్వారా బహిర్గతమై శబ్దాది విషయములను గుర్తించునది అంతఃకరణ ప్రకాశము. సుషుప్తి యందు ఈ అంతఃకరణము సహితము మరుపు రూపము చెందుచున్నది. కాని ఏది నిద్రించిన తాను నిద్రించక ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా ప్రాణము మాత్రము ఒక యంత్రమువలె పనిచేయుచున్నది. ఈ యంత్రమునకు సత్తా నిచ్చుచు పని చేయునది ఆత్మ లేక ద్రష్ట. అనగా చూచువాడు. ఇంద్రియములద్వారా వ్యవహరించునపుడు అతడే శ్రోత, మంత యిత్యాది యితర నామములను చెందుచున్నాడు. ఏ యింద్రియము ద్వారా విషయము తెలుసు కొన్నప్పటికి అన్నిటిని తెలుసుకొనువాడు యితడే. కనుక యితనిని ఒక్కమాటలో జ్ఞాత అని పిలువబడును.

**జ్ఞానము:**- "సర్వభూతస్థ మాత్మానాం సర్వభూతాని చాత్మని" అనగా తన యందు సర్వభూతములను, సర్వ భూతముల యందు తనను చూడ గల్గుటయే జ్ఞానము. మరియు నిత్యమగునది ఆత్మ యొక్కటి యేయని యెరింగి ఆత్మ తత్వము యొక్క సాక్షాత్కారము పొందుటయే జ్ఞానముగాని మిగత అంతయూ అజ్ఞానమేయని భగవద్గీత నొక్కి చెప్పుచున్నది.

**జ్ఞేయము:**- జ్ఞానము చేత తన్నుతానే (అనగా తన ఆవరణమునే) ప్రకాశింప జేసుకొన్నప్పుడు జ్ఞేయమని పిలుబడును.

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము త్రిపుటి.

**శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ జ్ఞానంచ మన వుచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం సమం కృత్వా యథా నాన్యత్ ద్వితీయకం॥ - గురుగీత.**

సర్వమున కతీతముగా నున్న జ్ఞేయ వస్తువును (బ్రహ్మమును) జ్ఞానమున్ను రెండున్నూ మనస్సుగానే చెప్పబడుచున్నవి. జ్ఞాన జ్ఞేయము లందు భిన్నదృష్టిపోయి ఏకత్వ దృష్టికలిగె నేని అపుడు రెండవది లేదని అద్వైతమే సిద్ధించుచున్నది. ఇట్లు తెలియుటయే తన్ను తాను తెలియుట. జ్ఞానేంద్రియములు కేవలం ద్వారములే. కాని వాని ద్వారా తెలుసు-కొనునది అంతరేంద్రియ పంచకములోని జ్ఞానము. తెలుసుకొనె పనిముట్టు అదొక్కటే. ఈ జ్ఞానమునకే మనస్సని పేరు. కనుకనే ఆ జ్ఞేయ బ్రహ్మమును "మనసైవాను ద్రష్టవ్యం మనసైవాను శ్రోతవ్యం" అని మనస్సుచే గుర్తించ వచ్చునని శ్రుతి చెప్పుచున్నది. గుర్తెరిగే జ్ఞానము సంకల్ప వికల్పములు గావించునపుడు వృత్తి భేదముచే మనస్సని పేరొందెను. నిజానికి ఒక్క జ్ఞానమునకు వేర్వేరు పేర్లు వచ్చినవి. జ్ఞేయ బ్రహ్మమునకు అఖండజ్ఞానమే స్వరూపము. "జ్ఞాన దేవతుకైవల్యం" అని శ్రుతి పలుకుచున్నది. జ్ఞాన జ్ఞేయములు రెండు ఒక్కటే. రెండు మనస్సే. జ్ఞానము జ్ఞానముద్వారానే జ్ఞానమునే గుర్తించుచున్నది. సులభముగా అర్థమగుటకు జ్ఞానము మనస్సు ద్వారానే జ్ఞేయమైన బ్రహ్మమును తెలియుచున్నది. సర్వము మనస్సే.

**శ్లో॥ శ్రుణుష్వ విద్వన్, మన ఏవ జీవో, మనఏవ విశ్వం, మనఏవ ఈశ ।
మన ఏవమాయ, మనఏవ బంధో, మనోలయే ముక్తిరయం యదార్థః
॥ జీవన్ముక్తి ప్రకాశిక.**

ఇట్టి మనస్సును ఏ స్థానమందు లేకుండా చేయుట యే అమనస్కము. మనస్సు లేకుండా చేయుటకు జ్ఞేయమును వదులుమంటున్నది. ఈ శ్లోకం. కాని ఉత్తర గీతలో..

**శ్లో॥ జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాద్ జ్ఞాన పరిత్యజేత్ ॥** అని ప్రమాణం యిస్తారు. కాని ఈ శ్లోకంలో జ్ఞేయం శేషించియుండదని చెప్పబడలేదు. జ్ఞానమును పరిత్యజించుమని మాత్రమే చెప్పబడినది. జ్ఞేయమును తెలుసుకొన్న జ్ఞానమును పరిత్యజిస్తే జ్ఞేయబ్రహ్మము మిగిలి యుండునా ? జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ శబ్దములు ఒకే త్రిపుటికి సంబంధించినవి. అందు ఒకటిపోయిన మిగతా రెండు మిగులవు. అంతే గాకుండా జ్ఞేయ బ్రహ్మమునకు జ్ఞానమే స్వరూప లక్షణము. స్వరూపము గోల్పోయిన బ్రహ్మము నిలిచియుండునని జెప్పుట తీపి పోయి బెల్లము మిగిలి యుండునని చెప్పినట్లే. అట్లే జ్ఞానం పోతే జ్ఞానావరణమైన జ్ఞేయం నిలుచునా ? వ్యష్టి జ్ఞానము అఖండ రూపము చెందిన పిమ్మట వ్యష్టి జ్ఞానమువదిలి వేయుట యే పొసగదు. అపుడు జ్ఞానమును వదులుట అనగా అఖండ జ్ఞాన రూపమగు జ్ఞేయమును వదులుటయే యగును.

ఆ జ్ఞేయ బ్రహ్మమును వదిలిన మనస్సు నాశనమగునని చెప్పబడినది. మనస్సు ఎట్లు నాశనమగునో పరిశీలింతము. ధ్యాన పద్ధతిలో అన్య చింతనలేక విషయములపై పోకుండ అరి కట్టి మనస్సు నేకాగ్ర మొనర్చుటవల్ల మనో నాశనమందురు. మనో నాశనము అయిన కర్మ ఫలములు - సంచితము, ప్రారబ్ధము ఆగామి లేకుండ పోవుటవల్ల తిరిగి జన్మరాదని ఇతరులందరు. కాని ఇది సరిగాదు. మనస్సు నందు చలనాంశము ఏడు పాళ్ళు. అచలాంశము ఒక్క పాలు. దానిని నిశ్చల పరుచుట కష్టము. బహుకష్టపడి బలత్కారముగా దానిని అణిచి వేసినను త్రాచుపాము వడగను తొక్కి పెట్టినట్లే యగును. పట్టు సడలితే పట్టి పీకును, కనుక మనస్సు నాశము జేసుకొనుటకు అచల ఋషులు సరియైన మార్గమును చూపెట్టినారు.

ముఖ్యంగా ఏది లేకుంటే వ్యవహారముండదో దానినే కర్తయని చెప్పవలెను. "తేన వినా తృణాగ్రపి నచలతి" అని శ్రుతి. కనుక వ్యష్టి అహంకారమే కర్త, వ్యష్టి అహంకారమే కర్తయని నిశ్చయించుకొని అహం కర్తత్వము మాత్రమే వదిలి కర్మాచరణ చేసిన వారు నిజముగా కర్తృత్వత్యాగము చేసిన వారు కారు. ఏలననగా వ్యష్టి కర్తృత్వము పోయిన సమిష్టియందు కర్త్వత్వము మిగిలి యుండును. అట్టివాడు సర్వకారణమగు బ్రహ్మము పరమాత్మయందే చేరును. ఈ జ్ఞేయము లేక పరమాత్మయే బంధమునకు అత్యంతమూల కారము. అందుకే

క.ద॥52॥ **ఆటాడి ఆడకుండును । ఆటాడిన మేను బొమ్మ యాటడకనే । ఆటాడు యెరుక యని యెడి । ఆటాడించేటి వాడు అతడే రాకర్త । అంతటికీ యీా**

**అచలమకర్తా ॥** అని శ్రీ కృష్ణదేశికులు సెలవిచ్చియున్నారు. కనుక కర్తయైన జ్ఞేయ బ్రహ్మమునకు పరిపూర్ణ పరబయలు నందు మూలం లేదు. నిలిచే అందుకు స్థానము లేదని దృఢము కావలెనని సిద్ధాంతము జేసినారు. సృష్టిలోని భాగమైన తాను సృష్టి నతిక్రమించి పోవలెను. అప్పుడు తాను నిశ్శేషముగా లేకపోవును. తన వునికి మిథ్యయే యగును. నేను పరిపూర్ణమునందు లేకుంటే అంతా ఏమి లేదు. నేను ఒక కాలమందు వుండేది. ఒక కాలమందు లేక పోయేది అహంకారము నకు స్వభావము. "నేను గనుక లేకుంటే లేని మనస్సు లేనే లేదు. లేని మనస్సు లేక వుంటే వారు పాపపుణ్య రహితులు. జనన మరణ రహితులు, నిష్ఠానేమ పర్యవసాన పరిసమాప్తి"- బృహద్వాసిష్టము. కనుక మన మందరము **"సర్వకాలము యెరుకకు వెరచి పరిపూర్ణమును అవలంబించితే చాలు. వొక్కటే వ్యవహారము. అంతా తానే. తానే అంతా, 100 అంతా తానే అని దేహ పతన పర్యంతం యిలాగు యుక్తియుంటే వ్యవహారమునకు ప[ని] లేదు. ఇది సిద్ధాంతం యిదే సత్యం, యిదే మహా గూఢం, యేమిలేదు"** శ్రీ శివరామదీక్షితుల వారి సందేశము. ఇట్టి ఆరూఢ స్థితి నొందిననే అఖండానుభవ రహితుడగును. అప్పుడు అతడు అశరీరుడు. సర్వభ్రాంతి రహితుడగును. పరిపూర్ణ బోధ ద్వారా యిట్టి ఆరూఢంజెందిన వాడు. శ్రీకృష్ణదేశికులు జెప్పినట్లు **"అదిగాన నీ రెంటి నరసి నీ విప్పుడు విదితముగా రెంటినీ విడరా మంత్రములిట్లు"** ద్వాదశి వున్నదని గాని, షోడశీ లేదని గాని ధ్యాస లేకుండ శేష జీవితము గడపవలెను. అతనికిక నిర్ణయమే మహాపాపము. ఆ స్థితిలో నేను లేను నీవు లేవు. గురుడులేడు శిష్యుడు లేడు ఈ జీవేశ్వర జగత్తు లేదు. మరి గ్రంథము లేదు, గ్రంథము వెల యుండునా? ఏమి లేదు, ఏమి లేదు..............

# ఎరుక

**14. (ఎ) యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్ ।**
**యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్ ॥ ॥యోగతత్త్వ॥**

తా॥శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాత్మకమగు సర్వము ఆత్మయే యని భావించుము. ఏలననగా అపంచీకృత పంచభూతములగు పంచతన్మాత్ర స్వరూపమగు ఆత్మయే పంచీకృతమై విషయరూపంగా పరిణమించింది. గనుక "సర్వం యదయ మాత్మా" అంతయూ ఆత్మ స్వరూపమే.

శ్లో॥ ***స్వచ్ఛబ్ద వాచ్య మవిద్యాశక్త్య బ్రహ్మ, బ్రహ్మణోఽవ్యక్తమ్, అవ్యక్తాన్మహత్ మహతో ఽహంకారః మదహంకారాత్ పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః వి పంచభూతాని పంచమహాభూతేభ్యో ఽఖిలం జగత్॥***

అనగా సృష్టికి పూర్వము గోచరంగాక, అనంతరము ఆ బ్రహ్మము పరిణామ క్రమమును జూచిన, బ్రహ్మము పరిణామముచెంది అవ్యక్తముగా, ఆ అవ్యక్తమే మహత్తుగాను, మహత్తు మదహంకారము గాను, పంచతన్మాత్రలుగాను మార్పుచెందింది. ఈ పంచతన్మాత్రలు పంచభూతములుగా మార్పుచెంది, పంచభూతములచే ఈజగత్తు

ఏర్పడి విరాట్టు స్వరూపము దాల్చింది. అంటే పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శ, రూప, రస గంధముల వల్ల పంచభూతములు యేర్పడి జీవేశ్వర జగత్తు అయింది, అంటే ఆ బ్రహ్మమే శబ్దాది విషయరూపంగా ఆ బ్రహ్మమే తన్ను ప్రకటించుకొన్నది. అదంతయు వస్తుతః పరమాత్మ స్వరూపమే. **"ఆ బ్రహ్మ స్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం"** అనిచెప్ప బడింది. కావున అంతా ఆత్మనే యని తెలియవలెను.

**14. బి.** **"దృష్టిం జ్ఞాన మయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్" ॥తేజో॥**

తా॥ దృష్టిని జ్ఞానమయంగా జేసి జగత్తును బ్రహ్మమయంగా చూడుము.

శ్రుతి : **యతోవా యిమాని భూతాని జాయంతి, ఏనజాతాని జీవంతి, యత్ర్ప యంత్య భిషం విశంతి. తద్విజిజ్ఞా సస్వతద్బ్రహ్మేతి॥ తైత్తరీ॥**

తా॥ దేవ మానవ పక్షి క్రిమికీటకాది చరాచర జంతువులు, ఆకాశాది పంచభూతములు, దేని యందుండి పుట్టునో దేని సత్తా మాత్రము చేత జీవించి యుండునో మరల మహాప్రళయంబున సకలము దేని యందు ప్రవేశించి లయించునో ఆవస్తువే బ్రహ్మ మనబడును.

దృష్టియనగా చూపు, జ్ఞానం అనగా స్వస్వరూప జ్ఞానమే జ్ఞానము. తన స్వరూపము బ్రహ్మస్వరూపము, **"జీవోబ్రహ్మైవనాపరః"**జీవుడు బ్రహ్మమే కాని యితరము కాదు. ఈ జీవేశ్వర జగత్తు సకల చరాచరము లందు గల సూక్ష్మమంతా బ్రహ్మమే. నాలుగు మహావాక్యములు ఈభావమును దృఢపరుచుచున్నవి. మనము దృక్కుద్వారా స్థూలముగా కనబడు బ్రహ్మమును అనగా సగుణమునే చూస్తున్నాము. అట్లు గాక నిర్గుణ పరమాత్మ స్వరూపమును గూడ చూడవచ్చునని శ్రుతులు జెప్పుచున్నవి. "ఆత్మ వారేఽ ద్రష్టవ్యం" "మనసైవానుద్రష్టవ్యం" అని ఆ బ్రహ్మమును చూడవచ్చునంటున్నవి. దృష్టికేవలం స్థూలమునే జూచును. ఎందుకనగా స్థూలములన్ని రూపములు గలవి. రూపముగల వాటినన్నిటి చూపుచే చూడవచ్చును. గాని నిరాకార బ్రహ్మమును ఎట్లు చూడనగును? అంటే **దృష్టి జ్ఞాన మయంగా జేసి జగత్తును బ్రహ్మమయంగా చూడు మంటుంది** ఈ మంత్రము. బ్రహ్మమయైన ప్రపంచమును చూడాలంటే ఆ బ్రహ్మము సూక్ష్మముగదా! అందుకే చూపును జ్ఞానమయంగా జేయుమంటుంది. అంటే జ్ఞానము సూక్ష్మంగా యున్నది. గనుక దృష్టిని జ్ఞానమయంగా సూక్ష్మముగా చేయునపుడే బ్రహ్మము యొక్క రూపమును చూడవచ్చును. గనుక చర్మ చక్షువుతో గాక, జ్ఞాన చక్షువుతో జూడవలెను. పంచతన్మాత్రలలో కన్ను ప్రధానమైనది. కన్ను పంచతన్మాత్రలు గల దానినే చూచును. చెవి పంచతన్మాలు గల దానినే వినును. కావున చూపును అనగా మనస్సును సూక్ష్మంగా చేయవలె. అంటే మనస్సుకు పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శ, రస, రూప, గంధములతో సంబంధమును తెంచి వేసిన, లేక విషయములపై పోకుండ అరికట్టిన అప్పుడే మనస్సు స్వవశీయ మనస్సే అగును. విషయములపై పోక సూక్ష్మమగును. అప్పుడే మనస్సు జగత్తులోని ప్రతివస్తువునందు సూక్ష్మరూపములోనున్న బ్రహ్మమును చూడవచ్చును. ఈ విధముగా జూచువానికి అన్నిటిలో తనను (ఆత్మను) తనలో అన్నిటిని చూడగల జ్ఞానము ఏర్పడును. ఈ విధంగా చూపును జ్ఞానమయంగాజేసి జగత్తును బ్రహ్మమయంగా జూడవచ్చును.

మరొకవిధంగా కూడ జగత్తును బ్రహ్మమయంగా చూడవచ్చును. సృష్టించిన ప్రతిదానిలో బ్రహ్మమే అనుప్రవేశముజేయుటవల్ల అన్నిటిలో తానే నువ్వులలో నూనెవలె నిండియున్నాడు. కాని సృష్టి వివిధ ఆకారములుగా గోచరించుటవల్ల వాటి ఆకారాలను బట్టి నామములు పెట్టినారు. నాకు మాతల్లి దండ్రులు చిన్నయ్య యని పేరు బెట్టినారు. నాభార్యకు భద్రమ్మ యని పేరు పెట్టినారు. వివిధ జంతువులకు వాటి ఆకారాలను బట్టి కుక్క, నక్క, కోడి, పిల్లి, పందియని పేరు పెట్టినారు. ఈ పేరు ఆకారాన్ని బట్టి స్థూలమును గుర్తించుటకు పెట్టిన పేర్లేకాని వాటన్నిటియందు వసించియున్న సూక్ష్మమైన వస్తువు ఆత్మనే. ఈ నామరూపాలను తొలగిస్తే, నాలో, నీలో, పందిలో పిల్లిలో, నక్క కుక్కలో వున్నది బ్రహ్మమే. కనుక సాకారముగా కనపడు ఈ జగత్తులో సర్వరూపములను వాటి నామములను తొలగిస్తే వాటియందున్న సూక్ష్మము బ్రహ్మమే. ఆ సూక్ష్మమైన బ్రహ్మమును మనము చూడాలంటే చూపును జ్ఞానమయంగా అంటే సూక్ష్మముగా చేస్తే అప్పుడు అన్నిటిలో కనబడేది బ్రహ్మమే. అన్నిటిలో కనబడేది బ్రహ్మమే అయినప్పుడు జగత్తంతా బ్రహ్మమయముగానే గోచరించును. కనుక మనము మన చూపును జ్ఞానమయంగా అనగా సూక్ష్మంగా చేయుటవల్ల జగత్తున గల సర్వమునందు సూక్ష్మమును చూడగలము. ఈ విధముగా బ్రహ్మమయంగా చూచేనేర్పు గురుకృప వల్లనే కలుగును.

ప్రంపమును చూస్తు బ్రహ్మమును దర్శించుటయే అఖండ జ్ఞాన స్వరూపము. మాయబ్రహ్మల అఖండ దర్శనమే జ్ఞానాగ్ని.

# 14. పరిపూర్ణ పరబ్రహ్మము

| (ఎ) యత్రన్యాత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా॥ ॥ఛాంద్యో 17-24-1 |
|---|

తా॥ ఎచ్చట అన్యమేదియు గానరాదో, అన్యము వినరాదో, అన్యము తెలియబడదో, అదియే భూమా పదార్థము.

అన్యమును చూచేది, వినేది, తెలుసుకొనేది ఎచ్చట లేదో అది పరిపూర్ణము. ఆవిధంగా చూడబడేవీ, వినబడేవీ లేనిచో తెలుసుకొనే జ్ఞాతా, తెలివి రూపముగా నుండు జ్ఞానం కూడా లేవని తెలుసుకొనవలయును. అదియే పరిపూర్ణ పరబ్రహ్మము.

"మనసైవాను ద్రష్టవ్యం, మనసైవానుశ్రోతవ్యం" అని చెప్పబడే రీతిగా బ్రహ్మ శుద్ధ మనస్సుకు గోచరించబడుచున్నది. కాని నిజముగా జూచినచో ఆ బ్రహ్మమునకు అతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మము శుద్ధమైన మనస్సుతో కూడ చూచుటకు వీలులేదు. అందు పంచతన్మాత్ర రూపమైన శబ్ద, స్పర్శ, రస, రూప, గంధాదులు లేవు. మరియు పరిపూర్ణ పరబ్రహ్మము నందు అన్యమేమియులేదు. కనుక అందు అన్యమేదియు గానరాదు. గాని అందు తోచుచున్నది బ్రహ్మము గాదు. "నతత్ర చక్షుర్గ చ్ఛతి ననాగచ్ఛతి నోమనః అని చెప్పబడినట్లు కంటికి, వాక్కుకు, మనస్సుకు అందనిదే పరిపూర్ణ పరబ్రహ్మము. కనుకనేదానిని అవిజ్ఞేయ బ్రహ్మమన్నారు.

ఆ పరిపూర్ణ పరబ్రహ్మమందు ద్విపుటి, త్రిపుటిలేవు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము నందు చైతన్యం, అహంకారము, క్షేత్రక్షేత్రజ్ఞులు, ధర్మాధర్మములు, స్థూల సూక్ష్మకారణ, మహాకారణములు, కారణకార్యములు, మూలప్రకృతి, అధిష్ఠాన చేతన బ్రహ్మము ప్రకృతి పురుష సంయోగము, శివశక్తులు, విద్య అవిద్యోపాధులు, సదసత్తులు, మాయావిద్యలు, దేహీదేహములు, దృక్‌దృశ్యములు, జ్ఞానములు, విక్షేపావరణములు, ఆత్మానాత్మ, జీవేశ్వరులు, క్షరాక్షరాలు పరాపకృతులు, అమృత మృత్యువులు, గురుశిష్యులు మొదలగు సర్వం యేవియు లేవు. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు త్రిపుటులులేవు. ఈ సర్వ ద్విపుటులు త్రిపుటులు అధిష్ఠాన చేతన బ్రహ్మమునకే గాని పరిపూర్ణ పరబ్రహ్మమునందేమి లేవు. కనుక "అది యిది కాదు, యిది అది కాదు" అని శ్రీశివరామ దీక్షితులవారు ఉద్ఘాటించుచున్నారు.

కావున పరిపూర్ణ పరబ్రహ్మము సర్వలక్షణ విలక్షణమైనది. అవాఙ్మానసగోచరమైనది, అవిజ్ఞేయమైనదని గ్రహించవలయును. అది నీవుగాదు నీవదికాదు. నేను లేనిదే అది అని నీయందలి బ్రహ్మ భ్రాంతిని (నేను ఉన్నాననే భ్రాంతిని) వదలి నపుడు నీకు సర్వ భ్రాంతి రహితమగును అని అచల ఋషుల సిద్ధాంతము.

**14.** బి) ద్రష్టృ దర్శన దృశ్యానాం విరామో యత్రవాభవేత్ ॥తేజో॥

తా॥ త్రిపుటి యెచ్చోట లేదో అదియే పరిపూర్ణ పరబ్రహ్మము.

ఏది కనిపించుచున్నదో అది అంతయు దృశ్యము. జ్ఞానరూపమై తెలుసుకొనునట్టిది యేదో అదియే దృక్కు. అదియే బ్రహ్మము. కేవల జ్ఞానమార్గవస్తువగు దృక్కే సర్వదేశ సర్వకాల సర్వవస్తువులయందు పరిపూర్ణముగా నిండి నువ్వులలో నూనె రీతిగా సర్వాధిష్ఠానమై, సర్వాధారమై వెలుగు చుండుట వల్ల మరియు దాని యందుండు సర్వజాలములు పుట్టుచు, గిట్టుచు మహాప్రళయమున దాని యందు ప్రవేశించి లయమగుటవల్ల ఆ దృక్కే బ్రహ్మమనబడును.

ఆ పరబ్రహ్మమగు దృక్కు ఏ విధమైన శరీరములు లేనిది, సచ్చిదానందరూపమైనది అనగా సత్తుచిత్తు ఆనందములే స్వరూపమైనది. దృక్కుదృశ్యములు ఏకవస్తువే గనుక వివేకమని అధిష్ఠానచేతనబ్రహ్మమని మత కర్తలు నిర్ణయించారు.

**"దృగ్దృశ్యౌ ద్వౌపదార్థౌ, తౌ పరస్పర విలక్షణౌ దృగ్బ్రహ్మ దృశ్యం మాయేతి, యితి వేదాంత డిండిమః"** అనగా దృక్కే బ్రహ్మము. దృశ్యం అనిత్యమైన మాయా. కనుక దృశ్య రాహిత్యం కావలె. అప్పుడు దృక్కు శాశ్వతమైన బ్రహ్మగా స్వతసిద్ధమై యుండును అని వారివాదము. కాని గురుగీత శ్లోకం **"అనిత్యం ఖండ యేత్సర్వం"** అని చెప్పింది, దృశ్యము అనిత్యము కనుక దానిని ఖండించవలెనంటారు. నిజమే దృశ్యము అనిత్యమే కాని దృక్కుకూడ దృశ్యమని మరొక శ్లోకమంటుంది.

శ్లో॥ జ్ఞేయం సర్వమతీంచ॥ జ్ఞానంచ మన వుచ్యతే॥
జ్ఞానం జ్ఞేయం సమం కృత్వా॥ యథానాన్యత్ ద్వితీయకం॥

తా॥ ప్రతీతియైన సర్వము జ్ఞేయబ్రహ్మమే. దానిని తెలుసుకొను జ్ఞానమున్ను ఆ జ్ఞేయమున్నూ ఈరెండున్నూ మనస్సుగానే చెప్పబడినది. కనుక దృ గ్దృశ్యములు రెండూవొకటే గనుక దృశ్యములు రెంటి రాహిత్యమే సాధించ వలసియుండును. కాని దృశ్యరాహిత్యము సాధించినంత మాత్రం చాలదు. ద్రష్ట (జ్ఞాతృ) దృక్కు (జ్ఞానము) దృశ్యము (జ్ఞేయము) ఈ మూడున్ను త్రిపుటి, ఇందొకటి నిలిచిన మిగతారెండూ పోయేవి కావు. దృక్ దృశ్యములు పోతేద్రష్టయనే పేరు యుండదు. మరియు మనస్సున అనేక వృత్తులు కలవు. అఖండ బ్రహ్మాకారవృత్తి కూడనొక వృత్తియే. వృత్తి రాహిత్యము సాధించవలయునన్న అప్పుడు అఖండ బ్రహ్మాకార వృత్తి పోవలసినదే. నేను బ్రహ్మనని అనుసంధానము చేయునపుడు నేను, బ్రహ్మ అను ద్వైత ముండక తప్పదు.

ఆ వృత్తి కూడ అణగిన పిమ్మట మనస్సు బ్రహ్మామై నిలుచును. ఇదే జ్ఞేయ బ్రహ్మము. అపుడు దానిని తెలుసుకొనువాడు మరొకడుండడు. జ్ఞేయమును తెలుసు కొన్న జ్ఞానమును వదిలిన బ్రహ్మము మిగిలి యుండునా? జ్ఞాత (ద్రష్ట), జ్ఞానము (దృక్) జ్ఞేయము (దృశ్యము) అను శబ్దములు సాపేక్షికములు. ఒకే త్రిపుటికి సంబంధించినవి. అందొకటి పోయినా మిగతా రెంటి యొక్క శబ్ద ప్రసక్తియే యుండదు. అంతే కాకుండా జ్ఞేయబ్రహ్మమునకు జ్ఞానమే స్వరూప లక్షణము. స్వరూపము గోల్పోయిన బ్రహ్మము నిలుచుండునని చెప్పుట దీపముపోతే దీపావరణమైన ప్రకాశము లేకుండుననుట స్పష్టము. వ్యష్టి జ్ఞానము అఖండము చెందిన పిమ్మట వ్యష్టి జ్ఞానమును వదిలివేయుట పొసగదు. అప్పుడు జ్ఞానమును వదులుట యనగా జ్ఞేయమును వదులుటే అగును.

ఆ జ్ఞేయ బ్రహ్మము పోతే ఏముండును ? శూన్యమే కదా! శూన్యముండును అని గుర్తించే నీవు వున్నావు కదా! ఇంతకు ముందు జ్ఞేయ బ్రహ్మతో తాదాత్మ్యము పొంది జ్ఞేయబ్రహ్మము శేషించు నంటివి. ఇప్పుడు శూన్యంతో తాదాత్మ్యముచెంది శూన్య స్వరూపుడవైతివి. (లేనెరుకనైతివి) ఇట్టి లేనెరుక లేకుండా పోతేనే అనగా శూన్యమే మహాశూన్యమైతేనే కృతార్థుడవు." లేనేలేవని నేను లేక పోయిన వెనుక తా నుండుగదా" అని శిష్యుడంటే "వుంటే దాన్నెట్లెరిగెద వీవు" అన్నాడు గురుదేవుడు. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మము జ్ఞానముచే తెలియ రానిది. ఎరుక లేక సేవింపదగినది. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మము వుండజూచి జ్ఞానజ్ఞేయ రూపమైన ద్రష్ట, దృక్, దృశ్యరూపమైన దృశ్యబ్రహ్మమును విడుటయే గమ్యము, లక్ష్యము. ఇట్టి లక్ష్యసిద్ధికి ద్రష్ట, దర్శన దృశ్యములకు విరామము నియ్యవలెను. అంటె త్రిపుటి రహితము జెందవలయును. అప్పుడు శేషించునది పరిపూర్ణ పరబ్రహ్మమే.

**14.** (సి) ద్రష్టు దర్శన దృశ్యంవా ఈషణ్మాత్రం కలాదికం।
అనాత్మేతి ప్రసంగోవా, హ్యనాత్మేతి మనోపివా॥

–ఋభుగీత 19 శ్లో॥ ప్రథమాధ్యాయం

తా॥ ఏ ఆత్మకు చూచువాడు, చూడబడునది, చూపు అనే భేదము లేదో అనాత్మ అనెడి ప్రసంగముగాని, అనాత్మయనెడి మనస్సుగాని లేదో అది కేవలాత్మ.

మొదట ఆత్మయనే శబ్దమునకు అర్థమును పరిశీలింతము. సర్వేంద్రియముల ద్వారా బహిర్గతమైన శబ్దాది విషయములను గుర్తించునది అంతః కరణ ప్రకాశము. సుషుప్తి యందు అంతఃకరణ ప్రకాశము అవిద్యయందు మరుపు రూపము చెందు చున్నది. కాని ఏది నిద్రించిన తాను నిద్రించక ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా ప్రాణము మాత్రము ఒక యంత్రమువలె పనిచేయుచున్నది, ఈ యంత్రమునకు సత్తానిచ్చుచు పనిచేయుచున్నదియే ఆత్మ లేక ద్రష్టయనగా చూచువాడు. ఇతరేంద్రియముల ద్వారా వ్యవహరించునపుడు అతడే శ్రోత మంత యిత్యాది యితరనామములను చెందుచున్నాడు. ఏ ఇంద్రియము ద్వారా యే విషయమును తెలుసుకొన్నప్పటికి అన్నిటిని తెలుసుకొను వాడితడే గనుక యితడు ఒక్కమాటలో జ్ఞాత అని పిలువబడును. వ్యక్తి భావన విడిచినచో యితనిని దృక్ అని పిలువబడును. అప్పుడు దృక్చే తెలియబడుదానికి దృశ్యమని పేరిడిరి. ఈవిధముగా చూచిన ఆత్మ త్రిపుటి సహితమైనది. అందు చూచువాడు, చూడబడునది, చూపు ఈ మూడు కలిపి బ్రహ్మమే యగును. ఈ త్రిపుటియందు యే ఒక్కటి లేక పోయిన రెండింటి యునికి ప్రశ్నార్థకమే. కనుక ఆత్మ త్రిపుటి. కనుక వీటి యందు భేదములేదు. ఇట్టి త్రిపుటి రహితమైనదే కేవలాత్మ, పరిపూర్ణ పరబ్రహ్మము.

ఇక అనాత్మను గురించి విచారించినచో ఆత్మకానిదంతా అనాత్మ, ఆత్మానాత్మలంటు రెండు లేనే లేవు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" నేహనా నాస్తికించన" అన్న శ్రుతులు అంతా బ్రహ్మమే అని ఘోషించుచున్నవి. ఆత్మానాత్మలు రెండు గలవంటే అద్వైత సిద్ధాంతానికి హాని. భారతీయులు గ్రీకుల కంటే పూర్వమే ఆత్మానాత్మలు రెండు లేవని తేల్చి చెప్పియున్నారు.

సాధారణముగా చలనము లేని, ప్రాణము లేని జడ పదార్థమును అనాత్మలని పరిగణిస్తారు. ఇచ్చట అనాత్మయనెడి మాటగాని, అనాత్మయనెడి మనస్సు గాని లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము అని వెల్లడించబడినది. ఆత్మానాత్మలు ద్వంద్వములు. సర్వద్వంద్వరహితమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. మనో నాశనమైతేనె పరబాహ్యము అపరోక్షము. కనుక యే కోరిక కోరరాదు.

సర్వము ఆత్మనే, ఆ ఆత్మనుండి పంచభూతములైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి వచ్చినవి. ఆకాశము యొక్క1/8 వభాగము వాయువుతో కూడుటవల్ల మనస్సాయెను. ఈ మనస్సు వాయు వాంశమగుటవల్ల సంకల్ప, వికల్పములు చేయును. చంచలమైనది. ఇట్టి మనస్సు అంతరేంద్రియమునకు సంబంధించినది. ఈ అంతరేంద్రియములు కూడ లేనిది కేవలాత్మ పరిపూర్ణ పరబ్రహ్మము.

# 15. ఎరుక

**బ్రహ్మైవ విద్యతే సాక్షాత్ వస్తుతో అవస్తుతోపిచ॥** –పాశుపత బ్రాహ్మణం॥

తా॥ వస్తువు (అనగా సత్తు)గాను అవస్తువు (అసద్రూపము) గానువుందునది బ్రహ్మమే. అనగా ఒకప్పుడు వసస్తురూపం వహించును, మరొక్కప్పుడు ఆ అవస్తువుయొక్క నామరూపములను తన యందు బీజరూపం గావించుకొని అవస్తువుగా గోచరించును.

బ్రహ్మము తాను తానుగా నున్నప్పుడు ఏకంగా, అచలంగా అనగా కదలిక లేక అవ్యక్త రూపములో నున్నప్పుడు అవస్తువుగా అనగా గోచరముగాక సూక్ష్మంగా యుండెను. ఆ స్థితిలో అందు త్రిగుణములు, సర్వ రూపములు సంస్కారయుతమై బీజరూపమున నిక్షిప్తమై యుండనే యున్నవనవలెను.

ఆ అసద్రూపములో నున్న బ్రహ్మమునగల త్రిగుణముల విజృంభణనల్ల సృష్టి కామన కలిగినది. **"సోஉ కామయత బహుస్స్యాం ప్రజాయేయేతి"** అనునట్లు తాను ఏక స్థితిలో నున్నను అనేకము కావలెనని సంకల్పము కలిగింది. గనుక **"ఏకం అనేకం భవతి"** అనగా ఏకమునుండి అనేకముగా మారినది. **"తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్"** ఆపిమ్మట తాను అందు అను ప్రవేశము గావించెను. ఇట్లు అన్నిటియందు చేరుట వల్ల అన్ని ఆకారములు తానే దాల్చింది. ఆకారము లుండుట వల్ల అన్ని పేర్లు తనవే అయినవి. అంటే సృష్టిలోని సర్వ ఆకారములన్నీ ఆత్మనే. ఎందుకనగా, అన్ని ఆత్మనుండే ఉద్భవించినవి గనుక ఆబ్రహ్మమే తనశక్తులచే సర్వమును నియమించుచున్నాడు. సృష్టి, స్థితి, లయములు చేయుచున్నాడు.

పిదప లీల ముగించి సర్వము తనలోకి ఉపసంహారించుకొంటుంది. ఆ స్థితిలో సృష్టి యంతయు బీజ రూపములో తనయందే దాచియుంచు కొన్నది. కావున బ్రహ్మమే వస్తువుగా సత్తుగా మారింది. అన్ని ఆకారములు తనవే అయినవి. అన్ని తానే అయింది. **"జీవో బ్రహ్మైవనా పరః"** అనే శ్రుతిగా వెలసింది. అంతా సద్రూపముగా నున్నది. తిరిగి మహాప్రళయమునందు తన లీలను ముగించి సృష్టించి పాలించిన దంతను తనయందు లయముగా వించుకొనుట వల్ల అసద్రూపముగా మారింది. ఆస్థితిలో వస్తువు యొక్క నామరూపములు తనయందు బీజరూపం గావించుకొని అవస్తువుగా గోచరించును.

కాని పరిపూర్ణమునకు యిట్టి సృష్టి, స్థితి, లయములు చేయు లక్షణములు లేవు. అది వస్తువే కాదు. అది వస్తు మద్రహితము.

# 15 పరిపూర్ణ పరబ్రహ్మము.

**సర్వ విశేషం నేతి నేతీతి విహాయ యదవ శిష్యతే తదద్వయం బ్రహ్మ॥**
**–॥అద్వయ తారక॥**

తా॥ ఏ విశేషములు, ఏలక్షణములున్ను పరిపూర్ణ పరబ్రహ్మమునకు లేవు. ఏ విశేషణములు ఏ లక్షణములున్ననూ అది పరిపూర్ణము కాదని త్రోసిపుచ్చగా, రెండవ లక్షణము లేక ఏకమైయున్నదే పరిపూర్ణ పరబ్రహ్మముగా గుర్తెరుగవలెను.

"యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసా సహా" తైత్తిరీయ, అనగా వాఙ్మనసులు దేనిని తెలియక వెనుకకు మరలినవో అట్టిది పరిపూర్ణ పరబ్రహ్మము. ఇట్లనుట కూడ శిష్య ప్రబోధార్థమేగాని పరిపూర్ణ పరబ్రహ్మమును ఏమనడానికి రాదు. ఇదొక నిర్వచనంకూడా కాదు. ఎందుకంటే యిందలి శబ్దాలన్ని ప్రతియోగి శబ్దాలను అపేక్షిస్తాయి. సాపేక్షికమై యున్నాయి. పుట్టనిది, చావనిది అంటే పుట్టేది చచ్చేది వున్నదన్న మాట. పరిపూర్ణ పరబ్రహ్మము. నిరపేక్షమైనది. అట్టి దానిని సాపేక్షిక పదాలతో చెప్పుట తప్పే. అయినా చెప్పవలసివచ్చినది గనుక యేదోరీతిగా చెప్పారన్నమాట. మరి ఏదోరీతి ఎట్లా చెప్పారంటే నేతి నేతీతిహోవాచ అనగా ఇది కాదు ఇది కాదు నేతి, న + ఇతి = నేతి, అంటూ కానిదానిని వివరించి చూపి యిది యని చెప్పడానికి వీలులేనిదిన్ని. యిది అని ఏ వస్తువును తనయందు కలిగి యుండనిది రెండవ లక్షణములేక ఏకమైయున్నది అగు పరిపూర్ణముయొక్క ఉనికి వుపలక్షింపజేసారు.

పరిపూర్ణ పరబ్రహ్మము పలుకున బలుకగ తలంపులకందక, సర్వనిరపేక్షకమైనది. అంటే సర్వలక్షణ విలక్షత్వమే దాని యొక్క లక్షణము.

అది భావ పదార్థమా అంటే భావించేవస్తువు యొక్క రహితమందే అది స్వత సిద్ధం. అభావ పదార్థమా అంటే భావపదార్థమొకటుండి దాని లేనిస్థితిని చెప్పదలచినప్పుడు దాని అభావమును నిర్ణయిస్తారు. భావా భావపదార్థాలు నొక దానిపై మరొకటి ఆధారపడుతుంది. కనుక ఆ రెంటి రహిత మందే పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయము.

శూన్యమా అంటే శూన్యమును గుర్తించుటకు గుర్తించే వాడు, వాని గుర్తు కూడ లేని స్థితి అది. కనుక శూన్యమును కాదు.

ఏమని అందామన్నా అనే వ్యక్తి అతని వాక్కు రెండు లేని స్థితి అది. కనుకనే అది ఏమనరానిది అని మానుకొన్నారు. చివరరకు "అస్తీత్యే వోపలబ్ధవ్య" అని దానిని అస్తిపదార్థమని అందామా అంటే అస్తి అనే పదము నాస్తి అనే పదాన్ని అపేక్షిస్తుంది. కనుక అది ఆస్తివాస్తులు కానిది. అయినను "అస్తీతి బ్రువతో న్యత్రకథం తదులభ్యతే" అనగా అస్తి అని చెప్పుటకంటే అనగా అది వున్నదని చెప్పుటకంటే మరొక విధంగా ఎట్లు ద్యోతకపరచాలి. కనుక సాపేక్షకపదమైన మరో గతిలేక అస్తి అని దానిని వాడినారన్నమాట.

అట్లే సదసత్తులు, విద్యా విద్యలు, అమృత మృత్యువులు, జ్ఞానాజ్ఞానములు చిజ్జడములు యిత్యాది సర్వద్వంద్వములు కానిది.

మరియు జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయములు అనే అంతర త్రిపుటి, ద్రష్టాదృక్దృశ్యములు మధ్య త్రిపుటి, కర్తా కర్మక్రియలు అనే బాహ్యాత్రిపుటి ఏమి లేనిది.

అట్లే సద్ఘనము, చిద్ఘనము ఆనందమును కాదు. సచ్చిదానందములు, అమృత జడదుఃఖములకు ప్రతియోగి పదాలై సాపేక్షికములై యున్నందున అది సచ్చిదానంద

వస్తువున్నుకాదు. అది ప్రజ్ఞానఘనము, చిన్మాత్రముకాదు. ఏలననగా దానికి యెరుక (తెలివి, జ్ఞానము, గుర్తు) లేనేలేవు.

వ్యష్టియందు వ్యవహార భేదము చేత ఈ ఎరుకజ్ఞానమనోబుద్ధి చిత్తాహంకారములుగానున్నది. యిందు మనస్సు **"మనోహి జత్వత్"** లక్కలాంటిది. లక్క కరిగించి యే మూసలో పోస్తే తదాకారమును వహించును. మనస్సు కూడ అట్టిదే. తెలియబడే పదార్థమునకు ఆవరణము లేక పరిమితి వుంటుంది. ఆ వస్తువును తెలుసుకొనే తెలుసుకొనె తెలివి లేక మనస్సు తదాకారముగా మార్పు చెందుతుంది. అదే వస్తు సాక్షాత్కారము అపుడు అన్యవస్తుగ్రహణముయుండదు. ఒకే కాలమున మరికొన్ని వస్తువులు కనబడుతున్నా ఆసమయమున ఏ వస్తువును సమగ్రంగా సంపూర్ణంగా మాత్రం గ్రహించుట లేదని గ్రహించాలి. ఈ విధంగా కూడ తెలియరానిది పరిపూర్ణ పరబ్రహ్మము.

అణు ప్రమాణమూ, మధ్యప్రమాణము, మహత్ ప్రమాణము అని ప్రమాణములు మూడు విధములు. అన్ని వస్తువులు ఈ త్రివిధ ప్రమాణములలో ఏదో ఒక ప్రమాణమున వుండడము తప్పదు. కనుక ఆయా వస్తువులను గుర్తెరుగునపుడు తెలివి కూడా ఆ యా ప్రమాణములను వహిస్తూ, మార్పులు చెందుతూ వుంటుంది. ఖండ ఖండములుగా గానవచ్చే ఈ వ్యష్టి తెలివియే అఖండరూపమగు తెలివి లేక ప్రజ్ఞానముగా యున్నది. కాబట్టి ఈ వ్యష్టి సమిష్ట్యాత్మకమగు ఆ తెలివివలె ఏ మార్పులు యెన్నడూ ఎరుగక ఒక్కతీరుగా వుండదే పరిపూర్ణ పరబ్రహ్మము.

ఇక తెలివి ఉపాధి వుంటేనే గాని వుండదు. తెలివి సూక్ష్మము, దేహము స్థూలము. స్థూలము లేకుండా సూక్ష్మముండడానికి వీలులేదు. ఆకాశము, అన్నిటికంటె సూక్ష్మమైయుండి అన్ని వస్తువుల బాహ్యాభ్యంతరముల యందు నిండి వున్నది. అట్లే ఆత్మకూడ. పరిపూర్ణపరబ్రహ్మము స్థూలముకాదు, సూక్ష్మముగాదు, మరొకటి లేదు. సూక్ష్మరూపమైన తెలివిలేదు. ఎందుకనగా అది స్థూలముకాదు.

1. తెలివిలేక మనస్సు తదాకారము వహిస్తుంది అప్పుడే వస్తువు తెలియబడుతుంది. తెలివి ఆ విధంగా వస్తు రూపము వహించినపుడే తన్మయమవుతుంది.
2. ప్రతివస్తువు ఆవరణ కలిగియుంటుంది. పరిపూర్ణ పరబ్రహ్మము వస్తువు కూడ కాదు. ఆవరణలేనిది. ప్రతివస్తువునందు తెలివి ఏదో ఒక రూపంలో ఉంటుంది. ఉదా॥ ఒక యిటుక ముక్క యందు కూడా దాని అణువులను అన్యోన్యంగా చేర్చి పట్టుకొనేశక్తి రూపముగా తెలివి వున్నదనే అనాలి. అదే పరావాక్కు అనబడును. కనుక కేవలం చేతనం గాని, కేవలం జడంగాని ఏ వస్తువును అనరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము ఈ చిజ్జడములలో ఏదికాదు. ఆ రెండింటి ఏకరూపము కూడకాదు. కనుక పరిపూర్ణమందు తెలివి, యెరుక దాని పరిణామ రూపమగు మరుపుకూడ లేదు. ఎరుక, మరుపులు లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము.

పై వివరణముల వల్ల మనకు బోధపడినది యేమనగా పరిపూర్ణబ్రహ్మమునకు ఏలాంటి విశేషములు, ఏ లక్షణములు లేవు. సర్వలక్షణ విలక్షణమైనది. ఈ లక్షణములన్ని పరబ్రహ్మముగా త్రోసివుచ్చగా, ఇక రెండవ లక్షణములేక ఏకమై యున్నదే పరిపూర్ణ పరబ్రహ్మము.

బి) **అధాత ఆదేశోనేతినేతి॥బృహ॥ 2-3-6.**

ఇది కాదిది కాదని మనోవాక్కుల కందు సమస్తమును నిషేధించగా మనోవాక్కుల కందనిదే శేషించును. అనగా పరిపూర్ణ పరబయలే శేషించును.

తా॥ సకలదేశాలయందు సమస్త వస్తువులందు నిండి నిబడీకృతమై సూది మోపుటకైనను సందు లేక చలించక, ఏకరీతిగా నున్నదేదో ఆ పరిపూర్ణ పరబ్రహ్మము దేని చేతనూ తెలియరాక పరోక్షముగానున్నది.

**శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవ ఽ శిష్యతే ॥**

తా॥ కార్యరూపముగానున్న జగత్తునందు కారణ రూపముగానున్న పరమాత్మ సువర్ణాభరణములందు బంగారమువలె సంపూర్ణముగా నిండి యుండుటచే ఇదియును పూర్ణముగానే యున్నది. ఈ రెంటిలో పరోక్షంగానున్న పరిపూర్ణము అతీతమై రెండవది లేకపోవుట చేత బాహ్యాభ్యంతరములనే నిర్ణయములేక ప్రత్యక్ష పూర్ణమును అతిక్రమించి యున్నది. విచారించి చూడగా ప్రత్యక్ష పూర్ణమగు యీ జగత్తు కారణంతో సహా "యదృశ్యం తన్నశ్యం" అనే న్యాయంగా లేనివస్తువే అయిపోవుచున్నది. పరోక్షంగా నున్న పూర్ణమే ఎప్పటికి శేషించి సత్యస్వరూపమైనది. కనుక దానికి పరిపూర్ణమని వ్యవహారార్థము పేరు వచ్చింది.

ప్రత్యక్షపూర్ణము గూర్చి తెలుసుకొందాము. నేను అనేకంగావలె. **"శ్రుతి అహం బహుస్యాం"** అని జీవేశ్వర జగద్రూపం వికాసం జెంది పంచభూతములుగాను సూర్యచంద్రాది నవగ్రహ నక్షత్ర రూపముగాను, కాల త్రయములు గాను తానే వ్యాపించి యున్నను ఎక్కడి కక్కడ పరిమిత రూపములోనున్నది. దీపమొక్క చోటనే యుండినను దాని ప్రకాశము కొంత వరకు వ్యాపించి యుండునట్లుగా అహం అనుగుర్తు ఒకచోట యుండినను, దాని విషయావరణము ఆపాదమస్తకము వ్యాపించి మిత మయ్యును పూర్ణంగానేయున్నది. శరీరమునందే అవస్థాత్రయములు చెందుచుండును. సంకల్ప వికల్పముల చేయుచుండును. చీమ ఎంతవరకు యుండునో దాని తెలివి అంతవరకు వ్యాపించియుండును. ఈ విధముగా వ్యాపించిన అహం పదార్థము ఎక్కడికక్కడ వ్యాపించి యుండుటవల్ల ఇదికూడ పూర్ణమని చెప్పబడుచున్నది. ఈ అహం పదార్థమునకు మూలము అహమే గాని పరోక్షంగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మముకాదు. ప్రత్యక్షపూర్ణమే సర్వకారణమయి యున్నది. ఇట్టి కారణ బ్రహ్మమునకు అతీతమగునది ఏది లేదని ఇతరులంటారు. ఈ కారణ బ్రహ్మము నిరింద్రియమైన శుద్ధమనస్సుకు గోచరమైన

బ్రహ్మమని యనదగియున్నది. కనుక కారణబ్రహ్మమైన ప్రత్యక్షపూర్ణము అతద్వ్యావృత్తిలక్షణముచే, నేతినేతి అనగా యిదిగాదు, యిదిగాదు అంటూ ప్రత్యక్షపూర్ణమును కారణబ్రహ్మతో సహ నిషేధిస్తే అప్పుడు మనస్సు వాక్కులకు అందక మిగిలి యుండేది పరిపూర్ణ పరబ్రహ్మమేనని గుర్తుంచుకొనవలయును. అట్లు గుర్తెరుగుటవల్ల సర్వభ్రాంతి రహితమై తిరిగి జన్మరాని మోక్షము లభించును.

**సి) సిద్ధాంతో అధ్యాత్మశాస్త్రాణాం సర్వాపహ్నావ ఏవచ ॥**

సర్వము అనగా ఎరుకతోసహా మిథ్యయని నిషేధించుటయే వేదాంత సిద్ధాంతము. నాతో సహా జీవేశ్వర జగత్తునకు ఏది కారణముగా నున్నదో అట్టి కారణ శరీరబ్రహ్మము (ఎరుక) కూడ మిథ్య అనగా భ్రాంతి రూపమే. నేను బ్రహ్మనైతిని అనుట మొదటి భ్రాంతి. ఈ మహావాక్యమునందు నేను అనేది భ్రమ. భ్రాంతి రూపము. దీనిని వదలనంతవరకు ఈ నేను తిరిగి జన్మలకు కారణమై పునరపి జననం పునరపి మరణములకు కారణమగుచున్నది. ఈభ్రాంతి వృద్ధి చెందుతూనే వుంటుంది. చిదిమిన కొలది చిగుర్చుచునే యుండును. కనుక ఇట్టి భ్రాంతి కారణమగు వస్తువు అహంను (ఎరుకను) కూకటి వేరుతోసహా పెకలించి నాశనము గావించవలెను. లేనిచో మళ్ళీ పుట్టుటకు అవకాశమున్నది. కనుక ఈ అహం లేక ఎరుక అన్నిటికి కారణముగానున్నది. అందుకే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "పరిపూర్ణ మొకటిదక్క। నితరమైన ప్రపంచమెల్లదగ తెలియుము నీవెరుకేనని" సెలవిచ్చినారు మరియు ఈ ఎరుక **"అన్నియు తానై తనకవి పన్నుగ వేరనుచు నోట బలుకుచు, మరి తానన్నిటి నెరిగె యెరుకయై యున్నాని నెరుక। నూహింపు చుండూ। తనలో తాను మోహింపుచుండూ"॥** అని శ్రీ కృష్ణ దేశికులు తమ కందార్థములలో సెలవిచ్చియున్నారు అనగా పిపీలికాదిబ్రహ్మపర్యంతము సర్వము తానై తనకు అవి లేవని చెప్పుచు మరియు సర్వమును తెలుసుకొను యెరుకైవున్నానని ఎరుక యెరుకను ఊహింపుచుండును. మరల తనలో తానే మోహింపుచుండును. యిట్టి యెరుకనే భ్రాంతికి మూలకారణము. కావున సర్వము తానైన ఎరుకను తనతో సహా నిషేధించుటయే ఆధ్యాత్మిక సిద్ధాంతము. ఎందుకనగా అందలి భ్రాంతి నిషేధించకుండ వుంటే జన్మ పరంపరలు తప్పవు. మానవ జన్మ యొక్క పరమ లక్ష్యము తిరిగి జన్మరాకుండ జేసుకొనుటయే. ఈవిషయమును తెలియజెప్పుటకే వేదములు, వేదాంతములు వెలసినవి. ఈ విషయమే వేదాంతులందు సిద్ధాంతము చేయబడినది. ఇందుకు నిరాలంబోపనిషత్తు మొదటి మంత్రం ప్రమాణము. కావున నాతో సహా ఈ జీవేశ్వర జగత్తునంత మిథ్యగా జేసి వదులుటయే వేదాంత సిద్ధాంతము.

## ఎరుక

**16.** **విద్యా విద్యాది భేదేవ, భావాభావాది భేదతః ।**
**గురు శిష్యాది భేదేన బ్రహ్మైవ ప్రతి భాసతే॥ ఆత్మోపనిషత్తు॥**

తా॥ జ్ఞానాజ్ఞానములుగా, భావాభావములుగా, గురు శిష్యులుగా భేదములతో ఈ బ్రహ్మమే ప్రకాశించుచున్నది.

విద్యావిద్యలనగా బ్రహ్మము యొక్క భేదస్థితి, విద్యయనగా జ్ఞానము అవిద్యయనగా అజ్ఞానము. ప్రాపంచిక వైజ్ఞానిక విషయములను గూర్చి తెలియజేయు జ్ఞానము సామాన్య జ్ఞానమనబడును. ప్రాపంచిక విషయములు వదిలి పారమార్థికముగా తానెవరని ఆలోచించి పూర్ణగురువును బడసి, పరిపూర్ణబోధను పొందుటకు మొదట తాను తనస్వరూపమును తెలియవలయును. అట్లు గురువుద్వారా తన స్వస్వరూపమును పొందుటయే జ్ఞానము. అనగా ఆత్మసాక్షాత్కార జ్ఞానమే జ్ఞానమన బడును. ఇతర జ్ఞానములన్నీ అజ్ఞానముగా నెంచవలయును. ఏది తెలిస్తే ఇంకొకటి తెలుసుకొనవలయుననెడి అవసరము లేకుండునో అదే జ్ఞానము.

అహంకారాభిమానాలు, స్వర్గాదిమోక్షపదవులు విద్యవలన కలుగును. మరియు కామ్య కర్మాచరణ యజ్ఞయాగాది తపః క్రియలు స్వర్గనరకాది లోకములు అజ్ఞానము వలన సంభవించును, స్వర్గనరకాదులు కలుగుటకు యెరుకయే కారణము. ఎరుక నిర్మితమగు సర్వశాస్త్రములు, కర్మరూపయోగ, యోగాంగపద్ధతులు సర్వము అశాశ్వత ఫల ప్రాప్తినే కలిగించును. విద్యా విద్యలు ద్వంద్వములు. విద్యయనగాబ్రహ్మము అవిద్యయనగా బ్రహ్మము వలన కలిగిన మాయా జీవేశ్వరజగత్తు. ఈ విధంగా ఈ బ్రహ్మమే భేదములుగా గోచరించుచున్నది. భేదములతో ఈ బ్రహ్మమే ప్రకాశించుచున్నది.

**భావాభావ భేదరూపములుగా ఈ బ్రహ్మమే ప్రకాశించుచున్నది.**

భావాభావ పదార్థములు యింద్రియ రూపమగు మనస్సునకు సంబంధించినవి. మనస్సు సంకల్పించుటయే భావన. అట్టి భావమును మనస్సు నుండి తొలగించుటయే అభావన. అతీంద్రియమగు ఆది భౌతికమగు సంకల్ప వికల్పములేని మనస్సునకు పరమాత్మ గోచరించును. **మనసైవాను ద్రష్టవ్యం, మనసైవాను శ్రోతవ్యం** అను శ్రుతిలో చెప్పబడిన రీతిగా అతీంద్రియ మనస్సుకు గోచరించుట అనగా ఆ మనస్స్థితిలో పరమాత్మతో తాదాత్మ్యము చెంది స్వస్వరూప స్థితిలో వున్నదన్నమాట. ఆ స్థితిని గుర్తించునట్టి మనస్సు గుర్తింపబడిన పరమాత్మలనే ద్విపుటిలేదు. దీనినే భావాతీతమందురు. ఈ అభావస్థితిలో రెండు ఏకమైనది. అప్పుడు బ్రహ్మస్థితి కుదిరింది. కనుక బ్రహ్మము భేదములతో నున్నను అభావ స్థితిలో భేదరహితమై అభేద బుద్ధి కలిగి ఏకమైనదని గుర్తించవలయును. ఈ భావాభావ స్థితులను వదలిన స్థితి యందే పరిపూర్ణపరబ్రహ్మము అపరోక్షము.

**గురుశిష్య భేదరూప బ్రహ్మము** (ఎరుక మరుపు రూప బ్రహ్మము)

పూర్ణగురుసార్వ భౌముడు తనగురువు వద్ద విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మ లగు జీవి చతుష్టయములను విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత పరమాత్మలనే ఈశ్వరతను చతుష్టయములను తెలిసి ఈ అష్టతనువులకు ఆవల యున్న మహాకాశమును అఖండ యెరుకను తెలిసి వీనికి సంబంధము లేకుండా అన్నింట నిండియున్న పరిపూర్ణ పరబ్రహ్మమును తెలుసుకొని, క్షరాక్షరోపాధి కతీతమగు కైవల్య శరీర పురుషోత్తమ

పద్ధతిగావున్న గురుమూర్తి కడకు శిష్యుడేతెంచి అశరీరమార్గమును తెలియజేయుమని ప్రార్థించగా, అందుల కంగీకరించి తన పురుషోత్తమ స్థానమునుండి దిగి కరుణామృత దృష్టితో వీక్షించి హస్తమస్తక ప్రయోగము జేసి స్వస్తికారోహణ స్పర్శ గావించి జీవతనువు, ఈశ్వరతనువులను బోధించి అఖండ ఎరుకతో పాటు పరిపూర్ణ పరబాహ్యమును అపరోక్షమొనరించు కొనుటవల్ల గురుశిష్యులిద్దరు లేకుండ పోదురు. ఇద్దరు రహితమగుదురు.

గురుస్వరూపమనగా పెద్దస్వరూపము అదే బ్రహ్మస్వరూపము. శిష్యుని స్వరూపము గూడ బ్రహ్మస్వరూపమే గాని, అజ్ఞానముచేత జీవరూపముగా భావించు చున్నాడు. నిజంగా శిష్యుడు పరమాత్మస్వరూపమే, గురువుకూడ, మొదట శిష్యుడే. తన గురువుద్వారా జీవభావమును తొలగించుకొని, ఆత్మభావమును అలపరచుకొనును. శిష్యుడు తాను అనుకొన్నను అనుకోక పోయినను తాను బ్రహ్మస్వరూపుడే. తాను మళ్ళీ బ్రహ్మముకావలసిన పనిలేదు. అయితే గురువు నాశ్రయించి తన పూర్వపు జీవుడనే అజ్ఞానాన్ని పోగొట్టుకొన్నప్పుడు అతడు బ్రహ్మమే. రెండవదేదీలేదు. ఈ విధంగా గురుశిష్యులనేటి బ్రహ్మ బేధమును తొలగించుకొనుటయే అభేదబుద్ధి అద్వైతసిద్ధి.

## 16. పరిపూర్ణ పరబ్రహ్మము

> యస్యకించిత్బ హిర్నాస్తి కిదిచిదంతః క్రియచ్ఛన ।
> యస్యలింగం ప్రపంచవా బ్రహ్మైవాత్మన సంశయః ॥తేజో॥

దేనికి లోపల బైట, అను నిర్ణయము లేదో దేనికెట్టి చిహ్నాములు లేవో దేనియందు సృష్ట్యాదులు లేవో అదే కేవలాత్మగా తెలియవలయును.

దేనికి లోపల బయట అనునిర్ణయము లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. శ్రీకృష్ణ దేశికేంద్రులవారు తమ 34వ కందార్థ దర్పనందు **“.....ములు గృచ్ఛ సందులేకను కలిగున్నది బట్టబయలు గదరా మాయన్నా”** అని గానంజేసి యున్నారు. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము ఎట్లున్నదంటే అంతట నిండియున్నది. ముల్లు గ్రుచ్చుదామన్నా తావివ్వక కదలక నిండి నిబిడీకృతమైయున్నది. అది దేనికి కూడా లోపల బయటయను నిర్ణయము లేకుండా నిండియున్నది.

మరొక కందార్థ దర్పనందు శ్రీకృష్ణదేశికంద్రులవారు॥ 147॥ **“ఏ పరిపూర్ణము మేనికి। లోపల వెలినిండియుండు లోపము లేకన్। ఆ పరిపూర్ణమే జగతికి। లోపల వెలినుండు దాని। లోనేవున్నవిరా। పై రెండెవ్విలేని వెన్నకురా। యీ పూర్ణబోధచే। పై ప్రపంచశరీర। రూపము। లెడబాపు మీ పట్లనె॥** అని సెలవిచ్చియున్నారు. అనగా ఏ పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల నిండి నిబిడీకృతముగా యున్నదో, ఆ పరిపూర్ణమే జగతికి లోపల బయట నిండి యుండును. దానియందే ఈ శరీరము, జగము తోచుచున్నది. ఇవి లేనివే గనుక వీటిని వదులుము. అచల పరిపూర్ణ బోధచేత పై ప్రపంచశరీరములు (చక్షురేంద్రియ గోచర స్వభావము) ఈ క్షణమే విడువు మని భావము.

అవకాశరూపమైన ఆకాశము, ఏ లోపలి ఆవరణమందున్నదో, ఆ యాకాశమే కుండ పెంకునందు గూడ వుండనేవున్నది. దానినే ఘటాకాశమందురు. కనుక సకల దేశాలయందు సర్వకాలాల యందు సమస్త వస్తువుల యందు దేశకాలవస్తువుల బాహ్యాభ్యంతరములయందు, ఆది మధ్యాంతములందు సర్వత్రా ఘటాకాశమువలె వున్నది పరిపూర్ణపరబ్రహ్మము.

**పరిపూర్ణమునకు ఎట్టి చిహ్నములు లేవు.**

పరిపూర్ణమునకు ఎట్టి చిహ్నములు అనగా గుర్తులు ఒకటైనలేవు. గుర్తు అనగా జ్ఞానము, తెలివి. పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఎటువంటి ఆనవాలులేవు. గురుతుగా తెలివిగా, జ్ఞానరూపంగా గలది ఎరుకకే గుర్తు. అన్ని ఎరుకకే. అందుకే శ్రీకృష్ణదేశికేంద్రుల వారు 56॥వ॥ కందార్థ దర్పనందు **"ఎరుకన్నను మరుపన్నను। ఎరుకకు ఎరుకన్నను దేహి యన మాయ యనన్। గురు తన సాక్ష్యన జ్ఞప్త్యన। స్ఫురణ యనినన్ ద్రష్ట యనిన చూడు మొక్కటిగా। యిదిలేకుంటే చూడ మొక్కటిగా। మరి చలాచల మూలమర్మ మెరిగేటిదన్న! యెరిగి తాలేనాని యెగిరి పొయ్యేటిదన్న! చూడు మొక్కటిగా॥** అని గానము చేసి యున్నారు. యెరుకనినను మరుపని యనినను యెరుకను యెరిగెడి యెరుక యనిననూ దేహియనినను మాయా యనినను, గురుతు యనినను సాక్షి, జ్ఞప్తియనినూ, స్ఫురణ, ద్రష్టయనినను ఒకటిగా చూడుము. ఈ ఎరుకే లేకుంటే దాని పరిణామమగు యే నొక్క దానినైన చూడలేము అని నిర్ణయము.

ఎరుకకు ఎరుగునట్టి గుణముగలదు. పరిపూర్ణమునకు ఎరుగునట్టి మరుపు జెందు గుర్తులు లేవు. అది ఎరుక మరుపులుగానిది. అందు జ్ఞానము గాని, అజ్ఞానము గాని లేదు. అది జ్ఞానాజ్ఞానములకు మీరినది. మరియు దానికెట్టి గుర్తులు లేవు. ఏ అవయవమునకు ఆ అవయవ నిర్ణయము గుర్తుగా యున్నందుకు యెరుక గుర్తు యని చెప్పబడును. పరిపూర్ణము ఎటువంటి అవయవములు, ఆకారములు, ఆవరణములు లేనిది. కనుక దానికి ఎట్టి గురుతులు, పేర్లు లేవని భావము.

**దేనియందు సృష్ట్యాదులు లేవో అది పరిపూర్ణపరబ్రహ్మమని తెలుసుకో. ఇదే పరిపూర్ణ సిద్ధాంతము.**

పరిపూర్ణపరబయలందున్న సృష్టికి అవకాశములేదు. ఎరుక బ్రహ్మమునకు యిట్టి అవకాశము కలదు. ఎందుకనగా సృష్టి క్రమమును పరిశీలించిన సృష్టికి పూర్వం, ఆ బ్రహ్మము ఏకంగా వుండేది. కాని దానికి 'అహం బహుస్యాం' అనేకము కావలెనని సంకల్పము కలిగింది. **'ఏకం అనేకం భవతి'** అన్నట్లు అనేకమైంది. కనుక బ్రహ్మము నుండి ఈ జీవేశ్వర జగత్తుఅయినది కాని పరిపూర్ణపరబ్రహ్మముపుట్టదు, గిట్టదు. ఈ భావమును 32॥ కందార్థ దర్పనందు **"పుట్టుట గిట్టుటలేకను! పుట్టిగిట్టేటి ఎరుక పోడిమెరుగకన్! చట్టువలె కదలకుండును బట్టబయలని"** గానం చేసియున్నారు. అది పుట్టలేదు. ఇంకొక దానిని పుట్టించదు.

ఒకప్పుడు లేకుండావుంటే పుట్టిందనాలి. లేక చచ్చిందనాలి. కాని ఎప్పుడు (సర్వకాలాలయందు) వున్నదానికి పుట్టుకేమిటి, చావేమిటి. పుట్టినది ప్రతిదీ చస్తుంది

గదా! పుట్టని దంటే చాలదా? చావనిది అనికూడ ఎందుకనాలి? చాలదు ఎందుకంటే మాయ అనాది అన్నారు. అంటే అది పుట్టుకలేనిది గదా అని అర్థం. కాని బ్రహ్మజ్ఞానం వల్ల అది నశిస్తుంది. కనుక పరిపూర్ణపరబ్రహ్మము చావనిది అని అనాలి.

తాను పుట్టనిదీ, చావనిదీ కనుక పరిపూర్ణపరబ్రహ్మము ఇతరమును పుట్టింపజాలదు. అన్నప్పుడు ఈ జీవి తనవంటి మరొక జీవిని ఉత్పత్తి చేయడానికి సమర్థత కలిగివుంటుంది. ఉదా॥ వృక్ష బీజములు ఇవి పరస్పర కార్యకారణ మూలంగా వుంటున్నాయి. పుట్టేటప్పుడు కార్యకారణరూపంగా పుడుతున్నాయి. పోయేటప్పుడు కూడ కార్యమును తనయందు యిముడ్చుకొని కారణంగా పోతున్నాయి.

**"నతోహిమాయయా జన్మయుజ్యతేనతు తత్వతః,**
**తత్త్వతోజాయతే యస్య జాతం తస్య హిజాయతే"** (మాండూక్య కారికలు 27 ప్రకరణలు)

అనగా పుట్టని దాని నుండి ఏదియు పుట్ట జాలదు. పుట్టిన దాని నుండియే మరొకటి పుట్టును. దీనినే అన్వయ వ్యతిరేకంగా జెప్పితే పుట్టించుటకు కారణమైనదేదో అనగాసృష్టి కారణమైనదే. అది పరిపూర్ణ పరబ్రహ్మముకాదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మమునకు అన్యంగా తోచబడు వానిలో దేనికిన్ని పరిపూర్ణ పరబ్రహ్మము మూలముకాదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము తాను పుట్టలేదు. ఇతరమును పుట్టించదు. పరిపూర్ణము మాత్రమే. అజమూ, అమృతము (అనగా పుట్టనిది, చావనిది) అయివున్నది, సృష్టికారణమైన దానిని (అనగా బృహత్పదార్థము, భూమా పదార్థము గొప్పపదార్థము) అని వాడినా అది అజము, అమరము నగు పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మమందు సృష్ట్యాదులు లేవు. కనుక అది కేవలాత్మయని కొనియాడబడింది.

బి) **న నిరోధో నచోత్పత్తిర్న బద్ధో నచసాధకః॥**
**నము ముక్షుర్నవైముక్త యిత్యేషాపరమార్థతః॥**

తా॥ జననన మరణములు, బద్ధులు, సాధకులు, ముముక్షువులు, ముక్తులు అనుభేదములు యెన్నడూ లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము.

1. జనన మరణములు లేనిది పరిపూర్ణపరబ్రహ్మము పైమంత్రమున వివరించబడింది. అయినను శ్రీ శివరామ దీక్షితులవారు పరిపూర్ణమునుగూర్చి యిట్లు చెప్పారు.

"పుట్టనిదిచావనిది, రాకడపోకడ లేనిది సకలదేశాల యందు సర్వకాలాల యందు సమస్తమైన వస్తువుల యందు మొదలు కొనలేక చలించక, ఒక్కరీతిగ తనకు తానే స్వతస్సిద్ధమైనది".

ఇందు మొదటనే పుట్టనిది, చావనిది అంటే జననమరణములు లేనిది. పుట్టని దానినుండి యేదియు పుట్టదు. పుట్టిన దాని నుండియే మరొకటి పుట్టును. దీనినే అన్వయ వ్యతిరేకంగా చెబితే పుట్టించుట కారణమైనదేదో అనగా సృష్టికారణమైనదేదో

అది పరిపూర్ణముకాదు. కనుక పరిపూర్ణపరబ్రహ్మమున కన్యముగా తోచబడు వానిలో దేనికిన్ని పరిపూర్ణపరబ్రహ్మము మూలముకాదు అని సిద్ధించు చున్నది. కనుక పరిపూర్ణము తాను పుట్టలేదు ఇతరములను పుట్టించలేదు. పరిపూర్ణము మాత్రమే అజమూ, అమృతమూ అనగా జనన మరణములు లేనిదైవున్నది.

**పరిపూర్ణమందు బద్ధులు లేరు.**

**బద్ధులనగా:-** అధిష్ఠాన చేతనబ్రహ్మము తాను కారణముగానుండి త్రిగుణసామ్య పద్ధతిద్వారా కార్యరూప జగత్తును సృష్టించుచున్నది. కనుక శ్రుతి॥ **"ఊర్ధ్వమూలం అధఃశాఖాయని నిర్ణయము".** కార్యోపాధిగా ఉపాధి చెందుతున్న జీవుణ్ణీ ఊర్ధమూలంగానున్న బ్రహ్మత్వము పొందించ వలయునని ప్రజ్ఞానం బ్రహ్మ అహంబ్రహ్మోస్మి, తత్త్వమసీబ్రహ్మ, అయమాత్మబ్రహ్మాయను నిర్ణయానుసారముగా జీవుడ్నీ ఊర్ధ్వవ్యాపకమొనరించి, సృష్ట్యాభిమానంగల చేతన బ్రహ్మమునందే కలియుచున్నది. కనుక వీరు బద్ధులని నిర్ణయము. బద్ధులనగా జనన మరణ ప్రవహామునందు బంధింప బడినవారే నిర్ణయము. పరబాహ్యాము తెలియుట వల్ల తిరిగి జన్మలేని జన్మరాహిత్యము సిద్ధించును. కావున బద్ధుల ప్రసక్తి పరిపూర్ణ పరబ్రహ్మమందునలేదు. అందు బద్ధులు లేరు.

**సాధకులు:** సాధనజేసి సాధించినవారే సాధకులు. ప్రపంచములో కొందరు దశవిధ నాదంబులందును, కొందరు లక్ష్యత్రయమునందును, సగుణ నిర్గుణ ధ్యానము నందును, హంసయందును బుద్ధి నిశ్చయము గావించెదరు. మరికొందరు అష్టాంగయోగము లందు వాటివల్ల కలుగు సిద్ధులను పొంది ఆనందించుచున్నారు. ఈ విధంగా ఎందరో, ఎన్నో విధములుగా సాధనలు జేయుచున్నారు. అణిమాది సిద్ధులు పొందుచున్నారు. వీటివల్ల జన్మభ్రాంతి అధికమగునేగాని జన్మరహితంగాదు. ఇన్ని విధములుగా సాధనలొనరించువారు పరిపూర్ణమందులేరు.

**ముముక్షువులు:** నాకు మోక్షము కలుగుగాక యని అనుక్షణం తీవ్రమైన కోరిక గలవారు ముముక్షువులు. వీరుకూడ పరిపూర్ణమునందులేరు.

**ముక్తులు** - శ్రుతి ॥ **"ఏకోదేవ సర్వభూతేషు గూఢః సర్వవ్యాపి సర్వ భూతాంతరాత్మ॥** ఈ ఆత్మయే దేవుడు. సమస్త భూతములందు ప్రత్యగాత్మ స్వరూపముగా, గూఢముగా నున్నవాడు. కూటస్థ జీవుల కన్యోన్యాధ్యాస కలిగినందున కూటస్థుడు గూఢముగా నున్నాడు. జీవుడు పైకి కనబడు చున్నాడు. ఆత్మయే అంతర్యామిగా నున్నవాడు. అట్టి ఆత్మతో లీనంగావాలని సాలోక్య, సారూప్య, సాయుజ్యాదులనే ముక్తి పొందగోరువారు ముక్తులు. వీరు కూడ పరిపూర్ణ పరబ్రహ్మమందులేరు.

ఈ విధంగా జనన మరణ చక్ర భ్రమణములో తిరుగు వారైనబద్ధులు, సాధకులు, ముముక్షువులు, వుండినను పరిపూర్ణము వీరి యందలి భేదములను యెన్నడు ఎరుగదు. ఎందుకనగా వీరందరు పరిపూర్ణ పరబాహ్యాము నందు లేనివారు. వీరంతా కలలోని వారేనని తెలియవలయును.

# 17(ఎ) ఎరుక

> సన్నాప్య సన్నాప్యు భయాత్మికానో।
> భిన్నాప్య భిన్నా వ్యుభయాత్మికానో
> సాంగాన్యసంగాన్యుభయాత్మికానో।
> మహద్భుతా ౭ నిర్వచనీయ రూపా॥ వివేకచూడామణి॥

తా॥ సత్తుగాను, అసత్తుగాను, వుభయాత్మికంగాను, భిన్నంగా అభిన్నంగా, వుభయాత్మకముగా వున్నందున మాయ మహాద్భుతము, అనిర్వచనీయము అని చెప్పబడెను. ఈ మాయా లక్షణములు ఎరుకబ్రహ్మమునకు సరిపోవును.

"యా మా సా మాయా" అని మాయకు సామన్యమైన నిర్వచనము. అనగా ఏది ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండునో అదే మాయా అని అర్థము. అంటే ఎల్లప్పుడు ఉండేది ఒకటి. ఒకప్పుడు మాత్రమే వుండి ఒకప్పుడు లేకుండేది ఒకటి అని రెండు వస్తువులను చెప్పినట్లయినది. ఈ రెండవ వస్తువు (మాయ) వున్నప్పుడు, ఎక్కడున్నదీ. పోయినప్పుడు ఎక్కడికి పోయింది ? అంటే అద్వైత నిర్ణయ రీత్యా పరబ్రహ్మ మొక్కటి ఎల్లప్పుడు వుండేది. కనుక దానియందే తోచి, దానియందే యుండి, మరల దానియందే లేకుండా పోవునని చెప్పబడుచున్నది. సృష్టికి పూర్వము అసలు లేనట్లుగా తోచుచున్నది. సృష్టి ప్రారంభ కాలమున బ్రహ్మము నందుతోచి ఆ బ్రహ్మము యొక్క సాన్నిధ్యమునందు చేతనవంతమై, బ్రహ్మతో కూడి జీవేశ్వర జగత్తుకు కారణమైనట్లు చెప్పబడినది. మాయ గాని తత్కార్యములు గాని బ్రహ్మనుండి కల్గినవికదా! ఉండి కల్గినవా? లేకకల్గినవా? అను ప్రశ్న ఉదయిస్తుంది. గంద్ర ఇసుకను గానుగ వేస్తే తైలము లభించునా? కనుక లేక కల్గిందని చెప్పరాదు. వృక్షకారణం బీజము నందణిగి మణిగి యున్నట్లు జీవేశ్వర జగదాది మాయాకార్యములు సహితము బ్రహ్మమునందు బీజరూపకముగా అణిగిమణిగి యున్నవని చెప్పవలసినదే. మరుగైయున్నది. ప్రకటితమైనదని చెప్పాలి. ఎక్కడ దాగి యుండెనో అక్కడే ప్రకటమై, అక్కడే ఉండి, తిరిగి అక్కడే తిరోభావము చెందినదని కాని అసలే లేకుండ యున్నదెప్పుడు? లేనిది కొత్తగా రాలేదు. వున్నది లేకుండా పోదు, పగలు నక్షత్రాలు కనబడనంతమాత్రాన నక్షత్రములు లేనే లెవనుట ఎట్లు పొరపాటో అట్లే అధిష్ఠాన బ్రహ్మము ఎల్లప్పుడు వుండేదని, మాయ ఒకప్పుడుండి ఒకప్పుడు పోయేదని చెప్పుటకూడ పొరపాటే. ఉన్నది వున్నట్లుగా జెప్పాలంటే అధిష్ఠాన బ్రహ్మముతోపాటు మాయయున్నా ఉండదనే చెప్పాలి. ఈ మాయ బ్రహ్మములో మాయ అనిత్యమని, బ్రహ్మము నిత్యమని అని అనరాదు.ఎటొచ్చి ఈ మాయాది గుణములు ఆ బ్రహ్మమునందు అవిర్భావ, తిరోభావములు చెందుచన్నవేగాని బ్రహ్మమున కన్యదేశమున లేవు. "బ్రహ్మణ్యోం నకించన, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనగా అంతాబ్రహ్మస్వరూపమేననీ శ్రుతులు జెప్పుచున్నవి. కనుక మాయ, బ్రహ్మము బ్రహ్మముయొక్క రూపాంతరములే.

ఆదిశంకురులు మాయా అనిర్వచనీయమని, మాయ సద్రూపంగాను, భిన్నభిన్నముగాను సావయ నిరవయ రూపములుగా వుంటు యిదమిత్థమని నిర్ణయింప రాక అనిర్వచనీయమై, అద్భుతమై యున్నదనే భావమును దెల్పిరి, కాని మాయా బ్రహ్మలు రెండు ఒకే వస్తువు. ఒక నాణెము యొక్క బొమ్మ బొరుసుల వంటివే. బ్రహ్మమునందలి దైవాత్మక శక్తి లేక బ్రహ్మీశక్తియే మూలమాయ శబ్దముచే చెప్పబడినది. ఈ శ్లోకము అధిష్ఠానబ్రహ్మమునకు వర్తించును. ఏలననగా ఆ అధిష్ఠాన బ్రహ్మము సృష్టికి పూర్వము ఒక విధంగానుండి తానే జీవేశ్వర జగత్తును ఆవిర్భవింపజేసి తన కన్యంగా నున్నట్లు తోపింపజేసి తుదకా జగన్నాటకమునకు ఉపసంహారము జేసేది అధిష్టాన బ్రహ్మమేకదా? కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులు
కం.దు॥ అన్నియు తానై తనకి..............మోహంపు చుండూ.
కం.దు॥ ఆటాడి యాడకుండును.............యతడే రాకర్తా॥ అని సెలవిచ్చియున్నారు. కనుక ఈ అధిష్టాన చేతన బ్రహ్మము కంటే అద్భుతమైనది అనిర్వచనీయమైనది మరొకటి లేదని మతకర్తల నిర్ణయమని భావించవలెను.

**బి) అనిర్వచనీయ జ్యోతి స్సర్వవ్యాపకం, నిరతి శయానంద లక్షణం వరమా కాశం॥ మండల బ్రహ్మణో పనిషత్**

తా॥ అతివ్యాప్తి అవ్యాప్తి అసంభవదోషములు లేకుండ చెప్పుటకు సాధ్యము కానిది అనిర్వచనీయమని చెప్పబడును. ఈ ఎరుకయున్ను అదే అయి తిరిగి అన్నియు కానిది అయివున్నది. ఈ ఆత్మ ప్రకాశ రూపకము, చిదాకాశమని పేరొందినది. మాయా లక్షణములు కలిగియున్నది.

**అవ్యాప్తి అతివ్యాప్తి:-** ఈ మాయా అంతట వ్యాపించి యున్నది. అందుకే అతివ్యాప్తి. ఈ ఘటన సృష్టి కామన గలిగిన తర్వాతస్థితి. అంతకు పూర్వము అవ్యాప్తిగా ఏకంగా వున్నది. నిశ్చలంగా అచలంగానున్నది. ఎందుకనగా మాయా నిశ్చలస్థితిలో బ్రహ్మమునందే బీజరూపంగా అణిగి మణిగి యున్నది. సంకల్ప విజృంభణ కాని స్థితిలో అవ్యాప్తిగానున్నది. అంతేగాక సంభవాసంభవస్థితిలో కూడానున్నది. ఎందుకనగా సంభవించుటకు చలన మవసరము. అంత వరకు అందు దాగి యున్న మాయకు ప్రేరణ కలుగలేదు. ప్రేరణ కలుగుట వల్లనే చలన మేర్పడి సంభవించుటకు అవకాశము కలిగింది. ఇదంతా బ్రహ్మము మాయా ద్వంద్వైక ఏకరూపంగా యుండుటకు కారణం. కనుక అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవదోషములు లేకుండా చెప్పుటకు వీలు లేనిది మాయాయని చెప్పబడింది. కనుక నిర్వచించుటకు వీలు లేదు.

ఈ ఎరుక అన్నీ తానే అయింది. తిరిగి అన్నితాను కానటుంది 84లక్షల జీవరాసులుగా పరిణమించింది. అన్నిటికి వేరుగా నుంటున్నామంటుంది. చలాచలము రెండు ఎరుకే. అన్ని ఎరుకే ఎరుక కానిదేది ?

క.ద. "అన్నియు తానై.............." పిపీలికాది బ్రహ్మపర్యంతము తానే అయి తనకవి వేరని, తన కవి లేవని చెప్పును. కారణమైన బీజము కార్యరూపవృక్షమగు

నట్లు కారణమైన యెరుక కార్యరూప జీవేశ్వర జగత్తుగా అగును. సర్వము ఎరుకగానే వుండి దానికి తానువేరని ఎట్లు చెప్పుననగా కారణమగు బీజాకారము దానికి కార్యరూపమగు వృక్షాకారము వేర్వేరుగా నున్నందున యిది బీజము, యిది వృక్షము అని ఎట్లు నిర్మింపబడునో అట్లు కారణ రూపమైన ఎరుకయొక్క ఆకారము కార్యరూప జీవేశ్వర జగత్తు యొక్క ఆకారము వేరువేరుగానున్నందున ఎరుక కార్యరూప జీవేశ్వర జగత్తును వేరు జేసి తానువేరని తనకు అవివేరని చెప్పుచుండును.

పంచతన్మాత్రలు వంటిది ఎరుక. గనుక అన్నిటి యందు నేను వుండి తెలుకొంటున్నావని ఊహించి లేని తను వున్నట్లు నిర్ణయించును. పంచతన్మాత్రలు లేనిది పరబయలు గనుక దానిని నిర్ణయించలేక లేదని చెప్పును. ఈ ఆత్మ ప్రకాశ రూపము. సర్వమునకు సత్తా నిచ్చునది, సర్వేంద్రియములను ప్రకాశింప జేయునది ఆ ఆత్మ స్వరూపమే.

**శ్లో॥31. యత్సత్వేన జగత్సత్వం। యత్ప్రకాశేన భాతితత్!**
**యదానందేన నందన్తి। తస్మైశ్రీ గురువే నమః॥ గురుగీత॥**

ఏ బ్రహ్మమున్నందు వల్లనే ఈ సర్వజగత్తు యున్నదో, ఏ పరబ్రహ్మ ప్రకాశముండుట చేతనే ఈ సర్వజగత్తు ప్రకాశించుచున్నదో, ఏ బ్రహ్మము ఆనంద రూపముగా గలిగి యుండుట చేత ఈ జగత్తంతా ఆనందముగా నున్నదో అట్టి పరబ్రహ్మస్వరూపుడగు సద్గురుమూర్తికి నమస్కరించుచున్నాను. కనుక అంతా ఆత్మప్రకాశమే. అందుకే ఆత్మ చిదాకాశమని కొనియాడబడినది. చిత్ జ్ఞానము జ్ఞానాకాశముగా నున్నది జ్ఞానమే. ఆకాశముగా గల బ్రహ్మమే చిదాకాశమని పేర్కొనబడింది.

మాయా లక్షణములు:

1) శబ్ద బ్రహ్మమును ఆశ్రయించు కొని యుండి దానినే ఆవరించుకొని అనగా మరుగుపరుచుచూనుండు నొక యనిర్వచనీయమగు అనగా యిదమిత్థమ్మని నిర్ణయించుటకు వీలుకాని విచిత్ర వస్తువునకు మాయ యనిపేరు.

2) ఇది కూడ అనాది యనియు కాని సాంత మనియు చెప్పబడును. ఎట్లన మాయకు శుద్ధము నిర్వికారమగు బ్రహ్మమునందు కాని మాయాకార్యములగు జీవేశ్వరజగత్తుగాని యుత్పత్తి చెప్పుట విరుద్ధము.

3) ఉత్పత్తి లేనిది గనుక అనాదిగాని బ్రహ్మముచే బాధించబడును. కనుక మాయకు అంతము కలదు.

4) ఈ మాయ సత్తుగాను, అసత్తుగాను, బ్రహ్మజ్ఞానముచే బాధించబడును. కనుక త్రికాలాబాధ్యమైన సత్పదార్థముగాదు.

5) అవస్థాత్రయములందు మాయా కార్యము ప్రకటమగుటచే అసత్పదార్థమని చెప్పుటకు వీలుపడదు.

6) పరబ్రహ్మమును ఆశ్రయించుకొని యుండుటవల్ల బ్రహ్మము కంటే భిన్నమని చెప్పుటకువీలుపడదు.

7) బ్రహ్మమును మరుగుపరుచుచు వుండుటవల్ల అభిన్నమని యనరాదు.

8) బీజమున నున్న అంకురమువలె ఈ మాయా సావయవముకాదు. నిరవయవము కాదు.

9) జీవుని యందు వ్యష్టిరూపముగాను, ఈశ్వరుని యందు సమిష్టి రూపముగా నున్నందున వ్యష్టియని అనతగదు. గాని సర్వద్వంద్వములు మరల తానే అయింది కనుక శంకరులు మాయను అనిర్వచనీయమని జెప్పినారు.

10) యా మా సా మాయా అనగా ఏదిలేదో ఆదిమాయ అనికూడ మాయకు నిర్వచనము జెప్పియున్నారు.

11) చింతించుటకు, వచించుటకు సాధ్యముగాక, యుక్తికి చిక్కకుండుట జేసియు దానిని అనిర్వచనీయమనిరి.

12) ఈ మాయనే ప్రకృతియని యందురు. సృష్టికి పూర్వమున్నది కనుక ఇది ప్రకృతి, అవిద్యా, అజ్ఞానము, దీనికి రూపాంతరములు.

13) ఈమాయా సత్వరజోతమో గుణములతోకూడి యున్నది.

14) ఈ మాయకు ఆవరణ విక్షేపములు రెండు శక్తులుగలవు. బ్రహ్మ స్వరూపమును మరుగుపరచి, స్వరూపం జ్ఞానము గలుగకుండ జేయుటయే ఆవరణ లక్షణము. భ్రమాజ్ఞానము గలిగించి దానియందు సత్యత్వబుద్ధిని కలిగించుటయే విక్షేపకార్యము. ఉన్న బ్రహ్మమును మరుగుపరచి, లేనిదానిగా జేసివేయుట; లేని పదార్థమును వున్నట్లుగా భ్రమరూప జ్ఞానము కలిగించుట, అపూర్వ శక్తి సామర్థ్యములు గల దానిగా జేయుట చేతనే మాయ అఘటనాఘటనాపటీయసీయని, ఘటనా ఘటనాపటీయసీ యని పేర్కొనబడింది.

కనుక బ్రహ్మకు మాయా లక్షణములన్నియు యున్నవి.

"మీయతే అనేనమాయ" ఆవరణముకలదే మాయాయని మరొక నిర్వచనము.

# 17. పరిపూర్ణపరబ్రహ్మము

> **తద్బ్రహ్మ కేవలం పూర్ణం, జీవేశ్వర వివర్జితం చిద్రూపం**
> **నాస్తి సర్వత్ర, సద్రూపం నాస్తి సర్వదా, అధారాధేయ రహితం...**

తా॥ జీవేశ్వర్లు లేనిది చిద్రూపము. యెచ్చోటనూ లేనిది, ఏ కాలమందైన సద్రూప అని చెప్పనలవి కానిది. ఆధారాధేయములు కానిది, ఖండాఖండములు గానిది అదే కేవల పరిపూర్ణ బ్రహ్మమైయున్నది.

**జీవేశ్వరులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము:** అజ్ఞానము వ్యష్టి సమిష్టి రూపములుగా నున్నది. అజ్ఞానము యొక్క అంశమునకు వ్యష్టి అజ్ఞానమనిపేరు. సంపూర్ణ అజ్ఞానమునకు సమిష్టి ఆజ్ఞానమని పేరు. అజ్ఞానము యొక్క వ్యష్టిరూపమైన మలినసత్వమందున్న చేతనాభావము ఆ అజ్ఞానాంశమునకు అధిష్టానమైన కూటస్థ చైతన్యమును జేరి జీవుడన బడును.

సమిష్టి అజ్ఞాన స్వరూపమై సత్వగుణ ప్రధానమైయుండు మాయ యందలి చిదా భాసమును, మాయా సహిత చైతన్యము కూడి ఈశ్వరు డనబడును. వీరే జీవేశ్వరులు. ఈ జీవేశ్వరులు. పరిపూర్ణమందు లేరని ఈ మంత్రార్థము.

**చిద్రూపము యెచ్చోటలేనిది పరిపూర్ణ పరబయలు**

చిత్ అనగా జ్ఞానము, జ్ఞానరూపముగా ప్రకాశించుచునది బ్రహ్మమే. అదే ఎరుక. ఇట్టి ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎచ్చోటను లేదు. ఏదైన వుంటే అదిగూడ ఎరుకనే. అన్ని వస్తువులు పరబటలందు యందు అభావ స్థితి కలిగి యుండును. కనుక ఏమి లేనిది, ఏమి కానిది చిద్రూపము ఎచ్చోటలేనిది, పరిపూర్ణపరబ్రహ్మము.

**ఏ కాలమందైన సద్రూపమని చెప్పనలవికాదు:** సృష్టిఅనే సంఘటనను పురస్కరించుకొని సృష్టికి పూర్వమని, సృష్టియున్నప్పుడని ప్రళయానంతరము కాలము నిర్దేశించుచున్నాము. అద్వైత సిద్ధియందు బ్రహ్మకు సృష్టిస్థితిలయములు తటస్థ లక్షణములుగా జెప్పబడినది. అంతే గాని కాలమనేది అస్తి సిద్ధ పదార్థము కాదు. కేవల భాతి సిద్ధపదార్థమే. సూర్యాది గ్రహగతి భేదముచే వాతావరణములోవచ్చే మార్పుల వల్ల మధ్యనుండే వ్యవధికి వేసవి కాలమని, వర్షకాలమని, శీతకాలమని పేర్లు చెప్పబడినది. మరియు భూత, భవిష్యత్, వర్తమాన కాలములని విభజింపబడినవి. నిజంగా వర్తమాన కాలమనేది దాని పరిమితి అనేది ఒక లిప్తకాలమమును గూడా యుండదు. ఎందుకనగా మరు క్షణములోనే భూతకాలములో చేరి పోవును. ఈ కాలత్రయమందు బ్రహ్మము సద్రూపమని చెప్పవలనుకాదు.

ఇతరులు చెప్పే బ్రహ్మము కాలత్రయాబాధ్యమని సత్యమని దానిని కొనియాడుదురు. కాని అది కాలత్రయములందు ఒక్కతీరుగా లేదు. విచారించగా

1) సృష్టికి పూర్వం ఈ బ్రహ్మము సత్‌పదార్థము గానుండెను.
2) తదనంతరము ఆ బ్రహ్మం అనేకం కావలెనని కోరెను.
3) అట్లుకోరి ఏకం అనేకం భవతి అని ఒకటే అనేక మాయెను.
4) సృష్టించిన దానితో తానే అనుప్రవేశము జేసెను.
5) ఆ బ్రహ్మమే తనశక్తులచే సర్వమును నియమించుచున్నాడు.
6) అన్నిటికి కర్త అయ్యికూడా అకర్తగా అనగా సాక్షిగా బ్రహ్మమే వుంటుయున్నది.

7) పిదప లీలముగించుకొని సర్వం తనలోనికి ఉపసంహరించు కొంటుంది. మరొకరీతిగా వివిధ నామ రూపక్రియాత్మకముగా వున్నది. కనుక కాలాను సారము మార్పులు చెందుచున్నది. కనుక ఏ కాలమున సద్రూపముగాలేదు. కనుక ఎరుక త్రికాలాబాధ్యమని అనరాదు. పరిపూర్ణపరబ్రహ్మ త్రికాలములలో ఎట్టి మార్పులు యెరుగక, ఏకముగాను సదసద్రహితమై యున్నదే పరిపూర్ణ పరబ్రహ్మము. ఏ కాలములోనైన సద్రూపమని చెప్పనలవికానిదే పరిపూర్ణ పరబ్రహ్మము.

**పరిపూర్ణ పరబ్రహ్మ ఆధారము, ఆధేయములు లేనిది.**

పరిపూర్ణపరబ్రహ్మము సకలదేశములందు, సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులందు వున్నది. గనుక ఎరుక తత్కార్యరూపమగు సమస్తమున్ను కూడా ఈ పరిపూర్ణములోనే తోచవలెను. కాని అన్యస్థానములేదు గదా! కనుక పరిపూర్ణము ఎరుకకు ఆధారముగా గాని, ఆధేయముగా గాని, అధిష్ఠానముగాని కాదు. ఎరుక ఎరుకకు ఆధారము, ఆధేయముగా నున్నది. రజ్జు, సర్పము, స్థాన పురుషుడు మృగ జలము, స్వప్నానానందమువలె (పరిపూర్ణపరబ్రహ్మమందు లేకనే) ఎరుక తనంతతానే తనయందే తాను తోచింది. కనుక పరిపూర్ణ మీ లేనెరుకకు వివర్తోపాధాన కారణమున్ను కాజాలదు.

**పరిపూర్ణము ఖండా ఖండములు గాలేనిది.**

పరిపూర్ణ పరబయలు ఖండాఖండములుగాలేక అఖండముగా యున్నది. కనుకనే శ్రుతి॥ "పూర్ణమదఃపూర్ణమిదం" అని చెప్పబడుచున్నది. ఖండా ఖండముగా లేనిది అంటే పరిపూర్ణము అఖండముగా యున్నదని అన్నట్లే. అఖండమనగా తెంపులేనిది. ఆది మధ్యాంతరహితమైనది. ఈ అర్థములో కేవలం అఖండమగునది పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే. అది నిరపేక్షక అఖండము అనగా పరిపూర్ణమును చెప్పినపుడు ఖండ వస్తువు యొక్క ప్రసక్తిలేదు. అది కేవలమైనది. అది అంతట అనగావస్తువులోపల, బయట, క్రింద, మీద, దిక్కులలో, మరియు మూలలయందు వ్యాపించియున్నది. సూది మోపుటకైనను తావులేని పరిపూర్ణము అఖండ మనియే అనవలెను. కనుక అది ఖండఖండములుగా లేనిది, ఎట్టి మార్పులు యెరుగనిది ఏకముగా, స్థిరముగా, అఖండముగా వున్నది.

## 18(ఎ) ఎరుక బ్రహ్మము

> తదనుత్తమ నిష్పకదం, దీపకం తేజసామపి,
> స్వానుభూత్యేక మానంచ యత్తత్వం తదసౌస్థితః॥ అన్నపూర్ణ॥

తా॥అదియే యుత్తమమైది. దానికంటే ఉత్తమమైనదిలేదు. నిశ్చలమైనది. తేజస్సుకు తేజస్సునిచ్చునది. అది స్వానుభవ గమ్యమైనది (అనుభవము, జ్ఞానమునకు విషయము)

ఇతరులుజెప్పే బ్రహ్మము సృష్టి కామన కలుగక పూర్వం తాను తానైన స్థితిలో చలనములేక అచల స్థితిలో వుండెను. అట్టి అచలస్థితిలో వున్న బ్రహ్మము మాత్రమే ఉత్తమమైనదిగా యెంచి దానిని ఏకమైవాఽ అన్నారు. ఆ బ్రహ్మము ఏకముగానున్నది. ప్రతిలేనిదగుటచే దానిని అద్వితీయం అని కొనియాడినారు. అంతేగాక ఈ బ్రహ్మమే అంతా దీని మించినది మరొకటి లేదను నిశ్చయమునకు వచ్చిరి. ఇదే మోక్షము, ఇదే అంతాయని తెల్పిరి. కనుక ఈ స్థితిలో బ్రహ్మము వుత్తమమై యున్నది. దానికంటే వుత్తమమైది మరొకటి లేదని తలంచిరి.

**నిశ్చలమైనది ఈ బ్రహ్మము:** నిశ్చలమైనది. ఇంతకు పూర్వము జెప్పినట్లుగా బ్రహ్మము నిశ్చలంగా చలనము లేకుండ నున్నది. తానుతానుగా నున్న స్థితిలోనే జెప్పవలెను. అప్పటికింక ఆ బ్రహ్మము ఏక స్థితిలో యుండెను. తనలో బీజరూపములో నున్న త్రిగుణముల విజృంభణ జరుగని స్థితి, ఆ స్థితిలో మాత్రవే బ్రహ్మము నిశ్చలంగాయున్నదని చలనము లేనిదని చెప్పవలయును.

**తేజస్సులకు తేజస్సు నిచ్చునది.**

బ్రహ్మము తేజస్సులకు తేజస్సు నిచ్చునది. అంటే ఆ బ్రహ్మము స్వయం ప్రకాశము గలది. మరియు సర్వమునకు సత్తాయిచ్చునది. మరొకటి లేదు కనుకనే స్వయం ప్రకాశమన్నారు. తన్నుతాను ప్రకాశింపచేసుకొనుటయేగాక తనవలననైన, అనగా తానే అయిన సమస్తమునకు తేజస్సు నిచ్చునదిగా నున్నది. ఇందుకు దీప దృష్టాంతము, తన్నుతాను చూచుకొనుటయేగాక తన ప్రకాశావరణమందున్న సమస్తమును దీపమెట్లు చూచునో అట్లనే అని తెలియవలయును. తన తేజస్సువలననే సూర్య చంద్ర నక్షత్ర నవగ్రహాదులన్ని ప్రకాశించుచున్నవి. అన్నిటిని తన తేజస్సుచే నింపియున్నది.

**అది స్వానుభవ గమ్యమైనది.**

బ్రహ్మము స్వానుభవగమ్యమైనది. అనగా ఈ బ్రహ్మము అనుభవమునకు అందునది. జ్ఞానమునకు విషయముగా నుండుటవల్ల ఈ బ్రహ్మము అనుభవ గమ్యమైనది. ఈ బ్రహ్మమును ఈ చర్మ చక్షువులతో చూచుటకు వీలుగాకున్నను మనస్సుతో చూచుటకు వీలుపడకున్నను, అతీంద్రియ మనస్సుకు బ్రహ్మము గోచరమే. మనస్సు నిర్విషయము జేసిన అప్పుడు మనస్సు బ్రహ్మాకారము వహించును. ఎందుకనగా మనస్సు లక్కవంటిది. "మనోహి జత్వత్" అట్టి లక్కను కరిగించియే మూసలోపోస్తే తదాకారమే వహించును. అట్లే మనస్సును ఇంద్రియ జ్ఞానముతో వేరుచేస్తే ఆ మనస్సు బ్రహ్మాకారం వహించును. అంటే శుద్ధమనస్సుకు, బ్రహ్మము గోచరమంటే అనుభవమునకు వచ్చునట్లే. అందుకే 'ఆత్మవారేఽ ద్రష్టవ్యం' మరియు 'మనసైవాను ద్రష్టవ్యం' అనే శ్రుతులు ఈ భావమును ఇంకా దృఢపరచును 'సర్వంఖల్విదంబ్రహ్మ' 'నేహనానాస్తికించన' బ్రహ్మణోన్యం నకించిన' యిత్యాదిశ్రుతులు సర్వము బ్రహ్మముగా చెప్పుచున్నవి. అప్పట్లో వస్తుల యొక్క నామ రూపములను వదిలితే అందుండు

సూక్ష్మరూపమున నున్న బ్రహ్మము అనుభవమునకు వచ్చును. ఇట్లు చూచుటకు నేర్పరితనము అవసరము. సద్గురుపుత్రుడు ఇట్టి నేర్పరి తనమున అన్నిటియందు తనను, తనయందు అన్నిటిని చూచును. ఇట్ల బ్రహ్మమును అనుభవమునకు తెచ్చుకొని ఎల్లప్పుడు బ్రహ్మీస్థితిలో నుండును.

**18(బి) తదేతద్బ్రహ్మ అపూర్వమనపర మనంతర మభాహ్య మయమాత్మా సర్వానుభూః** ॥బృహ॥ అ. 4. బ్రా. 5

తా॥ ఈ ఆత్మవిచారించు సర్వులకు అనుభవరూపముగానున్నది. ఇంద్రియరూపమైన జ్ఞానమునకు బ్రహ్మము విషయముకాదు. ఏలననగా జ్ఞానమునకు ఆధిభౌతికము ఎరగుట. దేనిని అనగా శబ్దాది విషయ పంచకము గదా! విషయ పంచకమునుండి మరల్చినచో అజ్ఞానమే శుద్ధ జ్ఞానమనబడును. అట్టి శుద్ధ జ్ఞానముచే సృష్టికి పూర్వముండే వస్తువును లేక తత్వమును గూర్చిధ్యానించినచో అజ్ఞానము (నిరీంద్రియ రూపమగుమనస్సు) జ్ఞేయరూపమును పొందుచున్నది. "మనోహిజతువత్" అనగా మనస్సు లక్కవంటిది ఏమూసలో లక్కను కరగించిపోస్తే ఆరూపమే ఆ లక్కవహిస్తుంది. అదే విధముగా శుద్ధ జ్ఞానము లేక నిరీంద్రయమనస్సు జ్ఞేయా కారమును వహించుటయే ఆ జ్ఞేయ బ్రహ్మము అనుభవములోకివచ్చును. ఈ విధముగా ఆత్మ విచారము చేయువారందరిచే అనుభవ రూపమైయున్నది.

## 18. పరిపూర్ణ పరబ్రహ్మము

**అనుభూతి పరం తస్మాత్సారం బ్రహ్మేతి కథ్యతే** ॥ అన్నపూర్ణ॥

తా॥ అనుభవమునకు కూడ చిక్కదేదో అదేశాశ్వతము. అది పరిపూర్ణ పరబ్రహ్మమే. పరిపూర్ణ పరబ్రహ్మము అనుభవగమ్యముగాదు.

అనుభవము అను పదాన్ని విడదీస్తే అను + భవము = అనుభము అయినది. అను అంటే అనుసరించుట, భవము అనగా పుట్టినదానిని. అనుభవము అంటే పుట్టిన దానిని అనుసరించుటయే అనుభవము అని శబ్ధార్థము వలన తెలియును. పుట్టినది గిట్టక తప్పదు. కనుక భవమును అనుసరించుట యనగా పుట్టుట, గిట్టుట, గలిగి యున్నవాని సహాయముతో, పుట్టని గిట్టని బ్రహ్మపదార్థము ఎట్లు అవగతము కాగలదు. కనుక అది అనుభవయోగ్యము కాదు.

"సర్వకాలం యెరుకమ వెరచి పరిపూర్ణమును అవలంభినిచితే చాలు వొక్కచే వ్యవహారము, అంతా తానే, తానే అంతా, 100 అంతా తానే అని దేహ పతన పర్యంతం యీా లాగు యుక్తి యుంటే వ్యవహారమునకు పనిలేదు. ఇది సిద్ధాంతము, యిదే సత్యం, యిదే మహారహస్యం, మహా గూ॥ం యేమిలేదు."

నేను యేమి లేదు – నీవు యేమిలేదు – కోటి ఏమి చెప్పను? నేను నీవు లేక తర్వాత యేది వున్నదో అది వుండ జూచి అదే బయలని నిశ్చయింతుకొని అదే అంతా అని అభ్యాసం చేయవలె. చేస్తే అది అఖండానుభలవరహిత అగును.

నేను వుంటే జ్ఞానం వున్నది, అజ్ఞానం ఉన్నది, అహం అంటే అహంకారము, అహంకార మంటే అహం, నేను అనేది దేహములో వున్నది, నేను ఒక కాలమందు వుండేది వొక కాలమందు లేకపోయేది అహంకారమునకు స్వభావం. నేను గనుక లేక వుంటే లేని మనస్సు లేనేలేదు. లేని మాయలేనే లేదు. గనుక లేని మనస్సు లేక వుంటే వారు పుణ్యపాపరహితులు జన్మ మపణరహితులు, నిష్ఠా నేమ పర్యవసాన - పరిసమాప్తి" - శివ రామ దీక్షితీయము.

# 19. ఎరుక

| దృగ్దృశ్యం యది చిన్మాత్రం। అస్తి చేచ్చిన్మయం సదా<br>సర్వాశ్చర్యం చ చిన్మాత్రం। దేహశ్చి న్మాత్రయే వహి ॥తేజో॥ |
|---|

తా॥ దృగ్దృశ్యములురెండు చిత్స్వరూపములే. ఉన్నవన్నీ చిన్మాత్రములే దేహములన్నియు గూడ చిన్మాత్రములే. ఏలననగా అఖండజ్ఞానరూప యెరుక సర్వస్వరూపముగా పరిణమించెను.

కేవల జ్ఞానమార్గవస్తువగు దృక్కే సర్వదేశ సర్వకాల సర్వ వస్తువులందు పూర్ణముగా నిండి (నువ్వులందు నూనెవలె) సర్వాధిష్ఠానమై సర్వము తానై సర్వాధారమై వెలుగు చుండుటవల్ల మరియు అందుండే ఈ చరాచరజంతు జాలము పుట్టును. దాని నాశ్రయించుకొని జీవించుచు, మహాప్రళయమున దానియందు ప్రవేశించి, లయించుటవల్లను ఆదృక్కే బ్రహ్మ మనబడును.

ఆ పరబ్రహ్మమగు దృక్కే ఏ విధమైన శరీరము లేనిది. సచ్చిదానంద స్వరూపమైనది. అనగా సత్తు, చిత్తు, ఆనంద స్వరూపమైనది. చూచునది దృక్కు, చూడబడునది దృశ్యం. ఏకవస్తువే గనుక దృగ్దృశ్య వివేకమని, అధిష్ఠాన చేతన బ్రహ్మమని మతకర్తల నిర్ణయము. ఈ విధంగా పరిశీలించిన దృగ్దృశ్యములు చిత్స్వరూపముగానున్నవి. అనగా జ్ఞానస్వరూపమై యున్నవి. ఏలననగా అఖండ జ్ఞాన స్వరూపమగు ఎరుకే సర్వరూపములుగా మారింది. 'సర్వంఖల్విదం బ్రహ్మ' అన్ని బ్రహ్మస్వరూపమే. ఎరుగునది ఎరుక బ్రహ్మము. జ్ఞానస్వరూపమైన సమస్తము యెరుకేనని, గుర్తించవలయును.

# 19. పరిపూర్ణపరబ్రహ్మము

| ఆత్మేతి శబ్దహీనోయః। ఆత్మ శబ్దార్థవర్జితః ॥<br>సచ్చిదానంద హీనోయః ఏషై వాత్మసనాతనః॥తేజో॥ |
|---|

ఆత్మ యను శబ్దముగాని, శబ్దార్థ ప్రతి పాదిత వస్తువుగాని తన యందు లేనిది. సత్తు, చిత్తు, ఆనందములు తనయందులేక వున్నదే సనాతనమైన కేవలాత్మ లేక పరిపూర్ణపరబ్రహ్మము.

మొదట ఆత్మఅంటే సమస్త ప్రాణులందు, సమస్త వస్తువులందు బాహ్యాభ్యంతరములనే భేదము లేకుండ వ్యాపించియున్నదానిని ఆత్మయందురు. ఇది ఆత్మకు వ్యుత్పత్యర్థము. ఆత్మశబ్దార్థము ప్రతి పాదించేవస్తువు స్థూలము మరియు సూక్ష్మరూపముగ నున్నది. ఈ భేద, అభేదరూపమై ఖండాఖండములుగా గానవచ్చే ఆత్మ (ఎరుక పరమాత్మ) కేవలాత్మకాదు. ఈ ఆత్మ,పరమాత్మ, బ్రహ్మము, పరబ్రహ్మము అనిపేర్లు పెడితే దాని కతీతమగు దానికి పరిపూర్ణపరబ్రహ్మము అని కేవలాత్మయని, అచలమని వ్యవహారార్థము పేరు పెట్టుట జరిగినది. పరిపూర్ణపరబ్రహ్మము పరిశుద్ధమైనది. "నేహనా నాస్తి కించన" అను ఆత్మశబ్దము గాని దాని శబ్దార్థముగా అందు కొంచెమైనా లేదు. **"యత్రనాన్యత్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి సభూమా"** అనగా ఎక్కడ అన్యమేమియు చూడబడదో వినబడదో తెలియబడదో అది గొప్పవస్తువు దానిని ఆ శ్రుతియందు భూమా శబ్దముచే వాడబడినది. ఈ శ్రుత్యర్థము పరిపూర్ణ పరబ్రహ్మమునే అనువదించుచున్నది. జ్ఞాతవ్య లక్షణములు లేవు. జ్ఞాతృ జ్ఞానజ్ఞేయములు (ఎరుక లక్షణములు ) యేమియు అందులేవు. ఎరుక లేనిదొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. అందు ఎరుక ఎన్నడు, లేనేలేదు. వుండుటకు స్థానముగాని, ఆ యెరుక పుట్టుటకు మూలముగాని మరియెకటి లేనేలేదు. తెలుసుకొనె తెలివియే లేనప్పుడు తెలివిగల వ్యక్తులెవరుండగలరు.

పరిపూర్ణమందు అధిష్టాన చేతన బ్రహ్మ లక్షణములైన సచ్చిదానంద లక్షణములులేవని ఈమంత్రము స్పష్టపరచుచున్నది. వాటిని గురించి తెలుసుకొందాము.

సత్ అనగా త్రికాలమందు ఉనికి కలిగి అనగా భూత, భవిష్యత్, వర్తమాన కాలములందు ఎడతెరిపి లేకుండ యున్నటువంటి వస్తువేదో అదే సత్ అని చెప్పబడును.

చిత్ యనగా నాశనము లేనిదై, అఖండజ్ఞాన స్వరూపమైనదానిని చిత్‌యని చెప్పబడును.

ఆనందమనగా అఖండానంద స్వరూపమై యుండుటయే ఆనందము.

బ్రహ్మకీ సత్‌లక్షణ, చిత్‌లక్షణ, ఆనంద లక్షణ లక్షణములుగా నిర్ణయించబడినవి. కనుక ఈ అధిష్టాన చేతన బ్రహ్మకు సచ్చిదానంద బ్రహ్మమని పేరు వచ్చింది. ఈ మూడు లక్షణములు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము.

సృష్టి స్థితి, లయములకు కారణమైనదే బ్రహ్మము. కారణస్వరూపమైన బ్రహ్మ లక్షణములు కార్యరూపములగు ఈశ్వర జగత్తులందున్నవి. ఈ సచ్చిదానంద లక్షణములు జీవేశ్వర జగత్తునందు కానవస్తున్నవి. అంటే ఎరుకకు నాశనములేదు.

1. అసలు వస్తు వుండుటయే సత్‌లక్షణము. 2. ఆకారవికార రూపపరిణామాదులచే అది తోచబడుటయే చిత్‌లక్షణము. 3. ఆవస్తువు యొక్క ప్రయోజనము పురస్కరించుకొని దాని యందేర్పడు క్రియా మోద ప్రమోదమే ఆనంద

లక్షణము. మానవులందు, పశుపక్ష్యాదులందు ఎండిన గడ్డి పోసయందు ఈ లక్షణములు మనము స్పష్టంగా చూడవచ్చును. సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే సగుణ రూపములో ఈశ్వరుడని పించుకొనుచున్నందున, ఈశ్వరుని యందు సచ్చిదానందలక్షణములున్నవి.

పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఈ సచ్చిదానంద లక్షణములు లేవు.

సచ్చిదానందములు లేనిది సనాతనమైన కేవలాత్మ.

పరిపూర్ణ పరబ్రహ్మము సనాతనమైనది అనగా అతి పూరాతనమైనది. అనాది. ఆరంభము లేనిది అని అర్థములు గలవు. శాశ్వతమైనది. సామాన్యర్థము. ఈ పరిపూర్ణ పరబ్రహ్మ ఎల్లప్పుడు వున్నది. కనుక దీనిని సనాతనము అన్నారు.

## 20. ఎరుక బ్రహ్మము

**ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ ॥**

తా॥ బ్రహ్మమొక్కటియే రెండవది లేనిదై యున్నది.

అద్వైతము శబ్దార్థమును బట్టి బ్రహ్మముగాక రెండవ వస్తువు లేదనియూ, ఆ బ్రహ్మము యెన్నడును రెండుగా మారదనియు మొదలగు భావములు మనకు గానవచ్చును. (పంచ భూతాత్మకమై భూగోళములతో గూడిన). ఈ బ్రహ్మాండములు ఇటువంటివే అనంతకోటి బ్రహ్మాండములున్నట్లు చెప్పుచున్నారు. ఈ బ్రహ్మాండము 84 లక్షల విధములుగా గానవచ్చు భిన్న భిన్న ప్రకృతులు, స్వగతబేధములు, శబ్ద స్పర్శ, రూప, రస, గంధాత్మకమగు నానాత్వములు యిత్యాదిగా శతసహస్రాధికమగు నూన్యా ధిక్యములతో కూడిన విభిన్నత్వములు మొదలుగా సమస్తమును యింద్రియ గోచరమై మానవునికి ప్రత్యక్షానుభూతి గలిగించుచు సత్యత్వ ప్రతీత కలుగు చుండగా "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నాపర" అను అద్వైత సిద్ధాంతము పరమాశ్చర్య జనకముగా నున్నది.

అద్వైత మత ప్రతిష్ఠాపనాచార్యులగు శంకర సిద్ధాంతము ననుసరించి పర బ్రహ్మము నిత్యమై, శుద్ధమై, ఆది మధ్యాంత రహితమై, అద్వయమై, నిష్క్రియమై, నిర్గుణమై, స్వయంప్రకాశమై, సర్వకారణమై, సర్వమునకు ఆధారమును, అధిష్ఠానమును అయి సర్వవ్యాపకమై సచ్చిదానంద లక్షణములే స్వరూపముగా గలదై, మనోవాగగోచరమై యుండునదే పర బ్రహ్మము అని చెప్పబడెను. అది స్వరూప లక్షణము అనగా సహజ లక్షణము. మొదటి రూపము. ఈ సర్వముగల దొక్క బ్రహ్మమే కనుకనే "ఏకమేవ" అన్నారు. అటువంటిది మరొకటి లేదు గనుక ప్రతి లేనిదగుట చేతను "అద్వితీయం" అని అన్నారు. ఈ బ్రహ్మమే సృష్టి స్థితి లయములకు కారణమైనప్పుడు ఈశ్వరుడని పేరు. ఇది బ్రహ్మమునకు తత్కాలమందు తటస్థించిన లక్షణ మందురు. కాకి కూర్చున్నదే దేవదత్తుని గృహము అని చెప్పినచో, కాకి ఇంటి పైనుండి మరుక్షణము ఎగిరిపోయిన

యెడల దేవత్తుని గృహవర్ణనము అసమగ్రమగును. ప్రమాద హేతువును కాగలదు. అట్లే తటస్థ లక్షణముచే పరబ్రహ్మమును నిరూపించి చెప్పుటయు అంతే అసమగ్రహము కాగలదు. అట్లుగాక యుత్కృష్ట ప్రకాశము గలవాడు చంద్రుడని జెప్పిన యెడల అసంఖ్యాక నక్షత్రముల మధ్యనున్న యా చంద్రుని తేలికగా గుర్తించగలము. వీనినే స్వరూప లక్షణ మందురు. స్వరూప స్వభావములచే మాయాతీతుడై, నిర్గుణుడై, నిష్క్రియుడై యున్న బ్రహ్మము నిర్గుణ బ్రహ్మమనియు, తటస్థ భావమున మాయాశబళితమై యున్న బ్రహ్మచైతన్యము (లేక ఈశ్వరుడు) సగుణ బ్రహ్మమని అందురు. కనుక ఏకమేవా ద్వితీయం బ్రహ్మ అని అన్నారు.

## 20 పరిపూర్ణ పరబ్రహ్మము.

**ఏకాభావే ద్వితీయంన, నద్వితీయే నచైకతా**
**సత్యత్వమస్తి తేత్కించి దసత్యం। నచ సంభవేత్॥** ఋభుగీత ప్రథ ॥ 25 శ్లో॥

తా॥ ఒకటి లేనప్పుడు రెండవది లేదు. రెండవది లేనప్పుడు ఒకటనేది లేదు. సత్యముంటే అసత్యముండును. అసత్యములేకుంటే సత్యమూ లేదు. అపుడు పరిపూర్ణమే యుండును.

అంకెలలో 0 నుండి 9 వరకు సంఖ్య లున్నవి. చిన్న సంఖ్య మొదలు అతి పెద్దసంఖ్య ఈ పదింటితో కూర్చబడును. 1 మొదలు 9 వరకు సృష్టికి సంబంధించి ఆ సున్న నుండియే వచ్చినవి. ఒకటి అనే అంకెకు పూర్వమున్న సున్నను కొందరు అసత్తు శూన్యము అన్నారు. కొందరది శూన్యముగాదు పూర్ణమన్నారు. అసత్తు అన్నారు. సున్న అనే మాటకు శూన్యమనేది సంస్కృత శబ్దము. ఆ వస్తువు (సున్న లేక శూన్యము) అసత్తు మరియు సత్తు అయివున్నది. ఈ ద్వంద్వస్వరూపముగా నున్న సృష్టి కారణమగు బ్రహ్మము సత్యమైనది మనోవాగ గోచరముగాని పరిపూర్ణ పరబ్రహ్మముకాదు. "నసత్తన్ నసదుచ్యతే" అది సత్తు కాదు, అసత్తుకాదు. పరిపూర్ణ పరబ్రహ్మము సదసద్రహితమైనదని అచల ఋషులు నిర్ణయించినారు.

సృష్టిక్రమమును పరిశీలించిన మొదట పరబ్రహ్మస్వరూపము ఏకముగానున్నది. అంటే ఒకటిగానున్నది. **"శంకలు దీరెను వినుమది। అంకెలలో ఒంటినొకటి ఆత్మనబడునూ"** అని శ్రీ భూమానంద మందిప్పల హనుమంత దేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు. ఈ బ్రహ్మమునకు సంవిత్తు, సచ్చిదానందము, ఆత్మ, పరమాత్మ, అహం, నేను అను పర్యాయ పదములచే వ్యవరించబడుచతున్నది. ఈ అహం నేను ఒకటి అంకెను సూచిస్తుంది. ఒకటినుండి ఈ జీవేశ్వర జగత్తు వచ్చినది. అదెట్లనగా తాను తానుగా నున్న స్థితిలో తనలో బీజ రూపములో గల త్రిగుణ సామ్య శబ్ద వ్యవస్థ విజృంభించుటవల్ల "అహం బహుస్యాం" అనే సంకల్పము గలిగి **"ఏకం అనేకం భవతి"** గా అనేక మాయెను. ఆ అనేకము జడస్వరూపముగా నుండుట వల్ల తాను "తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్" గా తానే అన్నిటి యందు అనుప్రవేశము జేసెను. ఈ

విధముగా తనవల్ల తనతో కూడి ఈ జీవేశ్వర జగత్తుగా పరిణమించినది. అనగా రెండంకెల నుండి 9 వరకు గల సంఖ్యల సమూహమే ఈ జీవేశ్వర జగత్తు. ఈ క్రమమును మనము ఇక్కడ "రెండవదిగా" పరిగణింతుము అంటే బ్రహ్మము ఒకటి, అపరబ్రహ్మనుండి అయిన జీవేశ్వర జగత్తు రెండవది.

మన పరిశీలన యందున ఈ శ్రుతి యందలి భావమును పరికించిన తత్వ విచారణతో ఒకటి లేనప్పుడు రెండవది లేదు. రెండులేనప్పుడు ఒకటనేది లేదు. ఈ భావమును అన్వయ వ్యతి రేకముగా ఆలోచించిన ఒకటుంటే రెండవది వుండును. రెండవది లేకుంటే ఒకటనేది లేదు అని స్పష్టము. అప్పుడున్నదిశూన్యం అంటారు. శూన్యం కాదు. ఏమిలేదు ఏమి లేనప్పుడు యేముండును. అంటే పరిపూర్ణ పరబ్రహ్మమే యుండును.

సంఖ్యాపరంగా ఆలోచిస్తే 0 తర్వాత ఒకటి దీనితర్వాతి సంఖ్య రెండు. ఈ 2 రెండ్లెట్లుయింది అంటే 1+ 1 = 2 రెండయింది. రెండును గూర్చి విచారించాలంటే, ఒక పండు జతకు ఇంకొక పండు చేర్చి చూపి ఒకటి +ఒకటి రెండయింది. అని ప్రత్యక్షంగా చూపిస్తున్నాము గదా! అంటే రెండు అనే అంకె ఒకటి అనే దాని నుండే యేర్పడినది. ఒకటి అనే దానికి వునికి లేకపోతే 2 అనే అంకెకు వునికి లేదు. అట్లే తొమ్మిదంకెల వరకు ఒకటి దాని తర్వాత ఒకటి, దానికి మరొకటి ఉత్తరోత్తర చేర్చుటవల్ల తొమ్మిది ఏర్పడును. కనుక ఒకటి లేకుంటే మిగతా సంఖ్యలకు వునికి లేదని గ్రహించినాము. గనుక ఒకటి లేకుంటే రెండవది లేదనేది సరియైనదని గమనించితిమి.

ఇక రెండు లేనప్పుడు ఒకటనేది లేదు. పైన మనము గమనించిన సంఖ్యల క్రమమును పరిశీలించిన రెండంకెలు కూడిన 1+ 1= 2 అగును. ఆ రెండు లేనప్పుడు ఒకటనేది లేకుండా పోవునని తెలుసు. ఎట్లనగా 1+ 1= 2 ఈరెండు లేనప్పుడు అంటె 1+1తో కూడి అయిన ఆ రెండొకట్లు కూడ లేనివగును. గాని అందు ఒకటి పోయి మరొకటి మిగులదు గదా అని గ్రహించ వలసియున్నది. ఈ విధముగా పరిశీలిస్తే రెండు లేనప్పుడు ఒకటి కూడా లేనిదే అగునను విషయమును ఈ శ్రుతి బలపరుచుచున్నది. ఒకటైన బ్రహ్మము లేనప్పుడు ద్వంద్వముగా తోచు ఈజీవేశ్వర జగత్తు లేదు. పరిపూర్ణమే యున్నది.

ఒకటి కూడ లేనప్పుడు శూన్యము అని అందురు. ఇట్లనుట సరిగాదు. ఎందుకనగా ఆ విధముగా శూన్యమును లేక ఏమిలేమిని గుర్తించేవాడు వాని గుర్తు (అహం నేను) ఇంకా మిగిలి యున్నట్లే గదా! కనుక అచల ఋషులు ఈవిధముగా గుర్తించు శూన్యమును లేక లేమిని అతిక్రమించ వలయునని సిద్ధాంతము జేసియున్నారు. అట్టి శూన్యమును మహాశూన్యముగా జేసిన అచట సత్తు, అసత్తు లేకుండును. అప్పుడే అచల పరిపూర్ణ పరబాహ్యము అపరోక్షము. అపుడింక అట్లున్నది ఇట్లున్నది అనువారే లేరు.

మరుపనగా తొలిమేనులు మూడు - స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు. ఎరుకగా నాల్గవ శరీరము అదే మహాకారణ శరీరము. అదే ఆత్మ, (బ్రహ్మము) తన స్వస్థానున నుండుట. తొలిమేనులు మూడు అజ్ఞానము. మహాకారణ శరీరము జ్ఞానస్వరూపము. ఈ అర్థమును అన్వయ వ్యతిరేకముగా జెప్పిన మహాకారణ శరీరమనగా నేను. ఈ నేను యే సంవిత్తు, ఆత్మ బ్రహ్మము జ్ఞానము తెలివిగా వ్యవహరించబడుచున్నది. ఇది ఒకటి. ఈనేను లేకుంటే మేను (స్థూల శరీరము లేదు. అంటే రెండవది లేదు. రెండవదైన మేను లేకుంటే నేనుకు ఉపాధి లేకుండా పోవును. కావున మేనుకు స్థానము లేదు. ఈ నేను, మేనులు ఓత ప్రేతమై యున్నవి.. ఒకటి లేకుంటే రెండవది లేదు. ద్వంద్వ స్వరూపమైనవి. పరిపూర్ణ పరబయలు ఈ ద్వంద్వ స్వరూపము గల ఎరుక, మరుపులకు ఆవల యుండునది. కనుక మూలము లేని ఎరుకను సద్గురు వాక్కుచే నెగుర గొట్టినచో అది నిలువ జాలదు. మూలములేనిది సత్యవస్తువుగాదు. కనుక పరమ సత్యమైనది పరిపూర్ణ పరబ్రహ్మము. అందు ఈ నేను (అహం) ఉన్నదనుట భ్రాంతి. ఈ అహమునకు అందు స్థానము లేదని ఎగుర గొట్టినచో, నిలువజాలదు. ఎరిగే ఎరుక లేక పోయిన పిదప అచల పరిపూర్ణ పరబయలున్నదని ఎరుగువారు లేరు. కనుక జనన మరణ రహితమునకు ఈ పద్ధతి చాలును.

పరమాత్మకు (అఖండ ఎరుకకు) సచ్చిదానంద స్వరూప లక్షణమని చెప్పబడినది. అంటే ఎరుకకు నాశనముంటే దానిని సద్రూపమని అనకూడదు గదా! పరిపూర్ణబోధచే ఎరుక రహితమగు అంటున్నారేమి? అని సందేహము కలుగవచ్చును. రజ్జు సర్పము వలె ఎరుకయు ఎల్లప్పుడు యెల్లరకు తోచుచుండును గాని, ఆ ఆరోపిత సర్పము వలన అది ఆరోపితమని యెరిగిన వారికి మాత్రము అది భయ భ్రాంతులు ఎట్లు కల్గించనేరవో అట్లే పరిపూర్ణ మందు లేకనే తోచిన యెరుక పరిపూర్ణభావజ్ఞులకు మాత్రం ఎట్టి భయభ్రాంతులు, ఆశామోహములు, కలిగించదు. ఇది ఎరుక యందలి భ్రాంతి రహితమే గాని ఎరుక రహితము గాదు. ఇట్టి భ్రాంతి రహితులు రజ్జు సర్పమువలె ఎరుక లేనే లేదని ఆరూఢత కలిగి యుందురు. ఆ ఎరుక వారికేవిధముగానూ బాధాకరమై యుండదు.

ఇంకా కొంత వివరించ వలసిన అవసమున్నది. పరిపూర్ణ సిద్ధాంతరీత్యా పరిపూర్ణమందు ఎరుక అసత్యము గాని, ఎరుక యందు ఎరుక సత్యమే. ఏలననగా మేను, ఎరుక అను రెంటిలో ఒక దానికొకటి కారణముగాను ఆధారముగాను అధిష్ఠానముగాను వున్నవి. మేను ఎరుకలు రెండు ఎరుకే. లేక రెండూమేనే. కనుక ఎరుక యందు ఎరుక సత్యమన్నారు. జగత్తు కేవలం పారమార్థివముగా మిథ్యా అన్నారే గాని వ్యవహార సత్యత్వము గలదన్నారు ఆదిశంకరులవారు. జగత్తు కేవల శూన్యమే అయితే నది దాటుటకు నావ ఎందుకు? నది కడ్డముగా నడిచిపోరాదా ?

పరిపూర్ణపరబ్రహ్మమందు ఎరుకకు యేవిధంగాను ఉత్పత్తికి కారణములేదు. ఎరుకకు ఎరుకనే మూలము గాని వేరే కారణములేదని వారి అభిప్రాయముగాని కార్యరూపమగు జీవేశ్వర జగత్తు లేనే లేదని అచల ఋషుల అభిప్రాయముగాదు. అందుకనే ఈ జీవేశ్వర జగత్తు లేనిదే అయితే నీ దారి కడ్డముగా గోడ ఒకటున్నప్పుడు గోడ కడ్డముగా పోక దర్వాజుగుండా ఎందుకుపోతున్నావు? అని ప్రశ్నిస్తున్నారు.

ఎరుక పుట్టినదంటే దేనివల్ల? ఎవరికి? అనే ప్రశ్నలు వస్తాయి. ఎరుక తనకు తానే వచ్చింది. తన రాకకు మరొక కారణముకాదు అని అచల ఋషుల జవాబు.

పరిపూర్ణమందు ఈ లేనెరుకకు స్థానములేదు. పోయెటందుక మరొక స్థానములేదు. ఎరుక జగములుగా భాసిస్తున్నది. ద్వంద్వరూపముగా నిరంతరము మారుతున్నది. నిత్యమనరానిది కనుక ఎరుక పరిపూర్ణ సిద్ధాంత రీత్యా ఉండి లేనిదైయింది. దానికి వ్యవహారిక సత్యత్వము వున్నది.

శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం భ్రమేణోపాసకజనః
భ్రమేణీశ్వర భావత్వం భ్రమమూలమిదం జగత్ ॥

లక్ష్యార్థముగా పరమాత్మ ప్రత్యగాత్మలు, జీవేశ్వరులు ఈ సమస్తవిశ్వము కూడా భ్రాంతి కల్పితములే. జగత్తే సర్వభ్రాంతులకు మూలము.

కనుక గుర్తించే తెలివి యున్నంతవరకు భ్రాంతులన్ని తీసివేసిన కొలది చిగిర్చుచునే యుండును. ఆ గుర్తించే తెలివి పరిపూర్ణపరబ్రహ్మమునందు లేకనే తోచును. కనుక అదే తొలి భ్రాంతి. ఆ తొలి భ్రాంతి రహితము నందు తప్ప సర్వభ్రాంతి రహితముగాదు. "**భ్రాంతి రహితం మిదం మోక్షం**" కావున ఇట్టి పరిపూర్ణ బోధన ఆశ్రయించిన వారందరికీ భ్రాంతి రహితమగునట్లు ప్రసాదించి కృతార్థులను గావించుమని సద్గురుని ప్రార్థించుచున్నాను.

**సత్యముంటే అసత్యమున్నూ యుండును. అసత్యములేకుంటే సత్యము లేదు.** ముందు సత్యమంటే ఏమిటో తెలుసుకొందము. ఏవస్తువునైనా ఏకాలములో గాని తన రూపాన్నుండి తొలగదో అది సత్యము. ఒకసారి యిది ఈ వస్తువు యొక్క స్వరూపము అని నిర్ణయింపబడిన తర్వాత ఏవస్తువు అన్ని కాలాలలోను 'అదే స్వరూపము గలదిగా వుంటుందో ఆవస్తువు సత్యము. ఈవిధముగా చూస్తే బ్రహ్మమొక్కటే పరబాహ్యము సత్యము. త్రికాలా బాధ్యమైనది, అనగా భూత, భవిష్యత్ వర్తమాన కాలంలో ఎలాంటి మార్పు లేనిది సత్యము.

**శ్లో॥ త్యజధర్మ మధర్మంచ ఉభేనత్యాన్నృతేత్యజ ।**
**వుభే సత్యా నృతేత్యక్త్వా యేన త్యజసి తత్యజ॥**

తా॥ ధర్మాధర్మములను సత్యాసత్యాములను వదలి వేయుము, దేనిచేత వానిని వదలి వేసితివో దానిని కూడ వదలి వేయుము.

ఈ శ్లోకమున సత్యా, సత్యములు రెండు ద్వంద్వములు. ఇది సత్యము, యిది అసత్యము అని నిర్ణయించుటకు, ఆ సత్యాసత్యములందు ప్రవర్తింపజేయుటకు గుర్తెరిగే శరీరమే మూలకారణమై యున్నది. ఏలననగా గుర్తెరుగకుండా ఎవరున్నూ యే కర్మచేయరు. ధర్మాధర్మ నిర్ణయములు చేయునది ఈ గుర్తెరిగే శరీరమే. అనగా ఎరుకయే. సత్యాసత్యములను విడువు మన్నారంటే సత్యమును, అసత్యమును నిర్ణయించి సత్యమును సత్యముగా గుర్తెరిగి యాచరించుటయు, మరొకటి అసత్యమని మానుటయు ఎరుక క్రియలే కావున యేరుకనే ఈ గుర్తెరిగే శరీరమునే విడువుమని ఆదేశించినట్లే. సత్యమను శబ్దమునకు ఆత్మయనియు, జగత్తు అనృతము (అసత్యము) మిథ్య అని చెప్పబడుచున్నది. అప్పుడు సత్యా సత్యములను (యెరుక మరుపులను) వదిలివేయమని చెప్పినట్లే అగును.

సత్యాసత్యములు, జ్ఞానాజ్ఞనములు ధర్మాధర్మములు సమస్త సాపేక్షిక ద్వంద్వములు ఎరుకనే గాని అందేదియు పరిపూర్ణపరబయలు గాదు. పరిపూర్ణ పరబ్రహ్మము నిరపేక్షికము నిర్ద్వంద్వము. ఏకానేకములు గానిది. ఏమని నోటితో అనరానిది.

పరిపూర్ణ బోధచే పరిపూర్ణ మెరుకలను తెలసి యెరుక లేనిదేయని దృఢంచేసుకొన్నమీదట ఆ ఎరుకే బ్రహ్మమనే తన పూర్వభావమును, భ్రాంతిని పూర్తిగా వదిలివేయుటయే యెరుకను విడుచుట. ఇదంతయూ భావనా రూపమే. కనుక "యెరుక చేతనే పట్టి తీసివేయరా" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు.

అసత్తు నుండి సత్తు వచ్చింది. అసత్యము నుండే సత్యము వచ్చింది. కనుక అసత్యము లేకుంటే సత్యము లేదు. సత్యము లేకుంటే అసత్యము లేదు. రెండును లేనప్పుడు పరిపూర్ణబయలే యుండును గాని దానిని తెలుసుకొను వారెవరుందురు. ఎందుకనగా **నేను లేనప్పుడు అది.** ఎరుక లేనప్పుడే పరిపూర్ణ మపరోక్షము. నేను లేనని నాకు గురువాక్యము ద్వారా దృఢమైతే అప్పుడు నేను (ఎరుక) లేను. ఉన్న దొక్క పరిపూర్ణపరబయలే.

**శ్లో॥ అశరీరం సర్వదాస్తి శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి రన్యదా భ్రమ కారణం॥**

తా॥ శరీరములేని పరిపూర్ణపరబ్రహ్మము ఎప్పుడూ వుండి వున్నది. శరీరము ఎప్పుడునులేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి లభించుచున్నది. ఇతర సిద్ధాంతములు భ్రాంతి కారకములే యగుచున్నది.

**ఫల ప్రాప్తి:** కేవల జనన మరణ భ్రాంతి రాహిత్యమే ఉత్తమ ఫలము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "అయామాత్మ బ్రహ్మ" అన్నియు నేనే. నేను కానిది ఏమిలేదు. **"అజోహం అమరోహం"** నేను పుట్టనివాడను. చావని వాడను. కనుక నాకు మూలము కూడా ఉండజాలదు. అయితే నాయందే సర్వము తోచుచున్నది. ఆ తోచబడినవన్ని నేనే. కనుక నేను నన్ను చూచుకొని భ్రాంతి చెందుచున్నాను. కనుక భ్రాంతికి మూలము

నేనే. భ్రాంతి రహితము కావలెనంటే అన్నిటికి అత్యంత మూలకారణమగు నేనున్నంత వరకు భ్రాంతి కలుగుచునే యుండును. కనుక నేను లేకపోవలెను. నేను లేనిచో భ్రాంతి కారణమే లేదు. భ్రాంతి సమూలముగా నాశనమగుచున్నది. నేనే లేకపోతే ఏముండును? ఏమో ఏదో వుండును. కాని దానిని వర్ణించుటకు తలంచుటకు నేనుండను గదా! అదే వాచాతీతము, మనోతీతము. దానినే పరిపూర్ణమని అచల ఋషులు పేరు పెట్టినారు. అది యున్నదని వేదోపనిషత్తుల సిద్ధాంతము. దాని యందు సర్వమునకు మూలకారణమైన నేను లేను అని దృఢమగుటయే ఈ బోధవలన ఫలము. ఇట్టి ఫలము గురుకృపవల్లనే సాధ్యము. గురుడు నరుడే అనే భావన గల వానికి గురుకృప కలుగదు. గురుకృప గలవానికే గురుబోధ ప్రసాదించబడును. క.ప. 2 **"మాట లేనట్టి బయలున । మాటగలిగె ననుట వినుట । మాయగదయ్యా । మాట మాయైతె మానెను। మాటను మాట్లాడి మనము । మానుదమవలన్॥** తా॥ ఓ అయ్యలారా ! మాట లేనట్టి పరబయలు నందు మాట కలిగినదని అనడము మాయ యని నిర్ణయముగా ఉన్నను విధివిధానము తెలుసుకొనక యుండిన ప్రయోజనము లేదు. అది ఎట్లు మాయనో, దాని విధి విధానమును ఇంతవరకు మాట్లాడి తెలుసుకొన్నాము. అట్లు తెలివి (ఎరుక) చే తెలుసుకొనిన దానిని వదులుటయే ఫలము అనియు క.ద. **179 నామాటలెస్స వినుమా సామాన్యంబనుచు జూడ జనదీ బోధన్ । ప్రేమాతి శయమునన్ గని వేమారిది గురుని నోట వినవలె సుమ్మీ. నిత్యము చదువు కొనవలె నమ్మీ."** అని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు సెలవిచ్చి యున్నారు. తాను దైవముగా నుపాసించు గురుని నోట విన్నప్పుడే ఫలము సిద్ధించును.

మహబూబ్‌నగరము జిల్లా నవాబుపేట మండలము ఇప్పటూరి గ్రామవాస్తవ్యులు కురువిణశెట్టి , జాంద్ర వంశజులు సిద్ధాంతముని (మెణుసు) గోత్రీకులు కీ॥శే॥ మంత చిన్నమ్మ, మంత ఎల్లప్ప పుణ్యదంపతుల ద్వితీయ పుత్రుడు శ్రీ మదచలర్షి ప్రబోధానందమల్లు వెంకట రెడ్డాఖ్యరాజ యోగి ప్రియశిష్యుడు గురుదీక్షాదక్ష చిన్మయానంద మంత చిన్నయ్యచే పరిపూర్ణము ఎరుక తారతమ్యము – శ్రుతి స్మృతుల ప్రమాణములకు కూర్చిన భావార్థములు సమాప్తము.

**సర్వం మత్ సద్గురు చరణారవిందార్పణమస్తు**



**శ్రీమతి మంత చిన్నమ్మ సమేత మంత ఎల్లప్ప**
**గ్రంథకర్త తల్లిదండ్రులు**



**శ్రీమతి అ॥ప॥ మంత భద్రమ్మ సమేత**
**చిన్మయా నంద మంత చిన్నయ్య**